"రాజరాజు"—ఆంధ్ర సాహిత్యానికి తొలిపాదు పెట్టిన రాజరాజనరేంద్రుని కథ. ఆంధ్ర సాహిత్యానికి శ్రీకారంచుట్టిన మరొక ప్రధాన పాత్ర. నన్నయ ధర్మాభిరతికి దివిటీపట్టే హృందారచన. చిత్రాంగీ-సారంగధరుల కథను కొత్తతీరులో మలచిన విలక్షణ నాటకం. శాస్త్రిగారి సంభాషణా చాతుర్యం, ఆనాటి రాచనగరు వాతావరణ చిత్రణ పరాకాష్ఠనందుకున్న కథనం.

* * *

నన్నయ్యభటు :

"తమరు మహాభారతం తమపేర ఆంధ్రీకరించమని ఆజ్ఞాపించినప్పుడు తాము ధర్మరక్షకులుగా వుండడంవల్లనే అంగీకరించినే నందుకు వూనుకున్నాను........కాని, యివాళ, యిలాగ వైదిక ధర్మం కాలరాసేసిన తమ పేరుమీదుగా ఆ పంచమ వేదం ఇంకా ఆంధ్రీకరించడం చాలా అనుచితమైన పని .......కనక, యింతటితో నే నది కటిపెట్టేస్తున్నాను."

RAJARAJU

*By*

SRIPADA SUBRAHMANYA SASTRY

*First Edition:*
*Oct.,* 1944

*First Print in :*
EMESCO Pocket Books, *March* '70

*Publishers:*
M. SESHACHALAM & CO

*Printers:*
**Weldun Press,**
Madras-21.

*Cover Design:*
**Bapu**

*Distributors:*
**Andhra Pradesh Book Distributors**
Rastrapathi Road, Secunderabad.

Rs. 2/-




117



కీ. శే. శ్రీ శ్రీపాద
సుబ్రహ్మణ్యశాస్త్రి

# శ్రీపాదవారి రాజరాజు

బలిష్ఠమయిన శరీరం; చామనచాయ; భారీ విగ్రహం; ముమ్మొం దుగా ముఖంమీద కొట్టవచ్చినట్టు స్ఫురించే గట్టి పట్టుదల. స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారిని స్మరించుకోగానే ఆయనతో చిరకాల స్నేహం పెంపొందించుకున్నవారి కెవ్వరికయినా మొట్టమొదటగా ఇటు వంటిమూర్తి కట్టెదట గోచరిస్తుంది.

అన్నింటికన్న ఎన్నదగినది, శ్రీ శాస్త్రిగారి విపరీతమయిన పట్టుదల. అందువల్ల చాలామందికి ఆయనతో సరిపడేదికాదు. ఆకాలంలో శ్రీపాదవారి అభిప్రాయాలు కొన్ని పలువురికి బాగా విడ్డూ రంగా కనిపించేవి. అయినా శ్రీ శాస్త్రిగారి "నిండు మనంబు నవ్య నవనీత సమానము!"

నడిచినన్నాళ్లు శ్రీపాదవారి "ప్రబుద్ధాంధ్ర" పత్రిక దేశంలో గొప్ప చైతన్యము, సంచలనము కలిగించింది. "హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం" అన్న శీర్షికతో ఆనాడాయన విరివిగా హిందీ వ్యతిరేక ప్రచారం కొనసాగించారు. అయితే ఆ రోజుల్లో

బిల్లిగా అల్లుకుపోయిన గాథ ఆధారంగా శ్రీ శాస్త్రిగారీనాటకం రచించారు.

అయితే భట్టారకుని భారతం అరణ్యపర్వం మధ్యలోనే ఎందు చేత నిలిచిపోయింది? ఈ ప్రశ్న నేటికి ఆంధ్రవాఙ్మయ చరిత్రకారుల కందరికి కొరకరాని కొయ్యగానే నిలిచిపోయింది. కాని దీనికి ఈ నాటకంలో శ్రీ శాస్త్రిగారొక గట్టి కారణం చూపించారు. ఇలాగే చరిత్ర ప్రసిద్ధమయిన విజయాదిత్యుని తిరుగుబాటులోకూడా కొంత ఔచిత్యం స్ఫురింపజేశా రాయన.

కాని ఈ నాటకాని కంతటికి పునాదిరాయివంటి చిత్రాంగీసారంగధరుల దుఃఖాంతప్రేమ ఘట్టానికి ఎక్కడ చరిత్రాధారం లభించడం లేదు.

వాస్తవానికి ఈ చిత్రాంగీ సారంగధరు లిద్దరు చారిత్రిక వ్యక్తులు కారు. కాని సారంగధరుని గాథ అప్పకవి కాలంనించి తెనుగుదేశంలో బాగా వ్యాపించింది. ఈ కథ ఆధారంగా బయలు దేరిన సారంగధర నాటకంలో చిత్రాంగి విచిత్ర స్వభావోన్మీలనంతో స్థానంవారి కీర్తి మన రంగస్థలంమీద జేగీయమానంగా గణుతికెక్కి నది. ఇప్పటికి రాజమహేంద్రవరం పరిసరంలో "ఇదిగో, ఇది సారంగధరుడి మెట్ట" అని ఒక గుట్టవైపు వేలెత్తి నిర్దేశిస్తున్నారు.

తెనుగు దేశంలో ఇంత ప్రబలంగా పాతుకుపోయిన ఈ గాథ కేదో కొంత చరిత్రాధారం ఉండి తీరాలన్న అభినివేశంతోనే శ్రీపాదవారీ నాటకం రచించి ఉంటారు. చారిత్రిక యథార్థతలోకన్న, కాల్పనిక యథార్థతలోనే ఎక్కువ నిజమున్నదని ఒకొక్కప్పుడు మన కనిపిస్తుంది. ఈ నాటకం చదివిన పాఠకుల కందరికి ఇదేవిధమయిన అభిప్రాయం కలుగుతుందని నేననుకుంటాను.

# అంకితం

తాము, గ్రాంధిక భాషావాదులే అయ్యుండిన్నీ,
కవి, తన రచనలో విశిష్టత కనపరచలిగితే,
ప్రభుధర్మం పురస్కరించుకుని
వ్యావహారిక భాషారచనలు కూడా
మనస్ఫూర్తిగా ఆదరించగల

రసలుబ్ధులు, జయపురాధీశ్వరులు, సాహిత్యసమ్రాట్టు,
కళాప్రపూర్ణులు, విద్యాసాగరులు, డాక్టరు,
శ్రీశ్రీశ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారికి
పరమాదరభావంతో ఈ నాటకం అంకితం చేస్తున్నాను.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ఉపోద్ఘాతం

మొదటి ఆంధ్ర భాషాపోషకుడైన రాజరాజుకు సంబంధించిన యీ కథకు, మొదటి ఆంధ్రమహాకవి నన్నయభట్టూ, మొదటి ఆంధ్ర గ్రంథం ఆంధ్ర మహాభారతమూ జతపడందీ పరిపూర్ణతలేదు.

ఈ వుద్దేశంతో సరికొత్త రూపందిద్ది, సాహసించి యీ నాటక రచనకు పూనుకున్నపు డొకటీ, రచన సాగినకొద్దీ మరొకటీ— రెండు బెంగలు పట్టుకుని నన్ను కలవర పెట్టాయి.

వాటిలో మొదటిది:—

సంస్కృతభాషాభ్యాసం తాత్కాలికంగా విరమించుకున్నప్పుడు, మా పెద్ద అన్నగారి సలహామీద, నేను చదివిన మొదటి ఆంధ్ర గ్రంథం నన్నయభట్టు భారతభాగం.

అది చదవడంలో, అనుభవంలోనే వుండిన సంస్కృతభాషా మాధుర్యం యెక్కువ కానడం అలా వుండగా, ఆంధ్రభాష తియ్యదనమూ, ఆంధ్ర వాఙ్మయం విలక్షణతా గుర్తుకు వచ్చి నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

పుస్తకసంపాదన అసాధ్యం అయివుండిన ఆ చిన్నతనంలో— పుస్తక వ్యాసంగం కేవలమూ పిచ్చిపని అనే భావంగల ఆ పల్లెటూళ్ళో, రమారమీ రెండు సంవత్సరాలు నేను ఆ వొక్క గ్రంథంతోటే కాలక్షేపం చెయ్యవలసి వచ్చింది.

తరవాత్తరవాత, వొక్కొక్కటే ఆంధ్రగ్రంథా లెన్నో సంపాదించనూ సంపాదించాను, ఆత్రంగా చదవనూ చదివాను; కాని నన్నయ రచనకూ వాటికీ నాకు పోలిక కనబడలేదు.

అయినా, విరాటపర్వాదిక మైన శేషభారతమూ, హరివంశమూ, భాగవతం ఉత్తరఖండమూ, శృంగార నైషధమూ, ఆముక్తమాల్యదా, మనుచరిత్రా, పారిజాతాపహరణమూ, వసుచరిత్రా, ప్రభావతీప్రద్యుమ్నమూ, పాండురంగ మాహాత్మ్యమూ, విజయవిలాసమూ అప్పటికీ యిప్పటికీగూడా నేను విడిచి వుండలేను.

అయితే, తిక్కన్నా, ఎర్రాప్రగ్గడా, శ్రీనాథుడూ, కృష్ణరాయడూ, పెద్దన్నా, తిమ్మన్నా, రామరాజభూషణుడూ, సూరన్నా, రామలింగడూ, వెంకన్నా జ్ఞాపకంవస్తే నాకు ప్రభుత్వమూ నైపుణ్యమూ స్ఫురించి మనోల్లాసం కలుగుతుంది.

పోతన్న జ్ఞాపకంవస్తే రేపల్లెవాడలో మకాం వేసినట్టుంటుంది.

నన్నయభట్టు జ్ఞాపకంవస్తే మాత్రం బ్రహ్మత్వం స్ఫురిస్తుంది. నిసర్గ మాధుర్యం అనుభూతమై కొత్తప్రపంచంలో పడ్డట్టున్నా అవుతుంది.

నిజంగా, వాల్మీకి రామాయణంలో లాగ, వొక్క నన్నయ భారత భాగంలో మాత్రమే, నాకు, భాషలోనూ భావనలలోనూ పోకళ్ళలోనూ ఆర్ష సంప్రదాయాలు కనపడతాయి.

ఈ సన్నివేశం నన్నయ భట్టుమీద నాకు, అనన్యసాధారణాలైన భక్త్యాదరాలు కలిగించింది.

అలాంటి నన్నయ భట్టారకుణ్ణి యథాతథంగా నేను రంగస్థలానికి తేగలనా ?

తేగలిగానా ?

నాటక రచన అంతా వొక యెత్తూ నన్నయపాత్రచిత్రణం వొకటీ వొక యెత్తూ అయింది నాకు.

ఇంచేత, యీ నాటకం భారతిలో ప్రకటించినప్పుడు నా గుండెలు పీచు పీచు మంటూనే వుండినాయి.

ఈ స్థితిలో, నన్నయభట్టు అంటే నాకంటే యెక్కువగా భక్త్యావేశం అనుభవించే కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు, నిశితసమీక్ష చేసి భారతిలోనే నా నన్నయపాత్రను మెచ్చుకున్నారు.

ఇక రెండోది, —

ఎనిమిదో రంగం రచన పూర్తి అయాటప్పటికి, సాహిత్య సంపన్నులైన రసికునకు ఈ నాటకం అంకితం చెయ్యాలని నాకు సంకల్పం కలిగింది.

ఇందుకు తగ్గవారు శ్రీశ్రీశ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజులుంగారే అని ఝుడితిప్ఫురణ కూడా కలిగింది.

వారు ప్రభువులు.

ఆంధ్రభాషావాఙ్మయాల యెడల అంతటి ఆదరాభిమానాలు గల విద్వత్ప్రభువు మనకి మరొకరు లేరు.

వారు బహుశ్రుతులు.

సాహిత్యంలో వారికి తెలిసినన్ని సంప్రదాయాలూ, లోతుపాతులూ మెళుకువలూ తెలిసినవారు దేశంలో యేకొద్దిమందో మాత్రమే వున్నారు.

వారు రసికులు.

పండితులలోనూ, కవులలోనూ వారు, తారతమ్యాలు లెస్సగా గుర్తించ గలరు. వారి రచనలు చదివి, విమర్శించి, గ్రహించి, ఆనందించి ప్రశంసకూడా చెయ్యగలరు.

వారు అపరభోజులు.

సాహిత్య గోష్ఠిలో వారు తలమున్కలు కాగలరు. కవులెంత విలాసగా రచనలు చెయ్యగలరో, వారు, వారికంత విలాసగా సత్కారాలు చెయ్యగలరు.

ఇన్ని—ఇంకా యెన్నో — యోగ్యత లుండీన్నీ, వారు నిరాడంబరులు.

ఒకప్పుడు మహారాజులుంగారు, మా రాజమహేంద్రవరంలో పదిహేను దినా లుండినారు. ఆ పదిహేను దినాలూ బసలో సాహిత్య గోష్ఠి. బయట నిత్యమూ ఎన్నో విధాల సభలకు అధ్యక్షత. మావూరి సాహిత్య వ్యవసాయు లెందరో వారి దర్శనం చేసుకున్నారు. కాని ప్రబుద్ధాంధ్రలో జరిగిన తీవ్ర చర్చలను పురస్కరించుకుని, శంకించి, నేను మాత్రం దర్శనం చేసుకోలేక పోయాను.

ఈ సంగతులు "వడ్లగింజల" పీఠికలో వుదాహరించాను.

అది చూసి, మహారాజులుంగారు, నాకు త్తరంరాస్తూ "నేనూ రాజమహేంద్రవరమున నున్నప్పుడు మీరు స్థలాంతరమున నుండి యుందు రనుకొంటిని, అంతయే కాని, మీరు శంకితులయి నన్నుఁ జూచుటమాని రని యెఱింగియుందు నేని, నేనె మీ యింటికేగి మిమ్ము౯ దర్శించి యుందును" అన్నారు.

నిజమే; కాని శ్రీవా రీనాటకం కృతిపొందడాని కంగీక రిస్తారా?

నేటివరకూ నేను రాసిన గ్రంధాల్లో యిది చాలా ప్రౌఢంగా వుందని నాకు నమ్మకమే, కాని శ్రీవారి నిశితసమీక్ష కిది నిలుస్తుందా?

ఈ సందేహం యిలా వుండగా, యిది వ్యావహారిక రచన అయిపోయింది.

వ్యావహారికరచన అయినా "వడ్లగింజలు" అచ్చు వేయించుకో డానికి డబ్బివ్వడంవేరూ, వ్యావహారికరచన అయిన యీ నాటకం కృతే పొందడం సర్వాత్మనా వేరూనూ.

కనక, శ్రీవారు వల్లకా దంటే చెయ్యగల దేముందీ?

కృతిపతిత్వం అంగీకరించే మరొకర్ని నేను సంపాదించుకో లేకపోను; కాని నా నమ్మకాన్ని బట్టి శ్రీజయపురాధీశులు తిరస్కరిస్తే ఈ నాటకానికి నిండు ఉండదు.

నా నమ్మకాన్ని బట్టి శ్రీజయపురాధీశులు తిరస్కరిస్తే అసలు దీనికి, కృతిపతే అక్కర్లేదు.

కాగా, శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు నన్నయభట్టు పాత్రను మెచ్చుకున్నాక, నాకు, యీ ఆందోళన మరింత యెక్కువయి పోయింది.

పైగా, యిదే యిలా వుండగా, అసలు కథకే సంబంధించిన మరో గొప్ప చిక్కు వచ్చింది.

ఈ నాటకం కృతిపొందవలసిం దని కోరుతూ సమీక్షకోసం పంపగా, మహారాజులుంగారు ప్రత్యుత్తరంగా నాకు నాలుగు మాటలు రాశారు.

వాటిలో మొదటి మూడుమాటలూ నిర్బాధకాలూ, నా కను కూలాలున్నూ.

పోగా, యిక నాలుగో మాట యిదీ.

"సారంగధరుఁడు ఉత్తమక్షత్రియుఁడు. మఱి నన్నపార్యుని ప్రియ శిష్యుఁడు. అతఁడు నీతియుతుఁ డని పెఱకవులు సెప్పి యున్నారు. కనుక, ౧౫వ దృశ్యమునందు గల యతని స్వగతము నాకు నచ్చలేదు. దానిని సవరించుటయే యుక్తము."

ఏమిటీ చెయ్యడం?

అసలు, నేనీకథ నాటకం రాయడానికి వుండుకున్న ముఖ్య కారణాలలో, సారంగధరుని యీచిత్తవైక్లబ్యమూ, దీన్ని నిగ్ర హించుకుని అతను నిలవతొక్కుకోగలగడమూ చూపించడం మొదటిది.

అలాంటి ముఖ్యవిషయమే పూర్వపక్షం అయిపోతే యిం కెక్కడి ఆశా?

ఉన్నదల్లా యేమి టంటే—

ఎలాంటివాడికీ గూడా వొక్కొక్కప్పుడు మనస్సు చెదిరిపో కుండా వుండదు.

ఇది అనివార్యం.

అయితే, సత్తా వున్నవా డిది నిగ్రహించుకోగలుగుతాడు.

మళ్లీ యీ నిగ్రహించుకోడంలో గూడా అంతరా లున్నాయి.

మొత్తానికి, అలాంటి సత్తా వుండడమే గొప్పతనం.

చలనమే లేకపోడం శిలాప్రతిమలకే.

ఈ నిర్వచనం నవీనయుగధర్మం అన్నా నాకు సమ్మతమే గాని, యిది తప్పు అని మాత్రం నే నంగీకరించలేను.

వాఙ్మయం హృదయంగమంగా వుండాలంటే స్వభావసిద్ధంగా వుంటేనే అది సిద్ధిస్తుంది.

ఏమయినా, మహారాజులుంగారి కీవాదం నచ్చుతుందని నాకు తోచలేదు.

అయినా, చేసేది లేక—నిరాశ చేసుకునే—చివరి ప్రయత్నంగా, యీ సంగతులే శ్రీవారికి వివరంగా రాసుకున్నాను.

ఫలితం ?

సంకల్పసిద్ధే !

నేను విస్మితు ణ్ణయిపోయాను.

కాకేం ?

ముఖ్యవిషయానికే సంబంధించిన యింత పెద్ద భేదాభిప్రాయం కూడా లెక్కచెయ్యకుండా ఆనుకూల్యం వహించడం, నిజంగా, యెంత సంస్కారంవుంటే సాధ్యపడుతుందీ ?

రసలోభం కూడా యెంత వుత్కటంగా వుంటే యిలాంటి సాహసౌదార్యాలు కలుగుతాయీ ?

ఇన్ని విప్రతిపత్తు లుండినా కృతి పొందడమే కాకుండా, గొప్పసత్కారం కూడా చేసి కర్తని ఆనందపెట్టడం యెంత విశాల హృదయులకు సాధ్యపడుతుందీ ?

మహారాజులుంగా రింతటి మహోదారులని నాకు, అదివరకే, యే కొంచెమో బోధపడివుండడంవల్లనే శ్రీ వారీనాటకం యెక్కడ తిరస్కరించి పోతారో అని నేనంత మథనపడి పోయింది.

ఆదిలో, మహారాజులుంగారికి వడ్లగింజలే కృతియిస్తే బాగుం టుందని వొక మిత్రుని సలహా.

అదిన్నీ మహారాజవారిత్రిక ఘట్టమే కనక, ప్రతిభావ్యుత్పత్తులు గుర్తించి వొక విద్వాంసుణ్ణి సత్కరించడం కూడా కనక, అది చక్కగానే వుండిందికాని యీ నాటకం మనస్సులో వుంచుకుని నేనప్పుడా సలహా మన్నించ లేక పోయాను.

శ్రీవా రెన్ని గ్రంధాలు కృతిపొందడాని కయినా సమర్థులే; కాని యీ సంకల్పం వికల్పం అయిపోవచ్చు నని జడిసి కూడా అప్పుడా సలహా మన్నించలేకపోయాను.

పైగా, అది, వొక గ్రంథంలో అయిదో భాగమే; కాని ప్రత్యేక గ్రంధం కాకపోయింది.

కాగా, అదలా అయినా, శ్రీవారు ఈ నాటకం కృతిపొందినందువల్ల ఆ మిత్రుడికీ నాకు గూడా తృప్తి అయింది.

ఇలాగ వాగనుశాసనుని "ధర్మజ్యోతితో ధగధగ లాడుతూ" కవిసమ్రాట్టు మెప్పూ, సాహిత్యసమ్రాట్టు ఆదరమూ సంపాదించుకున్న నా రాజరాజు నాటకం, నిజంగా, నా రచనలకన్నిటికీ తల మానికం అయింది.

౧౫-౯-౧౯౪౪ ఇట్లు

రాజమండ్రి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ఈ నాటకంలో వచ్చే పాత్రలు

## పురుషులు

రాజరాజు—చాళుక్య చక్రవర్తి.
నన్నయభట్టు—సంస్థానకవి.
సారంగధరుడు—చక్రవర్తి కొడుకు.
ఏట్టివీరన్న—మహామంత్రి.
మహారుద్రయ్య—మరొకమంత్రి.
విజయాదిత్యుడు—చక్రవర్తి తమ్ముడు.
సుబుద్ధి—మహామంత్రి కొడుకు.
రుద్రంభట్టు—రాజరాజు పురోహితుడు.
పేరభట్టు—జక్కులదీవి రాజపురోహితుడు.
మల్లప్ప—మహారుద్రయ్య నమ్మినబంటు.

బేతాళుడు,
వీరశరభన్న,
యల్లమందప్ప } చక్రవర్తి నమ్మిన బంట్లు

## స్త్రీలు

రత్నాంగి—రాజరాజు పట్టపుదేవి.
చిత్రాంగి—జక్కులదీవి రాజపుత్రిక.
చిలక—చిత్రాంగి దాది
రుక్కు—చిత్రాంగి పరిచారిక.
గౌరి—రత్నాంగి పరిచారిక.
పేరు లేని మరికొందరు దాసీలున్నా

# రాజరాజు

## మొదటి రంగం

అది సాయంకాలం. అప్పటికి నాలుగ్గడియల పొద్దు మాత్రమే వుంది. పైని నల్లని ఆకాశం. కింద వినీలజలగంభీరమైన అఖండ గోదావరి. ఆ గోదావరిలో, ఆ ఆకాశం వొరుసుకుంటూ, నల్లశాణపురాళ్లతో నిర్మితమై ఉక్కుకొండలవంటి బురుజులతో, రాజమహేంద్రపురదుర్గం యొక్క పశ్చిమ ప్రాకారం, మహాసముద్రంలో బ్రహ్మాండమైన వోడల వరసలాగ, భయంకరం అయ్యుండిన్నీ చూడ సొంపుగా వుంది. అద్దరిని, విశాలమైన ఇసికతిప్పమీద, వందలకొద్దీ యువకులు చేరి రకరకాల ఆటలాడుకుంటున్నారు. అక్కడ కోసున్నర వెడల్పుండిన్నీ, అది ఫాల్గునమాసం కనక, అరకోసెడు వెడల్పున మాత్రమే నది ప్రవహిస్తోంది. ఝామ్మని విసురుతున్న పైరుగాలికి నది తరంగకల్లోలం అయిపోయివుంది. పౌరులలో అనేక వృత్తులవారూ, అనేక రకాలవారూ, అనేక తాహతులవారూ, వందల సంఖ్యలో వున్న డింగీలలో ఉయ్యాలా లూగుతూ నదీవిహారం చేస్తున్నారు. ఆ డింగీల తెరచాపలు తెల్లని మేఘశకలాలలాగ మెరుస్తూ గోదావరికొక వినూత్నశోభ కూరుస్తున్నాయి. ఆ డింగీలమధ్య రెండుమూడు మదపుటేనుగు లీతలాడుతూ,

తొండాలతో నీళ్లు చిమ్ముతూ డింగీలలో వున్నవారికి దడా సందడీ కలిగిస్తున్నాయి.

కోటకి ఉత్తరాన, పరిచారకులు నదిలో గుర్రాలు కడుగుతున్నారు. దక్షిణాన, స్నానాలు చెయ్యడానికీ, సంధ్యావందనాలు చేసుకోడానికీ, విడివిడిగానూ, జంట జంటలుగానూ, గుంపుగుంపులుగానూ బ్రాహ్మలు మూగుతున్నారు. నీలాటి రేవులన్నీ బిందెలతో వచ్చేపోయే జవరాళ్లతో కిక్కిరిసి వున్నాయి.

నదిలోవున్న పడమటి బురుజులు తొమ్మిదింటిలోనూ నడిమిదానిమీద పిట్టగోడ కానుకొని, రాజరాజూ నన్నయ భట్టూ కొంచెం యెడంగానూ తూర్పుమొగాలుగానూ నుంచునివున్నారు. రాజుకి ఉత్తరాన, కొంచెంముందుకి అష్టప్రధానుల్లో ఒకడైన మహారుద్రయ్య దక్షిణాభిముఖంగా నుంచునివున్నాడు. రాజు చేతిలో కొన్నీ, నన్నయభట్టు చేతిలో కొన్నీ, మహారుద్రయ్యచేతిలో కొన్నీ చిత్రపటాలున్నాయి. అప్పటికి, పటాలన్నీ ముగ్గురూ ఒకమాటు తిరగవెయ్యడం ఐపోయింది. రాజు కోరికమీద, మళ్లీ ఒకొక్కటే సవిమర్శగా చూస్తూ నన్నయ మంచిచెడ్డలు వివరిస్తూన్నాడు.

రాజరాజు: (నన్నయ చేతిలో వుండిన పటం నిర్దేశిస్తూ) ఆ కళ్ళెంత ఆకర్షకంగా వున్నాయో చిత్తగించారా?

నన్నయభట్టు: (పటం చూస్తూ) చిత్తం మహాప్రభూ! ఈ కళ్ళల్లో మంచి తేజస్సున్నది. ఈ చూపులు బాణాలకంటేనూ నిశితంగా వున్నాయి. నిదానించగా, ఈ యువతి, వురిమి చూసి యెలాంటివారినీ కూడా నీరు చేసెయ్యగలదని తోస్తూ వుంది.

రాజరాజు: చిత్తం.

నన్నయభట్టు; ఈమె కామిని అని నిష్కర్షగా చెప్పవచ్చు.

రాజరాజు : అది సరే. ఆ కనుదమ్ములు మహాలక్ష్మి విలాస మందిరాలనడాని కేమయినా ఆక్షేపణ వుందా?

నన్నయభట్టు : (తల పంకిస్తూ పటం చూస్తూ వుంటాడు.)

రాజరాజు : ఆ భ్రూవిలాసమూ, ఆ నుదురూ, ముఖ్యంగా ఆ చిబుకమూ చిత్తగించండి.

మహారుద్రయ్య : భట్టారకులవారింకా ఆ కనుదమ్ముల విషయం—(అర్ధోక్తి)

రాజరాజు : (ఊరుకొండన్నట్టు మహారుద్రయ్యని కళ్ళతో వారిస్తాడు.)

నన్నయభట్టు : (మహారుద్రయ్యతో) ఏమి సెలవు?

మహారుద్రయ్య : నా జిజ్ఞాస తరవాత మనవి చేసుకుంటాను. ముందు ప్రభువు వారికి కనుదమ్ములూ, భ్రూవిలాసాదికమూ వివరించి చెప్పండి.

నన్నయ్యభట్టు : (అసంతృప్తి సూచనగా తల అడ్డంగా వూపుతూ) చిత్తం. (రాజుతో) మహా ప్రభూ! ఈ భ్రూవిలాసం అనన్యసాధారణంగానే వుంది. అయితే, యిందులో వెనకతీత యెరగని పట్టుదలా, విరామం యెరగని కసీ ద్యోతకం అవుతున్నాయి.

మహారుద్రయ్య : (ఉలిక్కిపడి రాజుకేసి చూస్తాడు)

రాజురాజు . (ఊరుకోండి అన్నట్టు మహారుద్రయ్యని మళ్ళీ చూపులతో వారించి, నన్నయ్యతో) సెలవిప్పించండి.

నన్నయభట్టు : విశాలమైన యీ నుదురు అసాధారణమైన కల్పనాశక్తిని స్ఫురింపచేస్తూ వుంది.

మహారుద్రయ్య : (మళ్ళీ రాజుని చూస్తాడు)

రాజరాజు ; (మహారుద్రయ్యని గమనించకుండా) చిత్తం.

నన్నయభట్టు : మలచినట్టున్న యీ చిబుకమే మొగానికి చక్కని కళ కూర్చింది.

రాజరాజు : చిత్తం.

మహారుద్రయ్య : (నన్నయ్యతో) ఆ కళ చిత్తగించే ప్రభువువారు—(అర్ధోక్తి)

రాజరాజు : (మహారుద్రయ్యని మళ్లీ చూపులతో వారిస్తాడు)

మహారుద్రయ్య : చిత్తం మహాప్రభూ !

నన్నయభట్టు : (మహారుద్రయ్య కేసి ఓరచూపులు చూస్తూ తల పంకించి) తెలిసింది. అవగాహన అయింది. (రాజుకేసి చూస్తాడు.)

రాజరాజు : సెలవిప్పించండి.

నన్నయభట్టు : ఇక వివరాలు చూడవచ్చునా ?

రాజరాజు : చిత్తం, చూడవచ్చు.

నన్నయభట్టు : (పటం తిప్పి వెనకవేపున చూస్తూ) జక్కుల దీవి మండలేశ్వరులు రామభద్ర రాజులుంగారి కొమార్త చిత్రాంగీ దేవమ్మగారు—(అని చదివి, రాజుతో) ఇక మనవి చెయ్యమని సెలవా ?

రాజరాజు : అభ్యంతర మేమీ ?

నన్నయభట్టు : (ఒక్క మాటు కళ్ళు మూసుకుని ఆలోచించి) మహాప్రభూ ! ఏ విధంగా చూసినా యువరాజులుం గారి గాంభీర్యం నేనెంత మాత్రమూ సమన్వయపరుచుకోలేకుండా వున్నాను.

రాజరాజు : (సాలోచనగా) చిత్తం.

నన్నయభట్టు : వారి హృదయం యెదట, వొకొక్కప్పుడు నవనీతం అతికఠినం అనీ, వొకొక్కప్పుడు వజ్రం అతిమృదులం అనీ అనిపిస్తూ వుంటుంది.

రాజరాజు : చిత్తం.

నన్నయభట్టు : మరిన్నీ వారొకొక్కప్పు డెంతో ఆశగా వుంటూ హఠాత్తుగా నిర్లిప్తు లవుతారు. విరక్తులుగా కనబడుతూ వొకొక్కప్పుడు గభీ మని ఆశాదృష్టులు పరుపుతారు.

రాజరాజు : చిత్తం.

నన్నయభట్టు: అదలా వుండగా, ఈ రాజపుత్రిని చూడగా, పాండవ పట్టమహిషి ద్రౌపదీ దేవమ్మవారు నాకు స్ఫురణకు వస్తూ వున్నారు.

రాజరాజు: ఇది అపూర్వమైన సంగతి.

మహారుద్రయ్య: అంత మాత్రమే అయితే—(అర్ధోక్తి)

నన్నయభట్టు: (మహారుద్రయ్యతో) ఇంకేమి సెలవు?

రాజరాజు: (మహారుద్రయ్యతో) మీరుండండి (నన్నయతో) తమ అభిప్రాయం సెలవిప్పించండి.

నన్నయభట్టు: (ఒక్కమాటు మహారుద్రయ్య కేసి చురుగ్గా చూసి, తరవాత రాజుతో) మనవి చేసుకుంటూనే వున్నాను.

రాజరాజు: అమ్మవారికీ యీ రాజపుత్రికీ పోలిక యేమిటీ?

నన్నయభట్టు: పట్టుదలా, కసీ యీమెకి చాలా యెక్కువని చెప్పినపుడింకా వివరాలు అవశ్యకమా? మనవి చేసుకోడానికి నాకేమీ అభ్యంతరం లేదు; కాని—(అర్ధోక్తి)

రాజరాజు: సెలవిప్పించండి.

నన్నయభట్టు: (మళ్లీ వొకమాటు పటం చూసి, మహారుద్రయ్యకేసిన్నీ చూసి, ఉద్రేకం అణుచుకుంటూ రాజుతో) ద్రౌపదీ దేవమ్మవారి నిమిత్తాన రక్తనదులు ప్రవహించాయి. కురుకులం నిర్మూలమే అయిపోయింది.

రాజరాజు: (ఉలిక్కిపడి మహారుద్రయ్య కేసి చూస్తాడు)

మహారుద్రయ్య: (రాజునీ నన్నయనూ చూస్తూ) భట్టారకుల వారిప్పుడు పూర్తిగా కవితా సమాధిలో వున్నారు.

నన్నయభట్టు: (మహారుద్రయ్యతో నిక్కచ్చిగా) కనకనే నేనలా చెప్పగలిగాను. తమరు సరిగా గ్రహించారు.

రాజరాజు: (మహారుద్రయ్యతో) అదే కాదూ వారికి మహర్షి పదవి సమకూర్చినదీ? అస్మదాదులకూ వారికీ వుండుకున్న అంతరమున్నూ అదే కాదూ? (నన్నయతో) తమరు మహాభారతం

క్షుణ్ణంగా పరిశీలించి వుండడమూ, నా జన్మ సాఫల్యం కోరి తమ రిప్పు డది ఆంధ్రీకరిస్తూనే వుండడమూ—ఈ సన్నివేశం తమ కలాంటి స్ఫురణ కలిగించి వుండవచ్చు. అయితే, నేను తమంత నిక్కచ్చిగా మనవి చేసుకోలేను గాని ఈ రాజపుత్రి ప్రవృత్తి పురుషుణ్ణి వుడుకెత్తిస్తుం దనడానికి మాత్రం యేమీ సందేహం లేదు. ఆ పురుషుడు నిగ్రహశక్తి లేనివా డయితే, తమరు సెలవిప్పించినది కొంతవరకున్నూ సంభవించకా మానదు.

నన్నయభట్టు : కృతార్థుణ్ణి. ఏలినవారున్నూ అలాగే భావించడం—(అర్ధోక్తి)

మహారుద్రయ్య : అలాగే భావించడం అంటే, భేదం స్ఫుటంగానే కనపడుతోంది. ప్రభువువారు, పురుషుడు నిగ్రహశక్తి లేనివా డయితేనే అది అలా సంభవిస్తుందని—(అర్ధోక్తి)

నన్నయభట్టు : (చురుగ్గా చూస్తూ మహారుద్రయ్యతో) విన్నాను. బోధపడింది; కాని వొకరి నిగ్రహానుగ్రహ సామర్థ్యాలను బట్టి మారిపోయేదయితే అది ప్రవృత్తి అనిపించుకుంటుందా?

రాజరాజు : (మహారుద్రయ్య కేసి చూస్తాడు)

మహారుద్రయ్య : (రాజుతో) మనవి జేసుకుంటాను మహాప్రభూ! (నన్నయతో) అయితే, ముందు, తమ రొకటి ఆలోచించ కోరుతున్నాను. ఏమిటంటే- ఆ రాజపుత్రి ప్రవృత్తి అలాంటిదే అనుకుందాం. అయితే, ఆమెను చేపట్టే రాజపుత్రుడు ఎలాంటి వారినిన్నీ లోపు చేసుకోగలవా డయితే అప్పుడేమి చెప్పవలసి వుంటుందీ?

నన్నయభట్టు : (మహారుద్రయ్యతో) తమ పూర్వపక్షం సుసంగతంగా లేదు. ఎంచేతనంటారా? (రాజుకేసి చూస్తూ) 'ఈమె ప్రవృత్తి యెలాంటిదీ?' అని మన జిజ్ఞాస, 'ఏమవుతుందీ?' అని కాదు.

రాజరాజు : పోనీ, వారి సందేహం కూడా కొంచెం తీర్చించండి.

మహారుద్రయ్య: (నన్నయతో, అంజలి బంధంగా) అదీ నా ప్రార్థన.

నన్నయభట్టు: (రాజుతో తాపీగా) చిత్తం. అలాగే! మహా ప్రభూ! (మహారుద్రయ్యతో, దృఢంగా) బలీయాలైన రెండు ప్రతికూల శక్తులకు ఏకత్రానున్న సంఘర్షణ తటస్థపడితే, అక్కడ పర్యవసానం, అతి దారుణంగా వుంటుంది; గాని వాటిలో వొకటి రెండో దానికి లొంగిపోవడం అంటూ వుండదు.

రాజరాజు: (మెరుపు కొట్టినట్టయి మహారుద్రయ్య కేసి చూస్తాడు)

మహారుద్రయ్య: (చెయ్యి పూపుతూ రాజుతో) వారి కలా తోచింది.

నన్నయభట్టు: (మహారుద్రయ్యతో) గ్రహించగలిగే చోట యెవరికేనా అలాగే తోస్తుందది.

రాజరాజు: (మహారుద్రయ్య కేసి చూసి, అతను నిరుత్తరుడు కాగా, నన్నయతో) అలాగే కావచ్చు; కాని మహాకవీ! మనం విషయదూరులం అయిపోతున్నాము. ఈ రాజపుత్రికలలో అబ్బాయి కనురూపురా లెవతె అని కదా మన జిజ్ఞాస?

నన్నయభట్టు: ఈ కన్యావరణం అబ్బాయిగారి నిమిత్తం కనకనే ప్రవృత్తిని గురించి నేను మనవి చేసుకుంటున్నాను. రూపమే ప్రధాన మయితే అది వరులు చూసుకోవాలి కాని అన్యులు కారు.

రాజరాజు: రూపం ప్రధానం కాదనా తమ—(అర్థోక్తి)

నన్నయభట్టు: "రూపం కూడా" అని సెలవిప్పించండి.

రాజరాజు: (నిరుత్తరుడై మహారుద్రయ్యకేసి చూస్తాడు.)

మహారుద్రయ్య: (రాజుతో) నాదొక్క మనవి.

రాజరాజు: చెప్పండి.

మహారుద్రయ్య: ఇది విషయమూ విషయాంతరమూ అన్న ...

రాజరాజు : ఏమీ ?

మహారుద్రయ్య : దానికి ప్రయోజనం ?

రాజరాజు : అంటే ?

మహారుద్రయ్య : సూక్ష్మవిచారణ కిది సమయం కాదు. అ: కాశమూ లేదు.

రాజరాజు : (ప్రశ్నార్థకంగా చూస్తాడు)

మహారుద్రయ్య : చిత్రపటాలకోసం వెళ్ళినవారిలో యింకా యిద్దరు రావలసే వున్నారు.

నన్నయభట్టు : అయితే ?

మహారుద్రయ్య : వారు కూడా వచ్చి వారు తెచ్చిన పటాలున్నూ పరిశీలిస్తే కాని మనం యెవరిని గురించీ నిష్కర్షగా తెల్సుకోడానికి వీలులేదు.

రాజరాజు : (అదేమిటో బోధపడక మహారుద్రయ్యకేసి పులుకూ పులుకూ చూస్తాడు)

మహారుద్రయ్య : (రాజుతో) భట్టారకులవారికి మాత్రం యిది తెలవందా ?

నన్నయభట్టు : (తల పంకిస్తూ మహారుద్రయ్యకేసి చూసి వూరుకుంటాడు)

రాజరాజు : (నన్నయతో) ఏమి సెలవు ?

నన్నయభట్టు : ఏ విషయమై మహాప్రభూ ?

రాజరాజు : మహారుద్రయ్యగారు చెప్పింది—(అర్థోక్తి)

నన్నయభట్టు : విన్నాను. అయితే, యే విషయమైనా అమాత్యులకు తోచడంలోనూ, వా రది ప్రతిపాదించడంలోనూ విశేషం ఉంది.

రాజరాజు : తమకూ నాకూ కూడా అది— (అర్థోక్తి)

నన్నయభట్టు : తెలవనే తెలుసు మహాప్రభూ ! ఆ విషయమై తమరున్నూ మళ్లీమళ్లీ సెలవిప్పించాలా ? కాని, రామభద్రరాజులుం

గారి కౌమార్త ప్రవృత్తి నిర్ణయించడం వొకటీ, యువరాజులుం గారికి అనురూప అవునా కాదా అని నిర్ణయించడం మరొకటీ కాదూ?

రాజరాజు : (తల పంకించి వ్రాయకుంటాడు)

నన్నయభట్టు : అక్కడక్కడ అభిప్రాయం కొంచెం భేదిస్తూ వచ్చినా, యిప్పటిదాకా, మనం కొందరు రాజపుత్రికల ప్రవృత్తిని గురించి వొక విధంగా పరిష్కారం చేసుకునే వున్నాము. ఈ స్థితిలో ఈ రాజపుత్రి ప్రవృత్తి ఆలోచనలో వుండగా, అమాత్యులవారు విషయాంతర ప్రస్తావనకి దింపడమూ, అది విడిచిపెట్టాడానికి వీలులేని సందర్భాలు కల్పించడమూ—(అర్థోక్తి)

మహారుద్రయ్య : సత్యం సత్యం. చర్చ అంటే నాకు చాలా వుబలాటమనీ, అది వుంటే నాకు నిద్రాహారా లక్కరరేదనీ ప్రభువు వారికీ తమకున్నూ తెలిసిందే.

నన్నయభట్టు : (రాజుకేసి చూస్తూ) మళ్లీ యిది మరొక చంక్రమణం. (మహారుద్రయ్యతో కొంచెం చురుగ్గా) అయితే, ప్రభువు ఒకానొక విషయమై యేకాగ్రంగా విచారణ చేస్తున్నప్పుడేనా తమ వుబలాటాలు ?

మహారుద్రయ్య : అది కాదు. తమరు—(అర్థోక్తి)

నన్నయభట్టు : తమ రింతకు ముందు వాడిన మాటల్లోవున్న దదే. ఇప్పుడు వేరే మాటలు వాడుతున్నా రేమో గాని—(అర్థోక్తి)

రాజరాజు : (నన్నయతో) ఏది యేమయినా — (మహారుద్రయ్య కేసి ఒక్కమాటు కరుగ్గా చూసి మళ్ళీ నన్నయతో) మనం మళ్ళీ దారికి రానే వచ్చాము కదా ?

నన్నయభట్టు : మన మెప్పుడూ దారితప్పనే లేదు. కాని— (అర్థోక్తి)

రాజరాజు : అప్రస్తుత ప్రశంస అనుకున్నవాటికి తమరు ప్రత్యుత్తరా లివ్వడం యెందుకూ ?

మహారుద్రయ్య : నేను మనవి చేసుకునేది — (అర్థోక్తి)

నన్నయభట్టు : (ఆ ధోరణి చూశారా అన్నట్టు రాజు కేసి చూస్తాడు)

రాజరాజు : (కొంచెం కోపంగా, మహారుద్రయ్యతో) భట్టారకులవారు సెలవిచ్చేది మనం ఆలకిద్దాము.

మహారుద్రయ్య : దాని కేమి ఆక్షేపణా ? (అంజలి బంధంతో నన్నయభట్టును చూపిస్తూ) వారి ప్రపంగం యెవ రడ్డుకోగలరూ? కాని మళ్ళీ ఆసంగతే చర్చిద్దా మంటే వారికి అనుష్ఠానసమయం ఆసన్నం అయింది కదా ?

రాజరాజు : (సూర్యబింబంకేసి చూస్తాడు)

నన్నయభట్టు : (సూర్యబింబంకేసి చూస్తాడు)

మహారుద్రయ్య : (నన్నయకేసి ఓరకంట చూస్తూ తల పంకిస్తాడు)

రాజరాజు : (నన్నయతో) ఏమి సెలవు ?

నన్నయభట్టు : మహారుద్రయ్యగారి సద్యస్ఫూర్తి యిప్పుడే కా దెప్పుడూ అసాధారణమే కదా, మరి నేను సెలవివ్వడాని కేం వుందీ ?

మహారుద్రయ్య : (నన్నయకేసి చూస్తూ, చేతులు నలుపుకుంటూ, సవినయంగా) అనుగ్రహం వుంది కనక తమ రలా — (అర్థోక్తి)

నన్నయభట్టు : (రాజుతో) వారిబుద్ధికి స్వపరభేదాలు లేవు. ఒక్కొక్కప్పు డది గంభీరావర్తాలు కల్పించి, గిరగిర తిప్పి-(అర్థోక్తి)

మహారుద్రయ్య : (వంగి, అంజలి బంధంగా నన్నయతో) తమ రంత మాట — (అర్థోక్తి)

నన్నయభట్టు : (మహారుద్రయ్యతో) తమ ప్రతిభ యెక్కడ, నా మాట యెక్కడ — (అర్థోక్తి)

రాజరాజు : (అంజలి బంధంగా నన్నయతో) నా మనవి — (అర్థోక్తి)

నన్నయభట్టు : చిత్తం, యేమి సెలవు ?

రాజరాజు : ప్రకృతం — (నసుకుతాడు)

నన్నయభట్టు: మహారుద్రయ్యగారు సెలవిప్పించిందే. అనుష్ఠానసమయం ఆసన్నమే అయింది.

రాజరాజు—కనక ?

నన్నయభట్టు: సరే! ఈ విషయం మళ్ళీ ప్రస్తావనకు వస్తే అప్పుడు చూసుకోవచ్చు.

మహారుద్రయ్య: అమ్మమ్మా! రాకేమీ? రానేవస్తుంది.

నన్నయభట్టు: వస్తే వుండనే వుంది. తమ రెక్కడికి వేంచేస్తారు, నే నెక్కడికి వెడతాను? (రాజుతో) చిత్తగించారా? కనక, నాకిప్పటికి సెలవు దయచేయించండి.

రాజరాజు: ఏమి మహారుద్రయ్యగారూ, భట్టారకులవారి నిమిత్తం రథం సిద్ధంగా వున్నదా?

మహారుద్రయ్య: చిత్తం, చిత్తం. (కిందికి చూస్తూ) రథమూ సిద్ధంగా వుంది, పాలకీ సిద్ధంగా వుంది, వారి వుత్సాహం యెలావుంటే అలా దయచెయ్యవచ్చు.

నన్నయభట్టు: (గంభీరంగా చూస్తూ చిత్రాంగి పటం రాజుకందించి) ఈ రాజపుత్రి విషయమై మహారుద్రయ్యగారు మనవిచెయ్యవలసింది చాలావుంది. వారి ప్రతిభకి ఆటగల సందర్భంకూడానూయిది. (తక్కినపటాలలో కొన్ని మహారుద్రయ్య యెడమచేత వుంచి) వీటివిషయం, రావలసిన ఆ యిద్దరి పటాలూ రాకుండానే పరిష్కారం అయిపోయింది. (మిగిలిన పటాలు మహారుద్రయ్య కుడిచేత వుంచి) తమ కడ్డేమిటి? ఇక వీటివిషయం ఆలోచించడమో మానడమో—(అర్థోక్తి)

మహారుద్రయ్య: (పటా లందుకుని) అలా కాదు, వీటి విషయంకూడా తమ చేతిమీదుగానే—(అర్థోక్తి)

నన్నయభట్టు: పరిష్కారం అయిపోతుం దంటారా? తథాస్తు. (రాజుకేసి చూస్తాడు)

రాజరాజు: చిత్తం, మరి మాకు సెల విప్పించండి.

నన్నయభట్టు: చిత్తం చిత్తం. సెలవు. (వెనక్కి వెనక్కి నడుస్తూ బయలుదేరతాడు)

మహారుద్రయ్య: (నన్నయ వెంటవెడుతూ) ఉదయం తమ అనుష్ఠానం ముగిశాటప్పటికి దర్శనం చేసుకుంటాను.

నన్నయభట్టు: చిత్తం, నిరీక్షించుకుంటూ వుంటాను.

మహారుద్రయ్య: సెలవు.

నన్నయభట్టు: సెలవు.

నన్నయ్య వెళ్ళిపోతాడు. మహారుద్రయ్య రాజు కేసి బయలుదేరతాడు

రాజరాజు: (చిత్రాంగి పటం చూస్తూ) ఏమి రూపమూ? ఎంత రాజసమూ? ఇంతటి అందకత్తె యింతవరకూ మన కళ్ళబడలేదేమీ? (పక్కగా కిందికి చూస్తూ) తక్కినవన్నీ మహారుద్రయ్యగారికిచ్చి, భట్టారకులవారీ వొక్క పటమూ మన కిచ్చారేమీ? వారి చూపులకు అర్థం యేమయి వుంటుంది?

మహారుద్రయ్య: (తన యథాస్థానానికి వచ్చి) ప్రభూ!

రాజరాజు: (మెరుపు కొట్టినట్టయి) అయితేనూ, భట్టారకుల వారి ధోరణి మీకు నచ్చినట్టు లేదు.

మహారుద్రయ్య: చిత్తం చిత్తం, ఎంత మాత్రమూ నచ్చ లేదు. తమరు సరిగా సెలవిప్పించారు.

రాజరాజు: ఇవాళ వారు బాగా వుద్రిక్తులైనారండీ.

మహారుద్రయ్య: కారణం—(అర్థోక్తి)

రాజరాజు: ఆఁ, కారణాని కేం వుందీ? రథం వెళ్ళగానే భారత రచన అలా కట్టిపెట్టి యిలా వచ్చివుంటారు. వారి చిత్తం పూర్తిగా ప్రకృతిలో పడకుండానే పటాల పరిశీలనలో—(అర్థోక్తి)

మహారుద్రయ్య: చిత్తం చిత్తం, అలాగే జరిగివుంటుంది. అయితే మహాప్రభూ! ఒక్క మనవి. (అంజలి బంధంగా) ముందు నా సాహసం మన్నించ కోరుకుంటున్నాను.

రాజరాజు : కానివ్వండి.

మహారుద్రయ్య : నిజానికి భట్టారకులవారు గొప్ప పండితులే. మహా మేధావులే. కవితాసామ్రాజ్య పట్టభద్రులే. అనుభవ సంపన్నులున్నూ. అయినా వారి నిర్ణయం నాకు ప్రమాదపతితంగా కనపడుతోంది.

రాజరాజు : మొత్తానికి తొందర లేకపోలేదు.

మహారుద్రయ్య : ఇప్పటివరకూ మన చేతికి వచ్చిన పటాలన్నీ చూడగా—(అర్ధోక్తి)

రాజరాజు : ఇక రావలసినవి మనం యెరగనివి టండీ ?

మహారుద్రయ్య : కనక, జక్కులదీవి రాజపుత్రిక మాత్రమే సర్వలక్షణ సంపన్న అని నా దృఢనిశ్చయం.

రాజరాజు : నేను చెప్పవచ్చిందీ అదే. భట్టారకులవారున్నూ యిందు కంగీకరించక పోలేదు.

మహారుద్రయ్య : మాట వరసకి అది కూడా నిజమే అయినా, ఆమె తిరస్కరించబడతారేమో అని నా మనస్సు పరిపరి విధాల గజిబిజి పడిపోతోంది. మహారాణులకు వుండవలసిన ఠీంకం అంతా ఆమెలో మూర్తీభవించి వున్నది.

రాజరాజు : (సాలోచనగా పక్కకి చూసి తల పంకిస్తూ) మహారాణులకు వుండవలసిన ఠీంకం—(పటం చూస్తూ) నిస్సందేహం. (మహారుద్రయ్యతో) ఈమె చళుక్య మహారాణి కావాలి. అయితీరాలి. ఇదేనా మీ నిష్కర్ష ?

మహారుద్రయ్య : చిత్తం చిత్తం, అంతే మహాప్రభూ !

రాజరాజు : మీ నిష్కర్ష సర్వాత్మనా యుక్తంగా వుంది. భట్టారకులవారి మాట అంటే అబ్బాయికి వేదవాక్యమే. వారికి నచ్చనిది అతనికి పరిహార్యమే ! మరి దారి ?

మహారుద్రయ్య : అబ్బాయిగారు వల్లకా దంటం—(అర్ధోక్తి)

రాజరాజు : అత నలా అంటాడనే నా నమ్మకం. సందేహం లేదు.

మహారుద్రయ్య: అబ్బాయిగారు క్షీరకంఠులు. ఆమె యేమో త్రిభువనసుందరి.

రాజరాజు: (పటం చూస్తూ) ఈమె త్రిభువనసుందరే. ఎవరు కాదనగలరూ?

మహారుద్రయ్య: చిత్తం చిత్తం, అలాగే, ఆమె చళుక్య మహారాణి కావడానికి వీలులేదనిన్నీ యెవరూ అనగలిగి వుండ గూడదు.

రాజరాజు: అది నిశ్చయమే. మనం అవునన్నది కాదన డానికీ, కాదన్నది అవుననడానికీ యెవరికి గుండెలున్నాయి? (కిందుగా పక్కకిచూస్తూ సాలోచనగా) పోనీ, యీమె, పట్టమహిషి కాకపోతే నన్నయ భట్టారకులవారు సెలవిచ్చిన దోషం పరిహారం అయి పోతుందేమో ఆలోచించండీ.

మహారుద్రయ్య: (మహోత్సాహంతో) ఇది బాగుంది. చాలా బాగుంది మహాప్రభూ! ఎక్కడికి వెళ్ళినా యిది తిరుగులేని ఆలోచన. కామిని భోగిని కావడమే—(అర్థోక్తి)

రాజరాజు: భోగిని! (సాలోచనగా) భోగిని కావడమే ధర్మం. (ఆలోచిస్తూనే వుంటాడు)

మహారుద్రయ్య: శ్రీకృష్ణులవారికి సత్యభామాదేవమ్మగారు - (అర్థోక్తి)

రాజరాజు: (చకితుడై చెయ్యి జాడిస్తూ) సెబాస్! నాకున్నూ అదే తోచింది. రుక్మిణీదేవమ్మగారు సాక్షాత్తూ ఆ శ్రీమహాలక్ష్మీ దేవమ్మవారే కనక, వారిని గురించి మనకి ప్రస్తావన వద్దు. ఈ కారణంవల్లనే వారి అంతఃపురిక విలాసాలు వర్ణించడానికి ఎవరూ సాహసించలేక పోతూవచ్చారు. కాగా, యిక సత్యభామా దేవమ్మగారి విషయం. నిజానికి, వారివల్లనే శ్రీకృష్ణులవారి రసికత సార్థకం అయింది. శ్రీకృష్ణులవారి దక్షిణనాయకత్వం కూడా వారి వల్లనే రూఢమై రసబంధురమున్నూ అయింది.

మహారుద్రయ్య: సత్యం సత్యం. ఇందులో ఇంకో విశేషం కూడా వున్నది మహాప్రభూ! అదేమిటంటే—సత్యభామాదేవమ్మగారి వల్లనే శ్రీకృష్ణులవారికి లాగే, శ్రీకృష్ణులవారివల్లనే సత్యభామా దేవమ్మగారికినీ విశిష్టత యేర్పడ్డది. తండ్రిగారు, ఆమెని, అక్రూరుల వారికో, కృతవర్మ శతధన్వులలో వొకరికో యిచ్చి వివాహం—(అర్థోక్తి)

రాజరాజు: (చెవులు మూసుకుని) శివశివా! అది తలుచుకుంటేనే శరీరం జలదరిస్తోంది. (గాభరా నటిస్తాడు)

మహారుద్రయ్య: శృంగార రసంలో ఉండుకున్న నిగ్గంతా క్షుణ్ణంగా గుర్తించగలిగినవారు కనక, దాని మాధుర్యం అనుభవించ గలిగినవారున్నూ గనక తమరు—(అర్థోక్తి)

రాజరాజు: అలా అన్నారు గదా, అయితే, (చిత్రాంగి పటం చూపిస్తూ) ఇలాంటి త్రిభువనసుందరిని ఏలుకోవా లంటే ఎంత పాండిత్యం — యెంత రసికత — యెంత అనుభవం కూడా వున్న వాడు కావాలో—(సాకూతంగా చూస్తాడు)

మహారుద్రయ్య: (రాజు భావం యేమిటా అన్నట్టు జిజ్ఞాసతో చూస్తూ) చి—త్త—ం.

రాజరాజు: (ఒక్క క్షణం నిదానించి) ఇందులో యింకో విశేషంకూడా వుంది, చూశారూ?

మహారుద్రయ్య: సెలవివ్వించండి.

రాజరాజు: సత్యభామాదేవమ్మగారిని తప్పించి చూడండీ! శ్రీకృష్ణులవారి అంతఃపురం గాఢాంధకార బంధురం —(ఊరుకుంటాడు)

మహారుద్రయ్య: (ఇంకా జిజ్ఞాసతోనే) అవును మహాప్రభూ!

రాజరాజు: పైగా, శ్రీకృష్ణులవారు, సత్యభామా దేవమ్మగారి నిమిత్తాన, అరసికుడూ — అంచేత అనర్హుడూ అయిన శతధన్వుణ్ణి సంహరించికూడా వున్నారు. కనక, యిక్కడ, భట్టారకులవారు తెచ్చిన రక్తనదుల ప్రస్తావనకు విప్రతిపత్తి—(అర్థోక్తి)

మహారుద్రయ్య: ఆమాటెందుకు మహాప్రభూ! అది మనం మరిచి — (అర్ధోక్తి)

రాజరాజు: మరిచి పోవలసిందే. మరిచిపోతాము. పోనీ, మరిచిపోమనుకోండి. అయితే మాత్రం వచ్చే యిబ్బంది యేమిటి? ఈమె మన సామంతుడి కూతురు. పైపెచ్చు, చళుక్యమహారాణి కావడానికి ముచ్చటపడుతున్న సుందరి.

మహారుద్రయ్య: కాకేమి? తక్కినవా రందరూ తమ కొమార్తల పటాలు మన రాయబారుల కిచ్చిపంపారు గాని, రామభద్ర రాజులుంగారు సొంతంగా — అంచె గుర్రాల మీద — (అర్ధోక్తి)

రాజరాజు: అదీ మాట. కనక యిదంతా చూస్తే, రామ భద్రరాజు కూతుర్ని మాత్రం విడిచిపెట్టడానికి వీలులేదు.

మహారుద్రయ్య: విడిచిపెట్టడానికి వీలులేదు. (సాలోచనగా) వి-డి-చి-పె-ట్ట-కా — (అర్ధోక్తి)

రాజరాజు: అది తరువాత చూనుకుందాం. కాగా, భట్టారకుల వారి నీ విషయమై మన మిక శ్రమ పెట్టవలసిన అక్కర లేదన్న మాటేనా?

మహారుద్రయ్య: ఇంకెందుకూ? శాస్త్రం చెప్పిన తరవాయిగా — అయితే, తక్కిన పటాలు మాత్రం వారు పరిశీలించవలసే వుంటుంది.

రాజరాజు: ఇక మనమున్నూ వొకమాటలా నదికేసి వెడదాం.

మహారుద్రయ్య: దయచెయ్యండి.

మహారుద్రయ్య కిందికి చూస్తాడు. వెంటనే మల్లప్ప అనే భటుడు పైకి వస్తాడు. వాడు మహారుద్రయ్య మనిషి. ఆంతరంగికుడు. మహారుద్రయ్య పటాలు విడివిడిగా అందించి 'నగరికి పద' అంటాడు. 'చిత్తం' అని అవి పుచ్చుకుని వాడు వెళ్ళిపోతాడు. తరవాత రాజరాజూ,

మహారుద్రయ్యా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ బయలుదేరతారు.

రాజరాజు: (గభీమని ఆగి) మహారుద్రయ్యగారూ!

మహారుద్రయ్య: (ఆగి) చిత్తం మహాప్రభూ!

రాజరాజు: చక్రవర్తుల ప్రవృత్తికీ తదితర్ల ప్రవృత్తికీ అంతరమూ భేదమూ వున్నా యంటారా లేవంటారా మీరు?

మహారుద్రయ్య: అయ్యో, లేకేం?

రాజరాజు: ఉండాలని కూడా అంటారా మీరు?

మహారుద్రయ్య: ఉండితీరాలి. లేకపోతే యెలాగా? ఆ విశేషం వుండబట్టే కాదూ 'నా విష్ణుః పృధివీపతిః' అనడం.

రాజరాజు: మరిన్నీ, చక్రవర్తుల యితివృత్తాలే కదా కవులకు వర్ణించతగ్గవి?

మహారుద్రయ్య: తదితర్ల యితివృత్తాలూ వొక యితివృత్తా లేనా? ఎంత మాటా?

రాజరాజు: అవును కదా? మరి రామభద్రరాజు కూతురు వంటి దేవేఁలేని చక్రవర్తి యితివృత్తంలో జటిలమైన ఘట్టం, వొకటయినా వుంటుందిటండీ?

మహారుద్రయ్య: (సాలోచనగా) వుండదు మహాప్రభూ!

రాజరాజు: జనకరాజర్షి వంటివారి మాట అలా వుంచండి, పోగా, ఎంతో కొంత ఐహికవాంఛాపరతా—దానికి సాయం రసికతా—దానికి తగ్గ ఆలంబనం లేకపోవడమూ—(సాకూతంగా చూస్తాడు.)

మహారుద్రయ్య: (చకితుడై) మహాప్రభూ! (గంభీరంగా చూస్తాడు.)

రాజరాజు: (చిరునవ్వుతో) ఆ!

మహారుద్రయ్య: (గంభీరంగానే చూస్తూ సాలోచనగా) అలా సెలవిచ్చారా?......... బోధపడ్డది. .... ....బాగుంది......... (స్ఫుటంగా) దివ్యంగా వుంది మహాప్రభూ!

రాజరాజు: బాగా అవగాహన — (అర్ధోక్తి)

మహారుద్రయ్య: క్షుణ్ణంగా అవగాహన అయిపోయింది మహారాజాధిరాజా! తమ ఆలోచనా, అభిలాషా, సంకల్పమూ అని తరదుర్లభంగా వున్నాయి, రసికాగ్రేసరచక్రవర్తీ! కాని వాక్కా మనవి.

రాజరాజు: ఏమంటారు?

మహారుద్రయ్య: ఇవాళకి నదీవిహారం వద్దు.

రాజరాజు: సరే.

మహారుద్రయ్య: నగరికే వెళ్లిపోదాం

రాజరాజు: బాగుంది.

మహారుద్రయ్య: లేకపోతే, విలాసభవనోద్యానం—(అర్ధోక్తి)

రాజరాజు: అక్కడికి వెడదాం.

మహారుద్రయ్య: దయచెయ్యండి.

ఇద్దరూ మహోల్లాసంతో వెళ్ళిపోతారు.

# రెండో రంగం

రాజరాజు నగరిలో ఒకగది. రత్నాంగి పరిచారిక గౌరీ, రాజ రాజు పరిచారిక చిట్టీ యెదురెదురుగా నుంచుని వుంటారు

గౌరి: సరే, అంత బడలిక అయితే యేం చేస్తామూ?

చిట్టి: అంతా యింతా కాదు బడలిక. ప్రభువు ఈ రాత్రి భోజనం చేస్తారని తోచదు.

గౌరి: అబ్బా!

చిట్టి: మధ్యాహ్నం అలా పవ్వళించి లేచారు, ఇలా పటాల పరిశీలనలో కూచున్నారు. కొంతసేపటి కిక్కడ శ్రాంతులై బురుజు మీదకి వేంచేశారు. మరికొంత సేపటి కక్కడా శ్రాంతులై, అనుష్ఠాన సమయం కావడంవల్ల భట్టారకులవారిని పంపేసి, విలాసభవనోద్యానా నికి వేంచేశారు. అక్కడకూడా యిప్పటిదాకా పటాలు చూసిచూసి, యిక భరించలేక, కొట్టేసిన పాములాగ యిప్పుడే చలవరాతిన్నెమీద నడుం వాల్చారు.

గౌరి: ఇలాంటి స్థితిలోనుటమ్మా నేను రాయబారం తెచ్చాను?

చిట్టి: మహారుద్రయ్యగారు కూడా భోజనాని కింటికి వెళ్ళరుట. వారి కిక్కడే ఫలహారం సిద్ధం చేయించి ఉంచ మనిన్నీ సెలవిచ్చారు ప్రభువు.

గౌరి: స—రే—.

చిట్టి: "ఈ స్థితిలోనా చిట్టీ" అన్నారు ప్రభువు. నిజంగా, నాకు చచ్చినచావయి పోయింది.

గౌరి: కాదుటమ్మా?

చిట్టి: కనక, యీ సంగతి మహారాణీతో మనవిచెయ్యి.

గౌరి : మంచి దమ్మా, మంచిది.

చిట్టి : నాలుగు దినాలకి మళ్లీ యివాళ మహారాణీని సేవించు కోగలుగుతా ననుకున్నాను; కాని యోగం లేకపోయింది. చాలా కించగా ఉంది వదినా !

గౌరి : కాకేమి మరదలా ? ప్రభువుని సేవించుకోగలుగుతా ననుకుంటే నాకూ యిదే తటస్థించింది కాదూ ?

చిట్టి : ఇవాళకే యిది. రేపటి కీగొడవ లన్నీ ముగిసిపోవచ్చు కనక, వీలు కాగానే వచ్చి నేనే ఆహ్వానించుకుంటాను మహారాణీని. ఈ సంగతి వారితో మనవిచెయ్యి.

గౌరి : అలాగే నమ్మా, అలాగే.

చిట్టి : మహారాణీకి నామీద దయతప్పి పోకుండా చూడాలి సుమా వదినా నువ్వు.

గౌరి : అలాంటి సందేహం యెప్పుడూ పెట్టుకోకు. నువ్వంటే మా అమ్మకెంతో అభిమానం. నువ్వున్నావు కనక, ప్రభువుకి, యేలోపమూ కలగడం లేదని వారెన్నోమాట్లు సెలవిస్తూ వచ్చారు.

చిట్టి : ధన్యురాలిని.

గౌరి : మరి వుంటా

చిట్టి : మంచిది.

గౌరి వెళ్ళిపోతుంది. ఒక నిమిషం అలాగే నుంచుని, చిట్టి, వాక్క అడుగు వేశాటప్పటికి అన్నపూర్ణ అనే మరో పరిచారిక యెదురు వస్తుంది.

అన్నపూర్ణ : రహస్యం కామోసు.

చిట్టి : అక్షరాలానూ.

అన్నపూర్ణ : శిలాక్షరమే అన్నమాట.

చిట్టి: నీకూ నాకూ వున్న అనుబంధం తామ్రాక్షరం కాదుటే వెర్రిపిల్లా?

అన్నపూర్ణ: కాకేం? కనక, యిప్పుడే చెప్పేస్తావు.

చిట్టి: నేను నీకుమట్టుకే చెబుతాను.

అన్నపూర్ణ: అంచేత అప్పటికి అది రహస్యమే.

చిట్టి: నువ్వు మరొకర్తికే—అదిన్నీ యింకొకర్తికే చెప్పడం జరుగుతుంది. కనక?

అన్నపూర్ణ: అప్పటికీ అది రహస్యమే.

చిట్టి: ఇది, యిక్కడ, యిలాంటి స్థితిలో వుండగా, వార్త మహారాణికి అందుతుంది.

అన్నపూర్ణ: చల్లగాను.

చిట్టి: అప్పటి కిక్కడ, మనవాళ్ళ కందరికీ తెలిసిపోతుంది.

అన్నపూర్ణ: చెప్పేదేమిటీ?

చిట్టి: ఇంతలో అక్కడా యిది పనకలిసిపోతుంది.

అన్నపూర్ణ: పరిపాటే కాదూ?

చిట్టి: అప్పుడు దాని పేరు?

అన్నపూర్ణ: బహిరంగరహస్యం.

చిట్టి: అదిగదీ మాట.

అన్నపూర్ణ: మరి విఘ్నేశ్వరపూజ కానియ్యి.

చిట్టి: మహారాణీ వర్తమానించారు.

అన్నపూర్ణ: రాత్రి దయచేస్తామని.

చిట్టి: అవును. కాని ప్రభువు బడలికగా వున్నారు.

అన్నపూర్ణ: అదేమిటే?

చిట్టి: బోలెడు చిత్రపటాలు వచ్చాయి కాదుటే?

అన్నపూర్ణ: అయితే?

చిట్టి: కన్యాహరణం అంటే యేమనుకున్నావు, కాకపోతే?

అన్నపూర్ణ: సొంతాని కయితే—(అర్ధోక్తి)

చిట్టి: బుద్ధి లేకపోతే—(అర్ధోక్తి)

అన్నపూర్ణ: ఏమమ్మా?

చిట్టి: మరొకళ్ళకయితేనే బడలిక మామ్మా!

అన్నపూర్ణ: మరి సొంతానికయితే?

చిట్టి: విరహమే.

అన్నపూర్ణ: సెబాస్!......అయితే, అదిమాత్రం కలక్కుండా చూడు.

చిట్టి: అవతల మహారుద్రయ్యగారుండగా, యివతల నీవల్లా నావల్లా యేమవుతుందీ?

అన్నపూర్ణ: అవునేవ్!

చిట్టి: చివరి కేమయినా మన కొకటే, కనక, స్నానాలూ స్నానప్రయత్నాలూ చేసుకుందాం తొరగా రావేవ్!

ఇద్దరూ వెళ్ళిపోతారు.

# మూడో రంగం

రత్నాంగి నగరిలో విశాలమైన నడవ. అంతటా రత్న కంబళీ పరిచివున్నది. పార్వతీతపశ్చర్యా, గంగావతరణమూ, కుమారక్రీడలూ, కిరాతార్జునీయమూ, శివతాండవమూ, మార్కండేయరక్షణమూ, కామదహనమూ, వీరభద్రా విర్భావమూ—ఇలాంటి శివలీలాచిత్రాలతో గోడలన్నీ నిండి వున్నాయి. కంబళీమీద, అక్కడక్కడ, ఎత్తయిన చక్కని పీటలూ, వాటిమీద నటరాజవిగ్రహాలూ, కుమారవిగ్రహాలూ, గణపతిప్రతిమలూ, నందికేశ్వర విగ్రహాలూ, మధ్యమధ్య పూలచెట్ల కుండ్లూ చక్కగా అమర్చివున్నాయి. వసారాలో ముంజూరికి వేలాడుతూవున్న పంజరంలో, మైనగోరువంక ముద్దుముద్దుగా పలుకుతోంది.

ఒకచోట, గోడకి చేర్చివున్న బాలీసుకి ఆనుకుని, రత్నాంగి, పరుపుమీద కూచునివుంది. ఆమె యెదట కుడి పక్కగా, సారంగధరుడూ, అతనికి కొంచెం యెడంగా సుబుద్ధి చేతులు కట్టుకుని అలాంటి ఆసనాలమీదే కూచుని ఉన్నారు. ఏమిటేమిటో పనులమీద నలుగురైదుగురు పరిచారికలు చాల అడావడిగా తిరుగుతున్నారు.

రత్నాంగి: కోరినవెంటనే అరవైమంది రాజులు తమ పుత్రికల చిత్రపటాలు పంపారంటే, ఆ రాజపుత్రిక లందరూ చక్కని చుక్కలంటే, అది మాకు అసాధారణమైన ఘనతే; కాని అందరు అందకత్తెలలో వాకామెని యేరి నిర్ణయించడం చాలా కష్టమైన పని. ఎంత నిదానంకలవారికయినా కళ్లు జిగజిగలాడిపోతాయి. మనస్సు గజిబిజిపడిపోతుంది. బుద్ధిన్నీ యితికర్తవ్యతామూఢం అయిపోయి, దాని మూలాన, చేసిన పరిశీలన అంతా, చివరికి అడవిగాసిన వెన్నెల అయిపోవచ్చు.

సుబుద్ధి: తమరు సెలవిప్పించింది సత్యం అమ్మగారూ! ఏమంటే—ఒక రాజపుత్రి మంచి రూపవతి అవుతుంది. ఇంకొక రాజపుత్రి గొప్ప విద్యావతి అవుతుంది. మరొక రాజపుత్రి గుణవతి అవుతుంది. ఇలాగ, వొక్కొక్క రాజపుత్రిదగ్గిర వొక్కొక్క యోగ్యత యెక్కువగా ఉంటుంది. అన్నిలక్షణాలూ ఎకత్రా వుండడం అసంభవం అవుతుంది. అన్నిరకాల యోగ్యతలకూ దేనికి ప్రాధాన్యం అనేది—(అర్ధోక్తి)

రత్నాంగి: ఉన్నదే కద. అది. ఎంత లక్షణవతి అయినా ముందు భట్టారకులవారికి నచ్చాలి. వారు కోరే యోగ్యత వొకటి. తరవాత మహారాజులుంగారికి నచ్చాలి. వారి చూపు వేరు. తమ కెంత సరిపుచ్చుకున్నా కొంచెమో గొప్పో నాకూ నచ్చాలి. నా రుచి వేరు. మహా ప్రతిభావంతులు మరిదిగారున్నారు. అత్తయ్యగారి తరవాత అంతటివారు వదినగారున్నారు. వారు కోరే యోగ్యతలు వేరు. మంత్రులున్నారు. వారికీ తృప్తికావాలి. అన్నిటికీ మూలం (సారంగధరుడికేసిచూస్తూ చిరునవ్వుతో) ఆయనకి నచ్చాలి. అతని అభిరుచి వేరు.

సుబుద్ధి, సారంగధరుడికేసి "యేమంటా" రన్నట్టు చూస్తాడు. సారంగధరుడు, సుబుద్ధికేసి "గప్‌చిప్" అన్నట్టు చూస్తాడు.

రత్నాంగి: (సారంగధరుడికేసి క్రీగంట చూస్తూ) ఇదివరకే అబ్బాయి మనస్సు యే సుందరిమీద అయినా నిలిచివుందేమో అదిన్నీ చూసుకోవాలి.

సుబుద్ధి "చెప్పేస్తా" నన్నట్టు సారంగధరుడికేసీ, చెప్పడానికి సందేహిస్తున్నట్టు రత్నాంగికేసీ చూసి మొగం వంచుకుంటాడు. రత్నాంగి మందహాసం చేస్తూ సారంగధరుణ్ణీ, సుబుద్ధినీ, పరకాయిస్తూ వుంటుంది. చూపులతో సుబుద్ధిని వారించి సారంగధరుడున్నూ మొగం వంచుకుంటాడు.

రత్నాంగి: నేననుకున్నదే నిజం అయింది. సెలవివ్వండి.

సుబుద్ధి: (సారంగధరుడికేసి మళ్లీ చూసి మొగం వంచుకుంటాడు.)

రత్నాంగి: అనుమానిస్తారేమి నాయనా! సెలవివ్వండి.

సుబుద్ధి: (చేతులు నలుపుకుంటూ) లేదమ్మా. లేదండి.

రత్నాంగి: ఇదివరకే నాయనమాపొక రాజపుత్రిమీద వుండి, యిప్పుడు మీ మింకో రాజపుత్రిని నిరాకుచేస్తే యేమవుతుందో ఆలోచించారా? కనుక, సెలవివ్వండి ఇప్పటికే నాయన వాకామెని వరించివుంటే ఆమె సర్వలక్షణసంపన్నురాలే అవుతుంది. అతను పైపై మెరుగులకు భ్రాంతుడయ్యేవాడు కాడు. నేను చెప్పుకోడం కాదు; గాని నాకొడుకంతటి యోగ్యుడు దేవలోకంలోకూడా వుండడు. అందుచేతే, యీ విషయమై నేను చాలా అలమటించిపోతున్నాను. మహారాజులుంగారున్నూ పరిపరివిధాల ఆలోచిస్తున్నారు. కనక, అది అలా జరిగివుంటే— మీకు తెలిసిన్నీ వుంటే — వివరంగా సెలవివ్వండి. తరవాత, అబ్బాయి కోప్పడతాడని మీరు జంకవద్దు. అది సిగ్గుకాని అనిష్టంకాదు.

సారంగధరుడు: (సుబుద్ధికేసి చూస్తూ) అయ్యవారివాళ యెందుచేతో చాలా వింతగా ప్రవర్తిస్తున్నారు. (రత్నాంగితో) తమరూ బాబయ్యా ఆలోచించి, యెలా ఆజ్ఞాపిస్తే అలా చెయ్యడానికే నేను నిశ్చయించుకునివున్నానండీ అమ్మా! ఇందులో అసత్యం యేమీ లేదండీ!

రత్నాంగి: నీమాట అసత్యం అని యెందు కనుకోవాలి? నువ్వు, చివరికి, మా యిష్టంవచ్చినట్టే చేసినా, పరిపక్వమై వుంది కనక, నీ మనస్సు కొంత కల్పన చేసుకోవచ్చు కాదుటోయీ? కాక పోయినా, సుబుద్ధి అయ్యవారేదో సెలవిస్తున్నారోయీ!

సారంగధరుడు: చిత్తం చిత్తం. (సుబుద్ధికేసిచూస్తూ) నేనూ సావధానుణ్ణయి వున్నా నమ్మా!

రత్నాంగి: (సుబుద్ధితో) సరా?

సుబుద్ధి: అమ్మా, మూడేళ్లనాటి గొడవ. ఒకనాడు, పాపి కొండల్లో యువరాజులుంగారూ జక్కులదీని మండలేశ్వరుల కొమార్తె చిత్రాంగిదేవమ్మగారూ వుమ్మడిగా—(అర్థోక్తి)

రత్నాంగి: అవునవును, జ్ఞాపకం వుంది. అప్పు డాసంగతి మీరే సెలవిచ్చారు.

సారంగధరుడు: (సుబుద్ధిని విడిచి రత్నాంగి కేసి, రత్నాంగిని విడిచి సుబుద్ధికేసీ చూస్తూవుంటాడు.)

సుబుద్ధి: అప్పుడు యువరాజులుంగారి హృదయఫలకంమీద ఆమె రూపం లగ్నం అయిందా అని నా అనుమానం.

సారంగధరుడు: (చకితుడై మొగం వంచుకుంటాడు).

రత్నాంగి: ఇది కొత్తసంగతి. అప్పుడు మీరీ సంగతి సెలవిచ్చివుంటే—(అర్థోక్తి)

సుబుద్ధి: ఇప్పు డనుకున్నాను; గాని అప్పుడు నాకది తోచలేదమ్మా!

రత్నాంగి: సరేలెండి. అయితే, ఆమె చాలా బుద్ధిమంతురాలనీ, చురుకైనదనీ, త్రిలోకసుందరికూడా అనీ—భద్రాచలం యాత్రకి వెళ్లినప్పుడు, పద్నాలుగేళ్ల పిల్ల అయివుండగా, అత్తయ్యగా రామెని చూసివచ్చి సెలవిచ్చారు. తరవాతకూడా వా రామెమాట యెన్నోమాట్లు యెంతో ఆప్యాయనంగా సెలవిప్పిస్తూవచ్చారు మీరు సెలవిచ్చిందే నిజమయితే నాయన అదృష్టవంతుడే. నేనూ పెట్టిపుట్టినదాన్నే. ఇంతకీ, నాయనా—(సారంగధరుడికేసి చూస్తుంది)

సారంగధరుడు: (ముందు రత్నాంగికేసీ, తరవాత సుబుద్ధికేసీ చూసి తలవంచుకుంటాడు.)

సుబుద్ధి: అప్పు డలా జరిగివుండకపోతేమాత్రం అబ్బాయిగారి మనస్సు ఇప్పటికీ నిశ్చలమనే నా నమ్మకం అమ్మా!

రత్నాంగి: నాయనా! వివాహం అంటే పరమపవిత్రం కావడం అలావుండగా, స్త్రీ పురుషుల కది విడిపోని శాశ్వతబంధం. అది సరిగా యేర్పడకపోతే తరవాత అనేక చిక్కులు వస్తాయి. మూడుముళ్లూ

పడ్డతరవాత యెన్ని ప్రాతికూల్యాలు వచ్చినా, భార్యా భర్తాకూడా యెలాగో సరిపుచ్చుకోవాలి; గాని లేకపోతే తనుహాసి లోకనిందా చుట్టుకుంటాయి.

సుబుద్ధి: చిత్తం చిత్తం.

రత్నాంగి: (సారంగధరుడితో) కనక, నాయనా! మర్మం విడిచి నీ అభీష్టం యేమిటో చెప్పవోయ్! నే నమ్మనుకానూ? నాదగ్గిర సిగ్గెందుకు తండ్రీ!

సారంగధరుడు: సుబుద్ధి అయ్యవారికే అనుమానాస్పదంగా వున్న విషయం నేను మనవిచేసుకోడం యెలాగండీ అమ్మా?

సుబుద్ధి: (సారంగధరుడితో) అమ్మగారి ఆజ్ఞ—(అర్ధోక్తి)

సారంగధరుడు: (సుబుద్ధితో) మీ ఆజ్ఞే నాకు శిరోధార్యం. ఇక అమ్మగారి ఆజ్ఞే అయితే, చెప్పవలసిం దేమి వుందీ? (రత్నాంగితో) అయినా, అమ్మా—(అర్ధోక్తి)

అప్పుడు గౌరి వస్తుంది.

గౌరి: అమ్మా, బుల్లిబాబయ్యవచ్చి దర్శనంకోరి వేచివున్నారు.

అది విని రత్నాంగీ. సారంగధరుడూ, సుబుద్ధీ తటాలున లేచి నుంచుంటారు.

రత్నాంగి: (లేస్తూ) మరిదిగారే! (సారంగధరుడితో) వెళ్ళు నాయనా, బుల్లిబాబయ్యగారిని తోడితెచ్చుకో.

సారంగధరుడు: చిత్తం అమ్మా!

సారంగధరుడు బయలుదేరి వెడతాడు. సుబుద్ధి ద్వారందాకా మాత్రమే వెళ్ళి యెదురుచూస్తూ నుంచుంటాడు. గౌరి, యిద్దరు పరిచారికలచేత, రత్నాంగి యెదట, కొంచెం యెడమ పక్కగావున్న స్తంభానికిచేర్చి పరుపూ బాలీసూ వేయిస్తుంది. ఇంతలో ముందు సారంగధరుడూ, తరవాత విజయాదిత్యుడూ గుమ్మందాటి వస్తారు. వెంటనే చేతులు కట్టుకుని సుబుద్ధి నమ్రుడవుతాడు. విజయాదిత్యుడి

వెనక, చిత్రపటాలు పట్టుకుని వొక పరిచారిక నిలిచి వుంటుంది.

రత్నాంగి: (విజయాదిత్యుడికేసి పరీక్షగానూ గంభీరంగానూ చూస్తూ) దయ్యచెయ్యండి. (నిదానించి) అయితే, తమ రలా వున్నారేం మరిదిగారూ ?

విజయాదిత్యుడు: (తనని చూసుకుంటూ) నాకేమీ ? నాలో యేమీ మార్పు లేదే ? నేను బాగానే వున్నానండీ వదినా!

రత్నాంగి: లేరు ఎంత మాత్రమూ లేరు. తమ మొగాన వుల్లాసమే కనపడ్డం లేదు. నే నెరిగిన వున్నంతలో తమ రెప్పుడూ యిలా లేరు. (సారంగధరుడితో) బుల్లి బాబయ్య నీకెలా కనబడుతున్నారు నాయనా ?

సారంగధరుడు: (రత్నాంగితో) తమరు సెలవిచ్చినట్టు, బుల్లిబాబయ్య, యేదో గాఢవిచారంతోనే వున్నారమ్మా! (విజయాదిత్యుడితో) నిజం, బుల్లిబాబయ్యా!

విజయాదిత్యుడు: (సుబుద్ధికేసి చూస్తాడు)

సుబుద్ధి: అమ్మా, మళ్లీ దర్శనం చేసుకుంటా, నిప్పటికి సెలవిప్పించండి.

విజయాదిత్యుడు: (చెయ్యివూపి సుబుద్ధిని వారిస్తూ) అదేమీ? మీరిప్పుడిక్కడే వుండవచ్చు. మీరు వినగూడని రహస్యాల్లేవు సరిగదా, మీరున్నా వినవలసినవే ఉన్నాయి. నాలో మీకున్నా మార్పు కనిపిస్తూ వుందా అని—(అర్థోక్తి)

సుబుద్ధి: చిత్తం మహాప్రభూ! ఏలినవారు మర్మాంతికమైన ఆవేదన పడుతున్నట్టే నాకూ కనిపిస్తున్నారు.

విజయాదిత్యుడు: (కళ్ళు మూసుకుని నిట్టూర్పు విడుస్తాడు)

రత్నాంగి: (అది గుర్తించి) సరే, వేరే చెప్పే దేమిటీ ? నేను నుంచో లేకుండా వున్నాను. ముందు తమరు దయచెయ్యండి.

అందరూ కూచుంటారు.

విజయాదిత్యుడు: వదినా!

రత్నాంగి: ఏమి సెలవు?

విజయాదిత్యుడు: అన్నయ్యగారు అబ్బాయికోసం రాజపుత్రికల పటాలు తెప్పించారు. (పరిచారిక చేతిలో ఉన్న పటాలు పుచ్చుకుని రత్నాంగి యెదట వుంచి) వీటిని తమకీ, అబ్బాయికీ చూపించవలసిందనీ, తమ ఉభయుల ఇష్టాభిప్రాయాలూ తెలుసుకు రావలసిందనీ వారు నన్ను ఆజ్ఞాపించారు.

సారంగధరుడు (చకితుడై రత్నాంగికేసి చూసి) చాలా సంతోషం. అయితే, నేనిలా అన్నానని తమకు కోపంవద్దు.

విజయాదిత్యుడు: కోపమా? ఎందుకూ? సెలవిప్పించండి.

రత్నాంగి ఈ విషయమై తమ బాధ్యతకూడా గొప్పదే; కాని వారు దూరంగా ఉండిపోడానికి కారణం?

విజయాదిత్యుడు: ఉంది, వదినా, చాలా పెద్ద కారణమే వుంది.

రత్నాంగి: పోల్చుకో లేకుండా వున్నాను. చిత్రపటాల విషయమై నిన్న వృదయం చాలా కలివిడిగానే మాట్లాడారు; కాని నిన్న రాత్రి వారి దర్శనం కాలేదు. ఇవాళ వృదయం రాజకార్యాలలో ప్రవృత్తులై యిక్కడికి దయచెయ్యనే లేదు. సరే, వారిప్పుడీవిషయమై నాతో మాట్లాడానికే యిష్టపడ్డం లేనట్టు స్పష్టమే కదా; ఇలాంటిస్థితిలో, ఆకారణం గొప్పదే అని వేరే చెప్పాలా? ఏమయినా, తప్పదు కనక అదేదో సెల విప్పించండి.

విజయాదిత్యుడు: (చేతులు జోడించుకుని సవినయంగా) నేను తమ బిడ్డవంటివాణ్ణి. అన్నయ్యగారి ఆజ్ఞా, అక్కడి వార్తా తమకి మనవిచేసుకోవడమే నా పని. కనక, నన్నన్యథా భావించవద్దని మరీమరీ వేడుకుంటున్నాను.

సారంగధరుడూ సుబుద్ధీ నిర్విణ్ణులై ఒకర్నొకరు చూసుకుంటారు.

రత్నాంగి: పురుషసింహులైన తమర్నే అంతగా కదలించి వేస్తూవున్న ఆ విషయం నన్నెంత ఆరాట పెడుతుందో, అయినా సరే సెలవిప్పించండి.

విజయాదిత్యుడు: (పటాలు నిర్దేశిస్తూ) ఇవి అరవై పటాలు. అయితే, వీటిలో తమరూ, అబ్బాయీ పరిశీలించవలసిన యాభై తొమ్మిది మాత్రమే. ఒకటి తమ రుభయులూ చూడవచ్చు; గాని అది ప్రత్యేకించబడ్డది.

రత్నాంగి: ఎందుకోసం?

విజయాదిత్యుడు: ఆ పటం యెవరిదో ఆ సుందర - రాజ పుత్రికను అన్నయ్యగారు (మొగంపంచుకుని) వరించారు వదినా?

సారంగధరుడు: (చకితుడవుతాడు)

రత్నాంగి: (చెవులు మూసుకుని) శివశివా!

సుబుద్ధి: హరహరా! విధివైపరీత్యం!

విజయాదిత్యుడు: ఇలాంటి వార్త మోసుకువచ్చినందుకు నేను సిగ్గుపడుతున్నాను. తమ యెదటికి రాలేక రాలేక విధిలేక వచ్చాను. ఈ సంగతి నాతో సెలవివ్వడానికి అన్నయ్యగారికీ మొగంచెల్లలేదు.

రత్నాంగి: తమతో మరెవరు సెలవిచ్చారూ?

విజయాదిత్యుడు: గుమ్మం దిగాటప్పటికి వచ్చి మహా రుద్రయ్యగారు నా చెవిలో వూదారు.

రత్నాంగి: వారిని మహారాజే పంపారు!

విజయాదిత్యుడు: సందేహ మేమీ?

సుబుద్ధి: ఈ పన్నుగడే మహారుద్రయ్యగారి దని నా వుద్దేశం మహాప్రభూ! మహారాజులుంగారి అనుగ్రహం తప్పిపోకుండా వుండ డానికి వారెప్పుడూ యిలాంటి యెత్తులే వేస్తున్నారు.

విజయాదిత్యుడు: అవునవును. నర్మసచివు లని మహా రుద్రయ్యగారికి పేరే కాదా?

సారంగధరుడు: ఇది మహారుద్రయ్యగారి పన్నుగడ అయినా, బాబయ్యగారికి స్వయంభువే అయినా పర్యవసానం వొక్కటే. కనక, బుల్లి బాబయ్యా! ఆ రాజపుత్రిక పేరున్నా—(అర్థోక్తి)

రత్నాంగి: అబ్బాయి చెప్పింపి బాగానే ఉంది, సెల విప్పించండి.

విజయాదిత్యుడు: జక్కులదీవి—(అర్థోక్తి)

పిడుగుపడ్డట్టయి సారంగధరుడు మొగం వంచుకుంటాడు. మొగం కప్పుకుని, రత్నాంగి "హా—య్యో" అంటూ కుంగిపోతుంది. "హరహరా! హరహరా" అంటూ సుబుద్ధి చెవులు మూసుకుంటాడు.

విజయాదిత్యుడు: (తెల్లపోయి, సుబుద్ధితో) మీ ధోరణి చూడగా నాకేదో మహావైపరీత్యం స్ఫురిస్తోంది

రత్నాంగి: అవును. తమరు సరిగానే వూహించారు.

విజయాదిత్యుడు: వివరంగా వినకోరుతున్నాను.

రత్నాంగి: అరవైయేళ్లు నిండనున్న మహారాజు కొక నవోఢను పరిణంచి నందుకూ, యాభైయేళ్లు వయస్సున్న నాకు సవతి దాపరిస్తూ వున్నందుకూ నాకేమీ విచారం లేదు. ఈ కారణంవల్ల వారిని అల్లరిపెట్టి, నేను నలుగురి నోళ్లా పడ్డమూ మంచిది కాదు; కాని, మహారాజు కోడలిమీద కన్ను వేశారు.

విజయాదిత్యుడు: (ఉలిక్కిపడి హీనస్వరంతో) అం—టే?

సుబుద్ధి: (రత్నాంగితో) తరవాతి సంగతి నేను మనవిచేసుకుంటానమ్మా! (విజయాదిత్యుడితో) తమరు దయచేశాటప్పటికి, అమ్మగారితో, నేనీవిషయమే మనవి చేసుకుంటున్నాను. మరేమీ లేదు, అబ్బాయిగారు ఐక్కలదీవి రాజపుత్రిక చిత్రాంగీ దేవమ్మగారి మీద, మూడేళ్ళుగా మరులుగొని వున్నారు మహాప్రభూ!

సారంగధరుడు: (సుబుద్ధికేసి పులుకూ పులుకూ చూస్తాడు)

విజయాదిత్యుడు: హరహరా! ఏమి దుష్కాలమూ? ఏమి ఆసురసంకల్పమూ! అయితే, యింతవరకూ (సారంగధరుడికేసి చూస్తూ) యిది అంత రహస్యంగా యెందు కుండిపోయిందీ?

సారంగధరుడు: (విజయాదిత్యుడికేసి వొక్కమాటు చూసి మొగం వంచుకుంటాడు)

రత్నాంగి: నా కొడుకు తెలివితక్కువ పనే చేశాడు. అయితే, కొడుకు కోసం నిర్దేశించబడ్డ పెళ్లికూతుర్ని తండ్రే కట్టుకుంటాననడం యేమిటీ?

విజయాదిత్యుడు: ధోరణి చూడగా చళుక్యవంశానికి నేడేదో

అపాయం కనిపెట్టుకుని వున్నట్టుంది. వైదికధర్మం విలుప్తమయి పోయేటట్టూఉంది.

సారంగధరుడు: (గంభీరంగా చూస్తూ) ఇప్పు డంత ప్రమాదం యేమి వచ్చింది బుల్లిబాబయ్యా ? తమ రంత బెంబేలు పడిపోవడమున్నా యేమిటీ ?

రత్నాంగి: అయ్యో ! ఆయ్యో !

సారంగధరుడు: అమ్మా ! తమరు నా మనవి చిత్తగించ కోరుతున్నాను రాజకుటుంబాలలో బహుపత్నీకత్వం సర్వసాధారణ మైన విషయం. అది అనేక కారణాలవల్ల తటస్థపడుతుంది. ఇప్పుడు బాబయ్యగా రీవివాహం తలపెట్టుకున్నా రంటే, జటిలమైన రాజ కీయపుపెత్తేదో యిందులో నిగూఢమయి వుందని మనం గుర్తించు కోవాలి. కాని కేవలమూ యింద్రియలోలతవల్ల వారిందుకు సిద్ధపడు తున్నారని నిశ్చయించుకోగూడదు.

సుబుద్ధి: (సారంగధరుడితో) చిత్రాంగీదేవమ్మగారి విషయమై తమరు — (అర్థోక్తి)

రత్నాంగి: (సుబుద్ధితో) క్షణం కిందటిదాకా ఆమె పేరు చెబితే యెంతో గాంభీర్యం నటించిన నాయన యెంతలో యెలా మారిపోయాడో చిత్తగించారా ? (విజయాదిత్యుడితో) వెర్రితండ్రి ! అదీ ధోరణి.

విజయాదిత్యుడు: కనకనే అన్నయ్యగా రంత సాహసించ గలిగారు. (సారంగధరుడితో) బాబూ ! నువ్వు చెప్పింది సరే అను కుందాం. అయితే, కోడలిమీద కన్ను వెయ్యడం—(అర్థోక్తి)

సారంగధరుడు: తెలిసే వారలా చేస్తున్నా రనడానికి మన కాధారం యేమిటీ ?

విజయాదిత్యుడు: తెలిస్తే ఆ కోరిక మళ్ళించుకోవలసిందే కాదూ ?

సారంగధరుడు: సుబుద్ధి అయ్యవారి వూహ నమ్మెయ్యడ మేనా తమరు ?

రత్నాంగి: (సుబుద్ధితో) ఆలకించారా ?

విజయాదిత్యుడు : సుబుద్ధి అయ్యవారి మాట అలా వుంచు. నువ్వు నిజంచెప్పు. ఆమెని నువ్వు—(అర్థోక్తి)

సుబుద్ధి : (తర్జనితో టొకాయిస్తూ) అలా అడగండి మహా ప్రభూ !

సారంగధరుడు : (సుబుద్ధి) ఆ మాట మీరూ అడగవచ్చు. (విజయాదిత్యుడితో) ఆమె తల్లిగా రవుతా రంటేనే నా హృదయాని కాహ్లాదంగా వుంది బుల్లిబాబయ్యా !

రత్నాంగి : శివా ! శివా !

సుబుద్ధి : నేనొప్పుకోను. ఆవేళ నేను తమ సన్నిధిలో లేననుకున్నారా ? తమరూ ఆమె చూసుకున్న– (అర్ధోక్తి)

సారంగధరుడు : అయితే, నా చూపుల అర్థం నాకు తెలపదంటారా మీరు? వాటికి ప్రేరకమైన నా చిత్తవృత్తి యెలాంటిదో నాకు తెలవనే తెలపదంటారా మీరు? నా మనస్సుకి మీరేమి ఆరోపించినా నా బుద్ధి అంగీకరించితీరా లంటారా మీరు ?

రత్నాంగి : (సుబుద్ధితో) ఇక మన మేమి చెప్పగలమూ ?

సుబుద్ధి : (విజయాదిత్యుడితో) ఆ తర్కం యెవ రందకో గలరు మహాప్రభూ ?

సారంగధరుడు : (సుబుద్ధితో) మనకి తర్కం యెందుకూ యిప్పుడూ? బాబయ్యగారి నిశ్చయం పూర్వపక్షం చేసెయ్యాలన్న ప్రయత్నంమాత్రం యెందుకూ మనకూ? (విజయాదిత్యుడితో) అమ్మగారికీ తమకూ నేను ధర్మాలు చెప్పగలవాణ్ణా బుల్లిబాబయ్యా?

విజయాదిత్యుడు : మరి నువ్విప్పుడు చెప్పే దేమిటీ?

సారంగధరుడు : మనవి చేసుకుంటాను. బాబయ్యగారి స్థితిగతులు మనం కొంచెం బోధపరచుకోవాలి. ఏమంటే - వారు చతుర్వేదాలూ అభ్యసించారు. షట్ఛాస్త్రాలూ పఠించారు. సకల పురాణేతిహాసాలూ పరిశీలించారు. తమ సర్వజ్ఞతకీ, ధర్మనిరతికీ వినియోగంగా గురుదేవులవారిచేత పంచమవేదమైన మహాభారతం తెనుగుచేయిస్తున్నారు.

విజయాదిత్యుడు : ధర్మాలు తెలుసుకోవడం సులభమే.

సారంగధరుడు : ఎంతమాత్రమూ కాదు. సామాన్యధర్మాలూ

విశేష విధులూ పడుగు పేకలుగా అల్లుకుపోయి వుంటాయి. వాటి సమ్యగ్బోధ మహాప్రతిభావంతులకుగాని సాధ్యపడదు. అంతటి ప్రతిభావంతులు తెలుసుకునిమాత్రమే వూరుకోలేరు.

విజయాదిత్యుడు: ధర్మచింత వుంటేనూ.

సారంగధరుడు: అదే వుండకపోతే ధర్మాలు తెలుసుకోవాలన్న బుద్ధిమాత్రం యెలా పుడుతుందీ? ధర్మం తెలవడం అంటే బుద్ధికి సంస్కారం కలగడంకాదా బుల్లిబాబయ్యా? ఎదటిమనిషి ఆచరణ ధర్మబద్ధమనో ధర్మదూరమనో నిరుకుచెయ్యడంమాత్రం పైపైని వుందా?

విజయాదిత్యుడు: (సుబుద్ధికేసి చూస్తాడు)

సుబుద్ధి: అయితే, మహారాజులుంగారి కిది విశేషవిధికి సంబంధించిన ధర్మాచరణం అనా తమ నిర్వచనం?

సారంగధరుడు: ముమ్మాటికీనీ. ఎందుకు కాదూ? ఒక్కటి చిత్తగించండి. బాబయ్యగారి వయస్సా, వివాహయోగ్యంకాదు. ఇప్పటి సందర్భమూ, జనసమ్మతంకాదు. (పటాలు చూపిస్తూ) ఈ రాజపుత్రికలా, వారికి పరిగ్రాహ్యులు కారు. ఇలాగ, యీ కారణాలు, వాక్కుచ్చే వారిని దిగ్భ్రాంతులను చేసెయ్యగలవు. కాని బాబయ్యగారివన్నీ యోచించుకోలేదని మీ రెలా చెప్పగలరూ! మీరు కొంచెం సావధానంగా యోచించండి. అత్యంత క్లిష్టాలైన సన్నివేశా లేవో కొన్ని వారిని ముట్టడించాయి. వాటిని సరిపుచ్చుకోడానికే___ (అర్థోక్తి)

విజయాదిత్యుడు: బాబూ! నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు, యిందులో యింద్రియలోలత తప్ప మరేమీలేదు. మహారుద్రయ్యగారి ఉపదేశ ప్రోత్సాహాలుతప్ప దీనికి ప్రేరకంగా రాజకీయపు చిత్తే మీ లేనేలేదు.

రత్నాంగి: అదీమాట.

సారంగధరుడు: (రత్నాంగికేసి చూసి వూరుకుంటాడు)

రత్నాంగి: కాకపోతే, ఈ పటాలకు చెందిన రాజపుత్రికలను విడిచి మరో పదిమందిని పెళ్లాడమను. నా అభ్యంతరంలేదు.

విజయాదిత్యుడు: ఏం. అది బాగుందా?

సారంగధరుడు: (నిరుత్తరుడై మొగం వంచుకుంటాడు).

సుబుద్ధి: అయితే, ఇప్పుడు కర్తవ్యం యేమిటనీ తమ ఆజ్ఞ?

సారంగధరుడు: బాబయ్యగారి వివాహానికి ప్రయత్నమే.

రత్నాంగి: (ఉలిక్కిపడుతుంది.)

విజయాదిత్యుడు: అలాగ వాక్కునాటికీ కాదు. తమ అభిప్రాయం యేమిటి వదినా?

రత్నాంగి: నేనేమీ చెప్పలేను. నాకు మతిపోయింది. ఏం చేసినా తమరూ, గురుదేవులూ, చిట్టివీరన్నగారూ—(అర్ధోక్తి)

విజయాదిత్యుడు: ముందు అన్నయ్యగారికి నేనేంటీచెప్పడం?

అందరూ సారంగధరుడుకేసి చూస్తారు.

సారంగధరుడు: దీని కింత ఆలోచన యెందుకు బుల్లి బాబయ్యా? తండ్రీ కొడుకులకు ఏకకాలంలో వివాహం అశాస్త్రీయమనీ, లోకమున్నూ హర్షించదనీ తమకు తెలవందా? కాక, వివాహం విషయమై బాబయ్యగారికేగాని, నా కిప్పుడు తొందరలేదు. ఈ సంగతి వారితో విన్నవించి, ఉపయోగించవలసిందని పటాలుకూడా వారికే సమర్పించండి.

విజయాదిత్యుడు: (రత్నాంగికేసి చూస్తాడు)

రత్నాంగి: (సారంగధరుడికేసి చూస్తుంది)

సారంగధరుడు: (రత్నాంగితో) తమరు నా మనవి ఆలకించండి. ఇది ఇలా జరిగిపోవలసిందే.

రత్నాంగి: (విజయాదిత్యుడితో) ఇక లాభంలేదు. అబ్బాయి కేదేనా తోచకేపోవాలి; గాని తోస్తే అది అలా జరగవలసిందే. కనక, యీమాటలే వారితో విన్నవించండి. ఏమాత్రమేనా తరవాయివుంటే, చిరకాకుబల్లేలయి యివేనా వారి కావేదన పుట్టించవచ్చు.

సుబుద్ధి: అమ్మగారు సెలవిచ్చింది బాగుంది. అలా చేయించండి మహాప్రభూ!

విజయాదిత్యుడు: అన్నయ్యగా రిప్పుడు కామజ్వర పీడితులై వున్నారు. వారి కిదేమీ తలకెక్కదు.

అందరూ లేస్తారు.

రత్నాంగి: మరిదిగారూ! ఒక్క మనవి.

విజయాదిత్యుడు: ఏమి సెలవు?

రత్నాంగి: అబ్బాయి నా కేకసంతానం. ఇప్పటిమట్టుకి వారికీ అంతే అతనేనా, లేకలేక—ఎన్నో వ్రతాలు చెయ్యగా—ఎన్నో తీర్థ క్షేత్రాలు సేవించగా—ఎందరో సాధువులను కొలవగా పుట్టుకు వచ్చాడు. అతను చెప్పినట్టు వివాహాని కేమంత తొందరలేదు. ఇక వున్నదల్లా నాకొక్కటే కోరిక. (చేతులు జోడించుకుని) నాయన, మహారాజు కడుపున పుట్టాడు. జ్యేష్ఠుడున్నూ అతనే అవుతాడు కనక నాయనకి రాజ్యాధిపత్యం అయినా తప్పిపోకుండా — (అర్ధోక్తి)

సారంగధరుడు: (చురచుర మాస్తూ) బుల్లి బాబాయ్యా, సెలవు. (గిర్రున తిరిగి లోపలికి వెళ్లిపోతాడు.)

రత్నాంగీ, విజయాదిత్యుడూ, సుబుద్ధీ చకితులై అతను వెళ్లిన దిక్కుగా చూస్తారు.

విజయాదిత్యుడు: వదినా! ఎంత కింతయింది కదా? ఇక భవిష్యత్తు - దానిమాట యిప్పుడు కాదు. (సుబుద్ధితో) వెంటనే మీ రింటికి దయచేసి, సంగతంతా విన్నవించి, దీపాలు పెట్టాక ఒక్క మాటు మీ నాయనగార్ని ఇక్కడికి రమ్మని సెలవివ్వండి

రత్నాంగి: (సుబుద్ధితో) మీరూ దయచెయ్యండి నాయనా!

సుబుద్ధి: చిత్తం మహాప్రభూ! చిత్తం అమ్మా!

విజయాదిత్యుడు: వదినా! మరి సెలవు.

రత్నాంగి: చిత్తం, సెలవు.

సుబుద్ధి: అమ్మా! సెలవు.

రత్నాంగి: మంచిది నాయనా!

ముందు విజయాదిత్యుడూ, పటాలు పుచ్చుకుని తరవాత పరిచారికా, మొగం వంచుకుని పిమ్మట సుబుద్ధీ వెడతారు. రత్నాంగి కాళ్లీడ్చుకుంటూ సారంగధరుడు వెళ్లిన వేపుకి వెడుతుంది.

# నాలుగో రంగం

జక్కులదీవి రాజోద్యానంలో, ప్రకాశమానమైన నీరెండ, వృక్షాగ్రాలకు బంగరుపూత పూస్తోంది. ప్రతీలతా, ప్రతీ పొదా, ప్రతీచెట్టూ ఆకురాల్చి చిగిరిస్తూ కొన్నీ, గుబురుగా ఆకుతొడిగి కొన్నీ, మొగ్గతొడిగి కొన్నీ, విరగబూసి కొన్నీ, పిందెలు పేల్చి కొన్నీ, మహోల్లాసం కలిగిస్తున్నాయి. విశాలమైన కొలనిలో, అసంఖ్యాలైన యెర్రకలువపూల మధ్యనూ, తెల్లతామరపువ్వుల మధ్యనూ, అయిదారు రాజహంసలు విహరిస్తున్నాయి. ఉత్తరపుగట్టున, తెల్లని నెమిలి పురివిప్పి పారవశ్యంతో నాట్యంచేస్తోంది. దక్షిణపుగట్టున, పాతిక ముప్ఫయి పావురాలు, యెగురుతూ దుముకుతూ గుబాళిస్తున్నాయి. ఎదటిగట్టున, ఒక లేడిపిల్ల, పడుకుని నెమరువేస్తున్న తల్లి మొగంమీద ఒకమాటు మొగం పెడుతూ యింకోమాటు అటూయిటూ చెంగుచెంగున దూకుతూ, మరోమాటు తల్లి పొదుగులో మూతిపెడుతూ ఆడుకుంటోంది. కొంచెం దూరాన, ఏదో చెట్టుకొమ్మల్లో కచేరీచేసి, గండుకోయిల స్వరకల్పన చేస్తోంది. చాటున వుండి మన్మథుడు రతీదేవికి వింజామరల వేస్తున్నట్టు, పిల్లగాలి, తెరలు తెరలుగా విసురుతోంది. సంపెంగ పువ్వుల పరిమళమూ, పొగడపువ్వుల సువాసనా, గులాబీపువ్వుల సౌరభంతో మిళితం అయి మత్తెక్కిస్తోంది.

ఇలాంటి సమయాన, ఇలాంటి పూలతోటలో, కొలని పడమటి గట్టున, నీటివారగా వున్న అశోకవృక్షం కింద,

చిత్రాంగి వుయ్యాలాలో కూచునివుంది. వెనక నుంచుని, ఆమె దాదిఅయిన చిలక మెల్లిగా వుయ్యాలా వూపుతోంది. పక్కనేవున్న పాలరాతి తిన్నెమీద కూచుని, రుక్కు అనే చెలికత్తె, ఆరవిచ్చిన గులాబీమొగ్గలూ, విడబారిన చెట్టు సంపంగెపువ్వులూ మధ్యమధ్య చేరుస్తూ బొండుమల్లె మొగ్గలు దండగుచ్చుతోంది.

ముగ్గురూ కలాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

చిలక: అమ్మాయి విడిచిన అర్ధచంద్రబాణం తగిలి ముందరి కాళ్ళు రెండూ యెగిరెపోయాయి. దాంతో పులి కుప్పగా కూలిపోయింది; కాని తోక నేలకేసి కొట్టుకుంటూ, వెనకటి కాళ్ళ మీద లేవబోయి తూలిపడిపోతూ, అది చేసిన అల్లరి అంతా యింతా కాదు. దాని పెడబొబ్బలతో అరణ్యం అంతా దద్దరిల్లిపోయింది. వింట మరో బాణం సంధించిన్నీ, వొక మాటు ఆకర్ణాంతమూ లాగిన్నీ, దాని అల్లరి చూసి ముచ్చటపడుతూ వొక్క క్షణం వూరుకున్నా రమ్మాయి. ఈ సందులో సారంగధరులవారి బాణం రివ్వున వచ్చి గుండెల్లో గుచ్చుకుని, ప్రాణాలు తీసింది.

చిత్రాంగి: పులిరోషం ఆవేళ చూసినట్టెప్పుడూ చూడలేదు. ఎన్నో మాట్లనుకున్న ముచ్చట ఆవేళ తీరింది.

రుక్కు: ముచ్చట అంటే—(అర్థోక్తి)

చిలక: ఒక వేపున చెవులు గింగురు మని పోవడమూ, మరో వేపున కళ్ళు జిగాల్—జిగాల్ మని పోవడమూ, యింకో వేపున హృదయం ఆనంద ముగ్ధమయి పోవడమూ — భరించగలిగితే యింతకంటే ముచ్చట యేం వుంది? అయితే మాత్రం యిది కోరుకుంటే తటస్థపడే సన్నివేశమా?

చిత్రాంగి: లేచిన వేళ మంచిది కనక, ఆ వేళ అలా సమకూడింది; కాని యెందుకూ? చివరికి—(అర్థోక్తి.

చిలక: అది కూడా జరిగివుంటేనా?

రుక్కు : నిజమే. దాని ప్రాణాలు పోవడం కూడా అమ్మాయి చేతిలో అయితేనే — (అర్థోక్తి)

చిత్రాంగి, చిలకా నవ్వుకుంటారు.

రుక్కు : ఎందుకమ్మా అలా నవ్వుకుంటారు ?, ముఖ్యమైన సంగతి నేను గ్రహించలేదనుకున్నారు కామోసు ! తరవాత, మేకం మాదంటే మాదని—(అర్థోక్తి)

చిత్రాంగి : (చప్పట్లు కొడుతూ కిలకిలా నవ్వుతుంది.)

చిలక : (ఒక్క మాటు చిత్రాంగితో కూడా నవ్వి, రుక్కుతో) మాదంటే మాదేమిటే ?

రుక్కు : అవునూ. ఉమ్మడిగా కొట్టిన పులి—(అర్థోక్తి)

చిలక : ఉమ్మడిగా కొట్టడం యేమిటీ ?

చిత్రాంగి : (కళ్లూ మొగమూ తిప్పుకుంటూ) ఉమ్మడిట, ఉమ్మడి. అంత స్పష్టంగా కనపడుతూ వుంటే—(అర్థోక్తి.)

చిలక : కపవడితే మాత్రం కినగలిగివుండవద్దూ ?

చిత్రాంగి : మహా బాగా చెప్పావు.

చిలక : లోకంలో యిలాంటివాళ్లే యెక్కువ. వాళ్లకి బుద్ధి తక్కువగా వుండదు; కాని నైశిత్యం లేక అది మొద్దుబారి వుంటుంది. వాళ్లే సంగతీ స్వయంగా బోధపరుచుకోలేరు. అయితే, యెవరేనా వివరించి చెబితే మాత్రం "వో—హో ! అదా ?" అంటూ తల యెగరవేసుకుంటారు. అంతూ పంతూ లేకుండా విశేషార్థాలు కూడా తీస్తారు.

చిత్రాంగి : వాళ్లలో కొందరు, తెలిసివుండిన్నీ అక్రమ వాదానికి పూనుకుంటారు. చూశావు కాదూ, సుబుద్ధి అయ్యవా రావేళ యెంత గడుసు రాకడ వచ్చారోనూ ?

చిలక : అవునవును. అబ్బో ! తమ ధర్మశాస్త్ర పాండిత్యం అంతా ఆ మహారణ్యంలో వొలకబోసేశా రయ్యవారు.

రుక్కు : నాకు బుద్ధి వుందన్నా సంతోషమే, లేదన్నా సంతోషమే కాని వారేమన్నా రేమిటి?

చిత్రాంగి : ఏమన్నా రేమిటి, యేమన్నా అనగలరు. నదురూ బెదురూ, వెనకా ముందూ—(అర్ధోక్తి)

చిలక : సారంగధరులవారే పులిని కొట్టారుట. అంచేత అ తమదేట.

రుక్కు : కాదనడం యెలాగా?

చిత్రాంగి : (చిలకకేసి చురుగ్గా చూస్తుంది)

చిలక : ఇది మరీ బాగుంది. ఒక మా టుమ్మడిగా కొట్టా రంటావు, మరో మాటు పులి వారిదే అంటావు. శాబాసు నే కొన్నాళ్ళు సుబుద్ధి అయ్యవారి శుశ్రూష చెయ్యి, నీ బుద్ధి యింక వికసిస్తుంది.

చిత్రాంగి : (చప్పట్లు కొడుతూ) సెబాస్! సెబాస్! నువ్వు మహా బాగా చెప్పావు.

రుక్కు : ఏమమ్మా? నేనన్నదాల్లో తప్పేం వుందో—(అర్ధోక్తి)

చిత్రాంగి : అందులో వున్నదే తప్పు, అడిగే దేమిటీ?

రుక్కు : ఎలాగమ్మా?

చిలక : ఇలాగమ్మా! పులి కదలలేని స్థితిలో వుంది; కనుక సులువుగా వా తొక్క బాణంతో—(అర్ధోక్తి)

రుక్కు : బరిమీద వుండగా వారు పులిని కొట్టలే రంటావా?

చిలక : ఒక్క బాణంతో కూలగొట్టిన అమ్మాయి మరో బాణంతో దాన్ని చంపలేకపోదు రంటావా?

చిత్రాంగి : ఒక్క క్షణం దాటిపోయింది; కాని, లేకపో నేను కలియబడే కటారితో దాని గుండెలు తీసివుందును.

చిలక : అవునవు, నదీ నిజమే. సామర్థ్యానికి సాయ సాహసం కూడా వుంటే అదేమంత ఘనకార్యం?

చిత్రాంగి : సామర్థ్యం అంటూ వుంటే, అలాంటప్పుడు దా కదే పుడుతుంది సాహసం.

చిలక: పుట్టకేం? ఒక వెంపున నేనూ మరో వెంపున బాబయ్యా ధనుస్సులు యెక్కుబెట్టుకుని వుండిన్నీ, అమ్మాయే పూర్తి చేస్తారని వూరుకున్నాం. దాని రోషం చూడ్డంకోసం అమ్మాయీ వూరుకున్నారు; గాని లేకపోతేనా? ఇంతకీ, సారంగధరుల వారేనా తమ దారిని తాము వచ్చి వున్నారు; కనక, పడిపోయిన్నీ ఘూర్ణిల్లుతూనే వుండిన పులి కనపడేటప్పటికి, యోధసామాన్యమైన వుత్సాహంతో బాణం విడిచారేమో గాని, జరిగింది తెలుసుకుని వుంటే వారా పని చెయ్యకేపోదురు.

చిత్రాంగి: తరవాతేనా, సుబుద్ధి అయ్యావారే కజ్జాకి సిద్ధ పడ్డారు; గాని యిదంతా గమనించి వారూరుకునే వున్నారు కాదుటే?

చిలక: కాకపోతే "పులి తమదే అని తమ నిశ్చయం అయితే, మేము వెళ్లిపోతాం, తమరే పట్టించుకు వెళ్ళండి" అని బాబయ్య అన్నప్పుడు ఏ మాత్రం సందుండినా వారు విడిచి వెళ్లి పోయి వుందురా?

చిత్రాంగి: మరే. కాని బాబయ్య అప్పు డలా అంటా రనుకో లేదు సుమా నేను.

చిలక: బాబయ్య కాక మరొక రయితే అలా అనలేకాపోదురు. సారంగధరులవారు కాక మరొక రయితే అలా వెళ్ళిపోయీ వుండరు.

రుక్కు: ఈ వుత్తుత్తి మాటల కేం గానీ, చివరి కేమయిందో చెబుదూ?

చిత్రాంగి: దానికి వుత్తుత్తి మాటలు కాదు, గట్టి మాట కావాలిట చెప్పవే.

చిలక: అప్పుడు కావడానికీ, ఇప్పుడు చెప్పడానికీ ఏం వుందీ? సారంగధరులవారి బాణం పులిహృదయం మీద నాటుకోగా. వారి రూపం అమ్మాయి హృదయం మీద నాటుకుంది. (ఉయ్యాలా ఆపి, ముందుకి వంగి, చిత్రాంగి మొగంమీద మొగంపెట్టి) కాదూ తల్లీ?

చిత్రాంగి: (ఆనందం అణుచుకుంటూనూ, ముంగోపం నటి స్తూనూ) ఛో!

రుక్కు: ఆమాటంటే అంత కోపం యెందుకమ్మా? సారం? ధరులవారివిషయమైమాత్రం అలా జరిగివుండగూడదా? అబ్బో, అప్ప ణ్ణుంచీ వారెంత నలిగిపోతున్నారో పాపం?

చిత్రాంగి: ఇప్పణ్ణుంచీ యిక నువ్వెంత నలిగిపోతావో పాపం వారి అవస్థ వూహించుకుంటూనూ? అయితే, యీ సంగతి తెలిస్తే యెప్పటికేనా నీకు మంచి బహుమతీ చెయ్యకపోరులే

రుక్కు: ఎప్పుడోయేం, దేవుడు మేలుచేస్తే ఒక్క నెలలో; వారివల్ల బహుమతీ పుచ్చుకుంటాను నేను.

చిలక: నువ్వు చెప్పింది బాగానేవుంది. ఏమంటే—మూడేళ కిందట పాపికొండల్లో జరిగిన సంగతి వారి హృదయం ఆక్రమించుకు వుంటే, సార్వభౌము లెన్ని పటాలు తెప్పించినా, అమ్మాయిని తప్ప మరొక రాజపుత్రిని వరించరు వారు. వరించనే లేదు.

చిత్రాంగి: కారణాలమీద కారణాలు కల్పించి, సుబుద్ధి అయ వారు ముందరి కాళ్ళకి బంధాలు వెయ్యబట్టి కాని, లేకపోతే, బాబయ అంత ప్రేమతో ఆహ్వానించినందుకు, ఆవేళ భోజనానికి మన గు రానికి వచ్చివుండకపోదురా వారు?

చిలక: అవును తల్లీ, తప్పకుండా వచ్చివుందురు. బాబయ పిలిచినప్పుడు వారి మొగం ఎంతో కలకల్లాడింది. "రాలేను" అ చెప్పినప్పుడు వా రెంతో బాధపడ్డట్టు స్పష్టంగా కనపడింది. బాబయ్య అలాచెప్పి, వారు సుబుద్ధి అయ్యవారిని చూసినచూపులో ఎంతో అ తృప్తిన్నీ కనపడింది. అలాకాక, నిజంగా వారు వచ్చేవుంటేనా?

రుక్కు: వారు వచ్చేవుండి, నేనున్నూ అప్పు డక్కడ వుం వుంటేనా? నిమిషంలో రెండు పూలదండలు కట్టి- (లేచి వెళ్లి, పూ దండ చిత్రాంగి మెడలో వేసి, ఆమె గడ్డం పుణుకుతూ) ఇ దమ్మాయి కీదండ నేను వెయ్యడానికి వీలుండునా?

చిత్రాంగి: (సిగ్గుపడి తల వంచుకుంటుంది.)

చిలక: చూడనిదానికి నీకే యిలావుంది, చూసినదాన్ని నెంత మధనపడిపోయానో అప్పుడు?

చిత్రాంగి: గుడారానికి వచ్చాక, బాబయ్యగా రెంత నొచ్చుకున్నారో చూశావుకాదూ?

చిలక: అబ్బరమా అమ్మా?

రుక్కు: అయితే, సుబుద్ధి అయ్యవా రప్పు డక్కడ వుండడం—(అర్థోక్తి)

చిలక: పానకంలో పుల్లవతుగా అయింది. నిజంగా వా రప్పు డక్కడ వుండకపోతే, సారంగధరులవారు మన గుడారానికి రావడమూ.—(అర్థోక్తి)

రుక్కు: గాంధర్వవివాహం—(అర్థోక్తి)

చిత్రాంగి: (రోషం అభినయిస్తూ) ఫో, సిగ్గులేదూ నీకూ?

చిలక: అలాంటప్పుడు రుక్కుమ్మకి తప్పకుండా సిగ్గుండవలసిందే. అలా వుండకపోతే దాని బుగ్గలు చిదిమి చేతిలో పెట్టివుందును నేను. దానికేంగానీ, అప్పు డలా జరిగేవుంటే, సత్యాకృష్ణుల యమునావిహారంలాగ అమ్మాయీ, సారంగధరులవారూ మహోల్లాసంతో యిప్పుడు గోదావరీవిహారం చేస్తూ వుండకపోదురా?

చిత్రాంగి: నువ్వు గోదావరీవిహారం అంటే జ్ఞాపకం వచ్చింది, యేదీ, ఆ కథ మళ్లీ చెప్పవే.

రుక్కు: (చిలకతో) అదేం కథే?

చిలక: కథకాదు; గాని కథకంటే చమత్కారమైనది. నన్నయభట్టారకులవా రెంచేతో వూరుకున్నారు; గాని, వారే కనక అది వర్ణించివుంటే, భారతంకంటేనూ యెంతో రసవంతం అయివుండును.

చిత్రాంగి: నిజమే. దాల్లో కవితావస్తు వెంతేనా వుంది.

రుక్కు: ఇద్దరూ కలిసి నమ్నారించేస్తున్నారు; గాని, జరిగిందేమిటోమాత్రం పొకరూ చెప్పరు.

చిత్రాంగి: చెబుతుంది, చెబుతుంది. ఇప్పటికే చాలా వూరిపోయావు పాపం, చాలించి యిక విను.

చిలక: ఒకనాడు సారంగధరులవారూ, సుబుద్ధి అయ్యవారూ యెందుకో పట్టిసపు కొండకి వెళ్లివుండి, నాలుగ్గుళ్ళపొద్దువేళ తిరిగి వస్తున్నారుట.

రుక్కు : సరే.

చిలక: వారి పడవ వాయువేగ మనోవేగాలతో యెగిరి వచ్చే స్తోందిట.

రుక్కు : ఊఁహూఁ.

చిలక : సరిగా ఆ సమయాన రెండుమూడు వందల డింగీలలో వూరివా రక్కడ నదీవిహారం చేస్తున్నారుట.

చిత్రాంగి : (కళ్లుమూసుకుని) హాయిహాయి.

రుక్కు : (చిత్రాంగిని చూస్తూ) మన కొలనిలో అలా విహరిస్తూనే ఉన్నారుకదా — (అర్థోక్తి)

చిత్రాంగి : (కళ్ళు మూసుకునేవుండి) డింగీతోపాటు కెరటాల మీద వూగిపోతూ, అన్ని డింగీలమధ్య విహరిస్తే—ఏమే చిలకా! ఇక నిద్రాహారా లెందుకే?

చిలక : నిజమే తల్లీ! ఒక డింగీలోనుంచి సంగీతం వినవస్తూ వుంటుంది. ఇంకో డింగీలోనుంచి కేరింతాలు వినబడుతూ వుంటాయి. మరో డింగీలోనుంచి—(అర్ధోక్తి)

రుక్కు : మధ్య నీ కేరింతాలేమిటి, చాలించు.

చిలక : అదేమే?

రుక్కు : కాకేమే?

చిలక : ఏం తక్కువే ?

రుక్కు : ఉన్న దేమిటే ?

చిలక : (చిత్రాంగికేసి చూస్తూ) సంగీతమూ అవ్వీ వినిపిస్తూ వుంటాయని చెప్పలేదుటమ్మా?

రుక్కు : ఎన్ని వినపడితే యేం లాభమమ్మా?

చిలక : సరిపోయింది.

రుక్కు : కనక వూరుకో. నేను కనక సరిపోయింది కాని మరెవరేనా నీ మాటలు వింటే మతిపోయిందని నవ్విపోదురు.

చిలక : ఎందుకు నవ్వుతారూ?

రుక్కు : ఎందుకా? ఎన్నో డింగీల మధ్య ఉత్తుంగ తరంగాలమీద వొక డింగీట. ఆ డింగీలో వొక్కగా నొక్క పడుచుట.

చిత్రాంగి: వోస్! ఎంతచక్కగా తీశావూ సారస్యం?

చిలక: వోసి నీ యిల్లు బంగారంగాను. చిత్తచోరుడైన వగలాడు సరసని లేకుండా వొక పడుచుకి నదీవిహారం యేమిటే?

రుక్కు: అదే నేననేది. అమ్మాయిగా రలా చెప్పారా మరి?

చిత్రాంగి: చాలా గొప్ప ప్రశ్న. అచ్చంగా సుబుద్ధి అయ్యగారికే తగినదానవు నువ్వు

చిలక: ఇంకా సందేహమా! అయితేనూ, యేమే? వెంట ఉండతగ్గ వగలాడు దొరకందే అమ్మాయి రాజమహేంద్రపురంలో నదీవిహారం చెయ్యడం యెలా తటస్థపడుతుందే?

చిత్రాంగి: నిలవతీసి అలా అడుగు.

రుక్కు: ఎలా అడిగితే మాత్రం, నాకేమి భయమా? పైగా నిలవతీసి అడగడంవల్లనే యెవరెవరి ముచ్చట్లూ వెల్లడి అయాయి. మంచిదే కదూ?

చిత్రాంగి: మంచిదేకదా? నీ సందేహం తీరిందికదా?

రుక్కు: ఆహా!

చిత్రాంగి: మరి నీ బహుమతి నీకు వస్తుంది కదా?

రుక్కు: తప్పకుండానూ.

చిత్రాంగి: (చిలకతో) రుక్కు మనస్సు కుదుటబడింది, ఇక చెప్పవే పాపం!

చిలక: వినవే రుక్కూ!

రుక్కు: పలకవే చిలకా!

చిలక: ఆ డింగీల మధ్య వొక మదపుటేనుగు విహరిస్తోందిట. పరధ్యానంగా వున్న మావటీడు, యువరాజులుంగారి పడవ హఠాత్తుగా గుర్తించి, అదిలించగా, నడగొండ వంటి ఆ యేనుగు, తప్పుకోడంలో గభీ మని వొక డింగీమీద పడిందిట.

రుక్కు: అ—య్యో!

చిత్రాంగి: కు—య్యో!

చిలక: అది చూసి తక్కిన డింగీలు నీలాగే అయ్యో

అన్నాయిట; కాని మొ — య్యో మంటూ వెంటనే ఆ డింగీ బోల్తా కొట్టిందిట.

రుక్కు: నువ్వు కవిత్వం కడుతున్నావుట.

చిలక: నువ్వు వ్యాఖ్యానం చేస్తున్నావుట.

చిత్రాంగి: సెబాస్! సెబాస్!

చిలకా, రుక్కూ వొక్క క్షణం చిత్రాంగికేసి చూస్తారు.

చిలక: ఆపాళంగా, ఆ డింగీలోనుంచి వొక యువకుడూ, వొక యువతీ, వొక వృద్ధాంగనా — (అర్థోక్తి)

రుక్కు: (చకిత అయి) వృద్ధాంగనా?

చిలక: అవును. పళ్ళూడిపోయి—తల నెరసిపోయి — నడుము వంగిపోయి—కాటిక్కాళ్ళు చాచుకుని—

చిత్రాంగి: చెవులు దిబ్బడేసి—కళ్ల పొరలు కమ్మి—

రుక్కు: సెలగో సెలగ!

చిలక: అయితే, ఆమెకి జంటగా వొక వృద్ధ పురుషుడు లేడు సుమా!

చిత్రాంగీ రుక్కూ కిలకిల్లాడుతారు.

రుక్కు: శనిగాడు లాగ వాళ్ళకూడా ఆ ముసీలిపీసు గెందుకో?

చిత్రాంగి: తానేడ్చి వాళ్ల నేడ్పించడానికి. (చిలకతో) అవునా?

చిలక: అవును తల్లీ! సరిగా అందుకే. దేవుడు అదే కట్టికుడిపాడు చివరికి.

చిత్రాంగి: తరవాయి చెప్పు.

చిలక: వెంటనే, సారంగధరులవారూ, సుబుద్ధి అయ్యవారూ ఉన్నవారున్నట్టు గోదావరిలో వురికారుట.

రుక్కు: (ఉలిక్కిపడి) ఏమిటీ?

చిత్రాంగి: దీనికే నువ్వింత ఆశ్చర్యపడి పోతున్నావు. (చిలకతో, తల వూపుకుంటూ) ఆ వేళా?...... కడెమ్మ కొండ మీదా?......అది చెప్పవే.

చిలక: చెబుతాను తల్లీ, చెబుతాను. సారంగధరుల వారొక మాటు, వేటలో యెండపడి, క్షుధార్తులూ తృష్ణోపహతులూ అయి. కడెమ్మ కొండమీద వొక చెట్టుకిందికి చేరుకున్నారుట.

రుక్కు: ఊఁ హూఁ—

చిలక: వెంట సుబుద్ధి అయ్యవారున్నూ—(అర్ధోక్తి)

రుక్కు: చెప్పనక్కర్లేదు, ఉన్నారుట.

చిత్రాంగి: మహా బాగా అన్నావు. ఎన్నటికయినా, శనిగాడయినా విడిచిపెడతాడు; కాని—(అర్ధోక్తి)

చిలక: వార్తలనుబట్టిచూస్తే వారికీ వారికీ అభిప్రాయాలు తరుచు భేదిస్తూనే ఉంటాయిట. అయినా, యెలాంటప్పుడున్నూ వారికి పొరపొచ్చాలు రావుట. వారెన్నడూ విడిచి ఉండరుట.

చిత్రాంగి: అయ్యవారు విడిచిపెట్టరుట. అలా చెప్పు.

చిలక: ఆ మాటే. మహామంత్రి కుమారులు గదా. వారు. మహారాజు కుమారులను విడిచిఉండడం ధర్మమా? కాని—(అర్ధోక్తి)

చిత్రాంగి: కాని—అన్నావు చాలు. ఇక, కానియ్యి.

చిలక: ఇద్దరూ కూచుని ఉన్నారుట సారంగధరులవారి వేటజట్టులో చేరాలని యెన్నాళ్ళనుంచో వొక కోయదొర కనిపెట్టుకుని ఉన్నాడుట. అతగాడు సమయం దొరక్కపోతుందా అని కూడా కూడా తిరుగుతూ ఉండి, స్థితిగతు లన్నీ కనిపెట్టి, వారు కూచునీ కూచోడంతోటే కమలా ఫలాలూ, నారింజ పళ్లూ, పుట్టతేనే, సారపప్పూ—(అర్ధోక్తి)

రుక్కు: భలే కోయదొర. వాటివల్ల ఆకలీ తీరుతుంది. దాహమూ కడుతుంది. సేద తేరి—(అర్ధోక్తి)

చిత్రాంగి: పుష్టి బలమూ యేర్పడి, మళ్లీ వేటాడ్డానికి వుత్సాహోల్లాసాలు కలుగుతాయి.

చిలక: ఇంకా సందేహమా తల్లీ? అప్పుడు యువరాజులుంగారు కోయదొరని కటాక్షించి, కమలాఫలం వొలిచి వొక్క తొననోట వుంచుకునేటప్పటికి—(అర్ధోక్తి)

రుక్కు : (చకిత అయి) ఒక్క తొౌన నోట ఉంచుకునే టప్పటికి —— ఏమిటే తరవాతా ?

చిత్రాంగి : (కళ్ళు మూసుకుని పారవశ్యంతో) కళ్ళకి కట్టి నట్టు కనపడుతోంది దా దృశ్యం.

చిలక : ఒక్క తొౌన నోట ఉంచుకునేటప్పటికి, నాలుగైదేళ్ళ కోయపిల్ల వాకతె బెదురుతూ బెదురుతూ పక్కకి వచ్చి నుంచుని, పళ్లను విడిచి ప్రభువునీ, ప్రభువుని విడిచి పళ్లనీ మిడుతూ మిడుతూ చూస్తూ నుంచుందిట.

రుక్కు : నుంచుని ?

చిత్రాంగి : నుంచుందిట, అంతే.

చిలక : అది చూసి, సారంగేధరులవా రుబ్బెత్తుగా లేచి వెళ్ళి, బుజ్జగిస్తూ తీసుకువచ్చి పక్కని కూచోబెట్టుకుని, తృప్తిపడే దాకా తొౌనలూ తేనే యిచ్చి —(అర్ధోక్తి)

రుక్కు : ఏమి దయార్ద్ర హృదయులమ్మా వారు ! ఏమి ధర్మాత్ములు తల్లీ వారు ! మొగం చూస్తే పాపాలు పోతాయి మామ్మా !

చిత్రాంగి : (మొగం చిట్లించుకుంటూ) సుబుద్ధి అయ్యవారి మొగం చూస్తేనో ?

రుక్కు : వారేం చేశారే చిలకా ?

చిత్రాంగి : సత్రాల మీద యెవరో రాళ్లు వేస్తారుటా ? ఇచ్చే వాళ్ల మనస్సు విరిచేస్తారుటా ? అంతే కాదుటే ?

చిలక : అంతే తల్లీ, అంతే. (రుక్కుతో) మురిసిపోతూ కూచుని —(అర్ధోక్తి.)

చిత్రాంగి: ఉండు. (రెండు చేతులా చెవులు మూసుకుని) ఇక చెప్పు.

చిలక : మురిసిపోతూ కూచుని, ప్రభు ఇచ్చిన తేనే, తొౌనలూ ఆరగిస్తూ ఉన్న కోయపిల్లని ఛా ఛా అంటూ అదిలించి, వాక నాసి పండు మీద పడేసి, ఛో ఛో అని గదిమారుట.

రుక్కు : (చెవులు మూసుకుని) శివశివా !

చిత్రాంగి : (చెవులు మూసుకునే ఉండి) ఏం, అయిందా?

చిలక అయిం దన్నట్టు తల వూపుతుంది. చిత్రాంగి చేతులు తీసేసుకుంటుంది.

చిలక: అప్పుడు, యువరాజులుంగారు, ముంగోపంతో అయ్య వారిని వారించి, తృప్తిపడేదాకా దానికి తేనే, తొనలూ అందించి, చివరి కొక నారింజపండూ, వొక కమలాఫలమూ ఆ చిన్నిచేతుల్లో వుంచి, యెగురుతూ, దుముకుతూ అది గుడిసెకేసి వెళ్ళిపోయాక సావకాశంగా తా మారగించారుట.

రుక్కు: అప్పటి దాకా కంఠం ఆరిపోతూ ఉండినా —— (అర్ధోక్తి)

చిత్రాంగి: అలాంటప్పుడు బాధ కనపడుతుందిటే వెర్రిదానా? చిన్నారి బొజ్జమీద ఫలరసమూ తేనె చినుకులూ చిందించుకుంటూ ఆ పిల్ల అవి ఆరగిస్తూ వుంటే వారి కెంత ఆప్యాయంగా వుందో; అలాంటి దివ్యానుభూతే కలక్కపోతే మనస్ఫూర్తిగా యెవరేనా దాన ధర్మాలు చెయ్యగలరుటే?

చిలక: కాదా తల్లీ?

రుక్కు: తరవాతా?

చిలక: సుబుద్ధి అయ్యవారు——(అర్ధోక్తి)

చిత్రాంగి: (విసుగ్గా) వెంటనే ఆ పేరు చెప్పకే. కాస్సే వుండవే. (కళ్లుమూసుకుంటుంది)

ముగ్గురూ వొక్కక్షణం మౌనంగా వుంటారు.

చిత్రాంగి. (కళ్లు తెరిచి) ఇక ఆ కథ చెప్పు.

చిలక: (చిత్రాంగితో) మంచిదమ్మా! (రుక్కుతో) ఎందాకా చెప్పానే?

రుక్కు: సారంగధరులవారూ, సుబుద్ధి అయ్యవారూ ఉన్నవా రున్నట్టుగా నదిలో వురికారుట.

చిలక: ఉరికారుట, మరే. అలా వురికి, పెద్దపెద్ద బారలు వేసుకుంటూ వెళ్ళడంలో, ఆ పిల్ల సారంగధరులవారి చేతికి—— (అర్ధోక్తి)

రుక్కు : (గుండెలమీద చెయ్యి వేసుకుంటూ) అమ్మయ్యా !

చిత్రాంగి: దేవుడు లేడూ? పుణ్యపాపా లూరికే పోతాయామరి?

చిలక : ఎందుకు పోతాయి తల్లీ ?

రుక్కు : ఊరికేపోడానికి వల్లా అమ్మా ?

చిత్రాంగి : అవును గదా ? తరవాత యేం జరిగిందో విను.

రుక్కు : చెప్పకుండానే తెలుస్తోంది కాదూ? ఆ పిల్ల సారంగ ధరులవారి చేతికి దొరగ్గా, ఆ ముసలమ్మా—(అర్థోక్తి)

చిలక : కాదు కాదు, ఆ కోతీ—(అర్థోక్తి)

చిత్రాంగి : అదీ కాదు. ఆ కోతిపిల్లా—

ముగ్గురూ కిలకిలా నవ్వుతారు.

రుక్కు : ఆ కోతిపిల్ల సుబుద్ధి అయ్యవారిని పట్టుకుందిట. అంతేనా ?

చిలక : పట్టుకోడం కాదుట, వారి చేతులూ, కాళ్లూ ఆడ కుండా తూటికాడలా అల్లుకు పోయిందిట.

రుక్కు : భేష్ ! భేష్ ! చాలా బాగా జరిగింది.

చిలక : (చిత్రాంగితో) రుక్కమ్మ గురుభక్తి చిత్తగించారా అమ్మా ?

చిత్రాంగి : ఇప్పు డేం వుందీ చూడ్డానికి, దాని బహుమతీ దాని చేతబడ్డాక చూడాలి. (రుక్కుతో) అవునా ?

రుక్కు : మీరు నా బహుమతీ నాకు నిశ్చయ పరిచి నప్పుడు, నే నయ్యవారి కాళ్లూ, చేతులూ — (అర్థోక్తి)

చిలక : నువ్వు కూడా అల్లుకుపోతావా యేమిటే ?

చిత్రాంగి కిలకిల నవ్వుతుంది.

రుక్కు : అల్లుకునే పోతానో మరేమేనా చేస్తానో, అక్కడికి వెళ్ళడం జరగనిస్తూ.

చిలక : ఏం జరక్కా ?

చిత్రాంగి : అవును, ఏం జరక్కా ? చళుక్య సామ్రాజ్యంలో జక్కులదీవి మండలేశ్వరులకున్న గౌరవ మర్యాదలు మరెవరి కున్నాయీ ? వాటికి సాఫల్యం కలక్క పోవడానికి వల్లా ?

చిలక : తప్పకుండా సాఫల్యం కలుగుతుంది. కలిగితీరుతుంది. కనక, మన కులదేవత, సావిత్రీ అమ్మవారి కొక్కమాటు మొక్కు కోండమ్మా !

చిలక వుయ్యాలా ఆపుతుంది. చిత్రాంగి, దిగి, అంజలిబంధం నుదుటి కానించుకుని, శిరస్సు వంచుకుని మొక్కుతుంది. చిలక కూడా అలాగే మొక్కుతుంది.

రుక్కు : (అలాగే మొక్కుతూ) అమ్మవారా, తల్లీ, మేము రాజమహేంద్రపురం వెళ్లేలాగ అనుగ్రహించు. అక్కడ వారి చేతులూ, కాళ్లూ —(ఈమాటలు ఏకోత్తరంగా మెల్లిగా పలుకుతూ, తరవాతి మాటలు స్పష్టం కాకుండా గొణుగుతుంది)

చిత్రాంగి : (మళ్లీ వుయ్యాలాలో కూచుని) ఆ పిల్లా? .. .. వారి చేతికీ ? . . . . . . ఇక ఆ కథ చెప్పవే.

రుక్కు : అవునవును, ఆ పిల్ల వారి చేతికి దొరికిం దన్నావు. అయితే, తనని పట్టుకున్నవారు యువరాజులుంగా రని అది తెలుసుకుందా ?

చిలక : ఏం, తెలుసుకోకా ? నిక్షేపంలా తెలుసుకుంది. కనకనే, వారి సందిట నిలువునా కరిగిపోయిందిట.

రుక్కు : (ఆత్రంగా) కొంపతీసి "కంఠాశ్లేషప్రణయిని" — (అర్ధోక్తి)

చిత్రాంగి : (చిరునవ్వు నవ్వుతుంది)

చిలక : కాలేదు ; కాని, కలవకాడ లాగ జారిపోతుం దేమో అని వారే ఆమెని అదిమి పట్టుకున్నారుట. దాంతో ఆమె మరీ యిదయి పోయిందిట.

చిత్రాంగి : పూర్వజన్మంలో యేదో గొప్ప నోము నోచుకుందది. లేకపోతే, తానెక్కడ, వారి సందిట—(అర్ధోక్తి)

రుక్కు : (చిత్రాంగితో) అంటే ఆమె కులం యేమిటో ?

చిత్రాంగి : అది వేశ్య.

చిలకా రుక్కూ ముగమొగాలు చూసుకుంటారు.

చిలక : ఇంతలో మావటివాడు ఏనుగును తీసుకువచ్చాడుట.

వెంటనే వారామెని యేనుగుమీద కూచోబెట్టారుట; కాని, గడగడ లాడిపోతూ ఆమె మళ్లీ నదిలో పడిపోయేటట్టుండగా, వారు కూడా ఏనుగెక్కారుట.

రుక్కు : హాయి హాయి! యువరాజులుంగారితో కలిసి గజారోహణం. ఎంత అదృష్టవంతురాలూ ఆమె?

చిత్రాంగి : అదృష్టవంతురాలేం? పా—పం! తరవాత ఏం జరిగిందో యెరుగుదువా? (చిలకతో) చెప్పవే.

చిలక : తనకి వచ్చిన విపత్తు తల్చుకునో, యువరాజులుంగారి సాన్నిధ్యం భరించలేకో ఆమె వాణికిపోయిందిట. అది చూసి వారు "భయపడకమ్మా, చెల్లీ—"(అర్ధోక్తి.)

రుక్కు : (రెండు చేతులూ పైకెత్తి నమస్కరిస్తూ) గోవిందా—గోః—విందా.

చిత్రాంగి : (కళ్లు తిప్పుకుంటూ) లేకపోతే, ఏమనుకున్నావు మరీ? వయసు వచ్చిన ఆడపిల్లని వారు కన్నెత్తి చూడరుట. ప్రాణాపాయం వస్తుందని ఆమెని పట్టుకుని సృశించారు; గాని, తరవాత, అలా చేసినందుకు వారెంత యిదయిపోయారో పా—పం!

రుక్కు : రాజపుత్రులలో అంతటి శీలనైతిత్యం వుండడం అరుదు. సారంగధరులవారి చరిత్ర అతిలోకరమణీయంగా వుంది.

చిత్రాంగి : నిజంగా, ఆడదానికి, ఎంతటి పుణ్యం చేసుకుంటే అలాంటి పెనిమిటి దొరకనూ? అలాంటి పురుషుణ్ణి చెట్టపట్టని స్త్రీ చచ్చేం, బతికేం? ఏమే చిలకా?

చిలక : అవును తల్లీ, అవును.

రుక్కు : వారికి కాబోయే యిల్లాలు—(అర్ధోక్తి)

చిత్రాంగి : వారికోసం ప్రాణాలు ధారపోసేది కాకపోతే అదీ వొక ఆడదే అవుతుందా?

చిలక : కాదమ్మా, కాదు.

రుక్కు : సరే, తరవాత ఏం జరిగిందే చిలకా?

చిత్రాంగి : ఏం జరిగిందా? (కళ్ళు మూసుకుని పారవశ్యం నటిస్తూ) వారికి తోడబుట్టిన పడుచులు లేరుట. అధమం వొక్క చెల్లెలేనా వుంటేనా?

చిలక: తరవాత వారామెని కోటకి తీసుకువెళ్లి, మహారాణికి చూపించి పసుపూ కుంకుమా చీరా రైకా—(అర్ధోక్తి)

రుక్కు: (చేతులు జోడించుకుని) మా తండ్రే! మా నాయనే! మంచి ముహూర్తాన కొమాళ్ళ తండ్రివై—(అర్ధోక్తి)

రుక్కు యిలా అంటూండగా వొకదాసి వస్తుంది. "ఎందుకూ?" అన్నట్టందరూ ఆమెకేసి చూస్తారు.

దాసి: అమ్మా అమ్మా, బాబయ్యా చంద్రకాంతమండపంలో వున్నారు. రమ్మని ఆజ్ఞ అయింది.

చిత్రాంగి: (ఉయ్యాలా దిగి) ఏం చేస్తున్నారూ?

దాసి: (దిక్కులు చూస్తూ వూరుకుంటుంది)

చిలక: మాట్టాడ వేమె?

దాసి: ఏదో దిగాలుపడి—(అర్ధోక్తి)

చిత్రాంగి: (ఆతంగా) ఆఁ?

దాసి: రాజమహేంద్ర పురంనుంచి చక్రవర్తిగారి మంత్రి వచ్చారుట. వారేదో అప్రియవార్త—(అర్ధోక్తి)

చిత్రాంగి: (బెంబేలుపడి, చిలకతో) అదేమిటే? (వెనక వాటుగా చిలకమీద వాలుతుంది)

చిలక: (చిత్రాంగిని పొదివి పట్టుకుని) లేదమ్మా, లేదు. నిన్న గాక మొన్న చిత్రపటంకోసం పంపిన సార్వభౌములు, ఇవాళ పనిపట్టి మంత్రినే పంపారంటే, ప్రియవార్తే అయి ఉంటుంది; కాని, అప్రియ వార్త యెలా అవుతుంది? ఇది యేమో చూసి, యేమో అనుకుని, మనతో యేదో చెప్పబోయి, తికమక అయి యిలా నోరుజారి వుంటుందంతే. అమ్మా, బాబయ్యా యెందుకు దిగులుపడతారూ? మెల్లిగా వెళ్ళి అదేదో తెలుసుకుందాం అడుగువెయ్యండి తల్లీ!

దాసి ముందు బయలుదేరుతుంది, తరవాత, చిలక చిత్రాంగిని పట్టుకుని, మెల్లిగా నడిపిస్తుంది. చిత్రాంగి చీర కొంగు నేలమీద జీరాడుతూ వుండగా, అది పట్టుకుని రుక్కు వెనకాల బయలుదేరుతుంది.

# అయిదో రంగం

జక్కులదేవి నగరంలో మహారుద్రయ్య విడిది. మర్నాటి రాత్రి, భోజనానంతరం, చిత్రాంగి గురువు పేరుభట్టూ, మహారుద్రయ్యా అభిముఖులై కూచుని వుంటూరు. వారి పక్కగా, నాలుగు గజాల దూరాన చిలక.

పేరుభట్టు: ఈ వ్రతం మా ప్రభువుల వంశంలో అనుశ్రుతంగా వస్తున్నది; కాని, కొత్తది కాదు.

మహారుద్రయ్య: అనుశ్రుతంగానా? అయితే, ప్రతీ తరంలోనూ, స్త్రీలందరూ——(అర్ధోక్తి)

పేరుభట్టు: వృద్ధులను పెళ్ళిచేసుకోవలసివచ్చినప్పుడు ఆడబడుచులకుమాత్రమే మా ప్రభువంశంలో యిది ఆచరణీయం. తక్కినవారికి పనిలేదు.

మహారుద్రయ్య: తమ ప్రభువంశంలో వృద్ధపురుషులు—— (అర్ధోక్తి)

పేరుభట్టు: "వార్ధకే మునివృత్తీనా"మని కాళిదాసుగారన్నట్టు వయస్సు మళ్ళగానే మా ప్రభువంశీయులు వానప్రస్థాశ్రమం స్వీకరిస్తారు. కనక, నేటివరకూ అలాంటిది సంభవించలేదు.

మహారుద్రయ్య: పోనీ, యిటీవలి ఆడబడుచు లెవరేనా ఆచరించి ఉన్నారా?

పేరుభట్టు: ఆదిలో, మూలపురుషుల పెద్దకొమార్తగా రాచరించి, వంశానికంతకీ యిది సంప్రదాయంగా ఉండాలని శాసించారు.

మహారుద్రయ్య: అలాగా?

పేరుభట్టు: చిత్తం——పదహారు తరాలకు తరవాత, మళ్ళీ మా ప్రభువు పితామహులవారి మేనత్తగారు, ఇలాగే పద్దెనిమిది సంవ

త్సరాల వయస్సున, యాభై ఆరేళ్ల రేనాటి ప్రభువును పెళ్లిచేసుకో వలసివచ్చింది. అప్పుడు, వారున్నూ యీ వ్రతం ఆచరించి, దీని ప్రభావంవల్ల కడుపెడు పిల్లలను కనుక్కుని, ముప్పై నాలుగేళ్లు సకల వైభవాలూ అనుభవించి, భర్తగారియెడల వుండుకున్న భక్త్యను రాగాలవల్లా, ముఖ్యంగా యీ వ్రత నియమంవల్లా చివరికి సహగమనం —[అర్థోక్తి]

మహారుద్రయ్య: వద్దు, వద్దు, ఆ మాట యిప్పు డెందుకు లెండి. అయితే, దీనికి నియమాలు?

పేరుభట్టు: ప్రతీదినమూ సాయంత్రం నాలుగ్ఘళ్ళ పొద్దువేళ పూజా ప్రారంభం. జామున్నర రాత్రి దాకా పూజా, అప్పుడు క్షీరాన్నం మహానైవేద్యమూనూ.

మహారుద్రయ్య: అ—య్య.

పేరుభట్టు: మళ్ళీ అరుణోదయాత్పూర్వమే పూజ ప్రారంభం అయి వుండాలి. జామున్నర పొద్దెక్కాక అతిరసాలతో మహా నైవేద్యం. తరవాత, మరో రెండు గడియల సేపు—అంటే, వ్రత కల్పంలో మూడధ్యాయాలు పారాయణ చేసుకోవాలి.

మహారుద్రయ్య: ఆ—య్య.

పేరుభట్టు: సాయంత్రం సూర్యాస్తమయానికి పూర్వమూ, ఉదయం సూర్యోదయానంతరమూ తామరపువ్వులతోటీ, ఉభయవేళలా చీకట్లో కలవపువ్వులతోటీ పూజ.

మహారుద్రయ్య: కాలనియమం చాలా నిక్కచ్చిగా ఉందే?

పేరుభట్టు: అవును. అయితే, కుంకుమకు మాత్రం కాల నియమం లేదు. తక్కిన పుష్పాలున్నూ కుంకుమతోపాటే. ఇక వున్నదల్లా యేమిటంటే - ఉభయవేళలా సహస్రనామపూజ చెయ్యాలి. అందులో అయిదు వందలు కుంకుమ పూజా, అయిదు వందలు పుష్ప పూజానూ.

మహారుద్రయ్య: బాగుంది.

పేరుభట్టు: ఈ వ్రతం అవిచ్ఛిన్నంగా ఆరు మాసా లాచరించాలి.

మహారుద్రయ్య: ఆరు మాసాలా?

పేరుభట్టు: చిత్తం, ఆరు మాసాలు. అయితే, ఆరు మాసాలన్నది స్థూలనియమం. చిత్తగించారూ? పూజాదినాలు నూటయెనభై కావాలి.

మహారుద్రయ్య: ఏడు మాసా లని సెలవివ్వండి.

పేరుభట్టు: అన్నమాటే. ఇక పూజాదినాలలో రాత్రి నివేదిత క్షీరాన్నంమాత్రమే ఆహారం. పగలు నుష్ఠుగా భోజనం చెయ్యవచ్చు.

మహారుద్రయ్య: ఏకభుక్తం అని సెలవిద్దురూ.

పేరుభట్టు: అవును. పూజ చేసుకోడానికి వీలులేని దినాలలో రాత్రిళ్లు నిరాహారం. పగలు క్షౌర లవణ వర్జ్యం.

మహారుద్రయ్య: అ—బ్బా!

పేరుభట్టు: రాత్రీ పగలూ కూడా స్థండిలశయనమే; కాని, చాపకూడా పనికిరాదు. శీతోదకమే కాని, స్నానానికి ఉష్ణోదకమున్నా వల్లకాదు

మహారుద్రయ్య: ఇది మరీ దారుణంగా ఉంది.

పేరుభట్టు: మరి ఉద్దిష్టఫలం?

మహారుద్రయ్య: (తల పంకిస్తూ) సరే సరే.

పేరుభట్టు: కడపటి దినాన, సాయంత్రం, వధూవరు లిద్దరూ మంగళ స్నానాలు చేసుకుని, ఒకరి యెదట వొకరు ముందుగా తులాభారం తూగాలి.

మహారుద్రయ్య: ఓహో!

పేరుభట్టు: అవును ……తూగి, ఆ ద్రవ్యం వారి పురోహితులవారికి వీరూ, వీరి పురోహితులవారికి వారూ వాయనదానదక్షిణగా—(అర్థోక్తి)

మహారుద్రయ్య: మరి వాయనం?

పేరుభట్టు: పూజాదినా లెన్నో వధువు అన్ని గుమ్మడిపళ్లూ, వరు డన్ని కొబ్బరిబొండాలూనూ.

మహారుద్రయ్య: బాగుంది.

పేరుభట్టు: సూర్యాస్తమయానికి పూర్వమే వివాహం——(అర్థోక్తి)

మహారుద్రయ్య: మళ్లీనా?

పేరుభట్టు: అవును. అదే వివాహం. అప్పుడే దాంపత్య సిద్ధిన్నీ.

మహారుద్రయ్య: (ఆలోచించి ఆలోచించి తల పంకించి) సరే, తరవాయి సెలవిప్పించండి.

పేరుభట్టు: తరవాత, ఆ రాత్రే——(నానుస్తాడు)

మహారుద్రయ్య: ఆ రాత్రేనా?

పేరుభట్టు: తప్పదు...ఆవేళ, యేమాసం అయేది, యేతిథి అయేది, యేవారం అయేది, నక్షత్రమున్నూ యేదయేది ఆ రాత్రే కావాలి. ఏమంటే - అదిన్నీ వుద్యాపనాంగమే, చిత్తగించారూ?

మహారుద్రయ్య: ఆరు మాసాలూ తప్పదూ, ఆరు పక్షాలు చాలదూ?

పేరుభట్టు: పక్షాంతరాలకు వీలుంటే వారాలు చాలదా అని పిస్తుంది. ఆరు దినాలుమాత్రం తక్కువా అనిన్నీ అనిపిస్తుంది. సహజంగా వయస్సు మళ్లాక వివాహం అనేటప్పటికి వచ్చే వూహాలే యివి. కనక పనికిరాదు. ఇంతకీ. (వొత్తుసాదులు స్ఫుటంగా వుచ్చరిస్తూ, వుపదేశ ముద్రతో) "షాణ్మాసిక స్థండిల సావిత్రీ గౌరీ వ్రతం" అని పేరే కదా?

మహారుద్రయ్య: (ఆలోచించి) సరే, తరవాయి సెల విప్పించండి.

పేరుభట్టు: చిత్తం చిత్తం, ఈ ఆరు మాసాలూ——అంటే సూత్రధారణం అయేదాకా చక్రవర్తిగా రామెని తాకరాదు. సన్నిధికే రాగూడదు.

మహారుద్రయ్య: (నిర్విణ్ణుడై) ఆ!

చిలక: (ఓరకంట చూస్తూ తల పంకిస్తుంది)

పేరుభట్టు: (గంభీరంగా చూస్తూ తల పంకిస్తాడు)

మహారుద్రయ్య: సరే, మరేమిటి, సెలవిప్పించండి.

పేరుభట్టు: చిత్తం చిత్తం. మరొ—క్కటి మాత్రమే వుండిపోయింది. (ఆగి ఆగి, సాయంత్రం, పూజా ప్రయత్నాలు ప్రారంభం అయిందే మొదలు, మళ్ళీ, వుదయం పూజ ముగిసి పారణ చేసి, విశ్రమించి, లేచేదాకా, పురుష మాత్రులు—పురుష శిశువులు సమేతూ—పోతుటీగ అయినా చూడగూడదు మా అమ్మ గారిని.

మహారుద్రయ్య: (మళ్లీ నిర్విణ్ణుడై) ఆ! ఆ!

చిలక: ("మరే మనుకున్నా వయ్యోయ్?" అన్నట్లు మళ్ళీ తల పంకిస్తుంది)

మహారుద్రయ్య: (ఆలోచిస్తాడు)

పేరుభట్టు: ఉన్న నియమా లివీ. నేను మనవి చేసుకోవల సిందీ యింతే. మరి తమ కేమయినా సందేహాలు .. ?

మహారుద్రయ్య: మరి భర్తగారు ?

పేరుభట్టు: (మహారుద్రయ్య కళ్లల్లోకి గంభీరంగా చూస్తూ) పురుషులే కాదూ ?

చిలక: (ఫక్కున నవ్వబోయి నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని, మొగం పక్కకి తిప్పేసుకుంటుంది)

మహారుద్రయ్య: (నిట్టూరుస్తూ మొగం వంచుకుంటాడు)

ఒక్క క్షణం ముగ్గురూ మౌనం.

మహారుద్రయ్య: పోనీ, పగలు మాట్లాడవచ్చునా ?

పేరుభట్టు: అభ్యంతరమా ? ఎంతమాటా ? అయితే, చిత్త గించారా ? తాకకూడ దన్న నిషేధం .........? జ్ఞాపకం.......?

మహారుద్రయ్య: ఉంది వుంది.

పేరుభట్టు : కనక, గడపకి అవతల వాకరూ, యివతల వాకరూ వుండి, దాంపత్యస్మరణ అయినా లేకుండా — (తెలిసిందా అన్నట్టు తల పంకించి) సావకాశంగా, లోకంలో సంగతు లన్నీ మాట్లాడు కోవచ్చు.

మహారుద్రయ్య : పెళ్ళి చేసుకున్నందుకు—(అర్ధోక్తి)

పేరుభట్టు : "పెళ్ళి చేసుకో బోతున్నందుకు" — అని సెల విప్పించండి. ఏమంటే - ఉద్యాపన సమయంలో ప్రార్ధనాదికం అంతా ముగించి, మొక్కు—లన్నీ చెల్లించి, అపచారాలూ విన్నవించు కుని, వివాహం చేసుకోడాని కనుజ్ఞ యిమ్మని అమ్మవారిని ప్రార్ధించి, అది పొందే దాకా మా అమ్మ విషయమై పెళ్ళి అని ఉచ్చరించడం నిషేధం.

మహారుద్రయ్య : అయ్యో !

పేరుభట్టు : అయితే, సార్వభౌముల మట్టుకు సార్వభౌములు ఏమన్నా అనుకోవచ్చు, అభ్యంతరం లేదు. వివాహానికి కావలసిన ప్రయత్నా లన్నీ సాగించుకోవచ్చు. ఆ విషయమై తమ బుద్ధివిభవం అంతా చూపించవచ్చు. మా అమ్మకి మాత్రం ఆ మాట వినపడ కూడదు. ఆమే అది అనుకోరు.

మహారుద్రయ్య : చి— త్తం.

పేరుభట్టు : తరవాత నంటారూ ? చక్రవర్తుల అంతరువు— ఆ వైభవాలు మావంటివాళ్ళకి వూహాలకి కూడా అందువు. తమ రెరగ నిదా యిది ?

మహారుద్రయ్య : చిత్తం.

పేరుభటు : చిత్తగించారూ? ఇటా వైదిక కర్మ. అటా శక్తి పూజ. కత్తులమీద పరీక్ష అన్నమాట, తమకి తెలవందా ?

మహారుద్రయ్య : చిత్తం.

పేరుభట్టు : సత్యవంతులవారిని బతికించుకున్న సావిత్రీ అమ్మ వారి పూజ. ఆమె దీక్ష యెంత కఠినమో తుద కామె పొందిన ఫలితం యెంతటిదో తమకి మనవి చేసుకోవాలా ?

మహారుద్రయ్య: అక్కర్లే దక్కర్లేదు.

పేరుభట్టు: కనక, కులదేవతలు, లోకాభిరామాయణాని కేనా అవకాశం దయచేసినందుకు సంతోషించవలసిందే.

మహారుద్రయ్య: కాదూ మరీ?

పేరుభట్టు: (చిలక కేసి చూస్తాడు)

చిలక: (చేతులు జోడించుకుని మహారుద్రయ్యతో) నా మనవి—(నాన్చేస్తుంది)

మహారుద్రయ్య: (చిలకకేసీ పేరుభట్టుకేసీ చూస్తాడు)

పేరుభట్టు: దీనిపేరు చిలక. నాలుగేళ్ల వయస్సు వచ్చింది మొదలు, మా రాజపుత్రిని, అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన దాది యిది. ఆమెకి నృత్యమూ, విలువిద్యా హరిఃఓం మొదలు ఇతిశ్రీగా నేర్పిం దిదే.

మహారుద్రయ్య: చాలా గొప్పసంగతి.

పేరుభట్టు: మరి దాని విన్నపాలు చిత్తగించండి.

మహారుద్రయ్య: అవశ్యమూనూ.

చిలక: (చేతులు దోయిలించుకుని వంగి) నూ అమ్మ చళుక్య సార్వభౌముల వంశానికి ఉవ్యజ్యోతి కాబోతున్నందుకు మా కందరికీ పరమ సంతోషం.

మహారుద్రయ్య: మాకున్నూ.

చిలక: తమ రాయబారం తెలిసి మా అమ్మ వుప్పొంగిపోతున్నారు.

మహారుద్రయ్య: నేను ధన్యుణ్ణి.

చిలక: వ్రతోద్దేశమూ, వ్రతనియమాలూ, విధి నిషేధాలూ సాకల్యంగా తమరు చిత్తగించారు.

మహారుద్రయ్య: (పేరుభట్టుని చూపిస్తూ) గురుదేవులు ఇక తెలుసుకోవలసింది లేదనే సెలవిప్పించారు.

చిలక: కాబట్టి, సకలమూ సార్వభౌములతో విన్నవించి, యీ వ్యవహారం పొక్తుపరచడం తమ చేతిలో వుంది.

మహారుద్రయ్య: సార్వభౌములకు శుకానువాదంగా సకలమూ మనవి చేసుకుంటాను. నాకు చేతనయినంతాకూడా చేస్తాను, ఇక తర వాతి సంగతా? (రాజమహేంద్రపురంకేసి అంజలిబంధంతో నిర్దేశిస్తూ) సకలమూ ఆ మార్కండేయులవారి అనుగ్రహం.

చిలక: శుభవార్త మళ్లీ తమ పరిముఖంగానే వింటామని మా అమ్మ నిరీక్షించుకుంటున్నారు.

మహారుద్రయ్య: ఇంతకంటే నాకు మన్నన మరేముందీ? అలాగే అని వారికి నా సేవలు విన్నవించు.

పేరుభట్టు: చిత్తం చిత్తం. మరి మాకు సెలవు.

మహారుద్రయ్య: నాకున్నూ సెలవిప్పించండి. నేను రేపు ఉదయమే కన్యాదాతల—(అర్ధోక్తి)

పేరుభట్టు: తథాస్తు.

చిలక: ముమ్మాటికీనీ.

మహారుద్రయ్య: తమ ఉభయుల ధోరణీ! నా ప్రయత్నాలకు మంచి దోహదంగా వుంది. చాలా సంతోషం.

పేరుభట్టూ, మహారుద్రయ్యా లేచి నుంచుంటారు.

పేరుభట్టు: నమో మహద్భ్యః.

మహారుద్రయ్య: నమో గురుభ్యః.

చిలక: (మహారుద్రయ్యని వుద్దేశించి వంగి చేతులతో భూమి తాకి కళ్ళ కద్దుకుంటుంది.)

పేరుభట్టూ, చిలకా వెళ్లిపోతారు. మహారుద్రయ్యా వీధిగుమ్మందాకా సాగనంపుతాడు.

# ఆరో రంగం

రత్నాంగి నగరిలో వొక హాలు. రత్నాంగీ, మహామంత్రి చిట్టి వీరన్నా, విజయాదిత్యుడూ యెడంయెడంగా నుంచుని ఉంటారు.... రత్నాంగి పక్కన, రెండు గజాలలో గౌరి.

చిట్టివీరన్న: నేను సాహసించి అడిగితేనే ప్రభువు నాతో యీ విషయమై ప్రస్తాపిస్తున్నారు. ఈ సందర్భంలో నేను దూరంగా ఉండడమే వారి అభీష్టంగా కనపడుతోంది.

రత్నాంగి: మీరు ప్రోత్సహించరు కాదూ? ధర్మం కాదని వారి కోరికను పూర్వపక్షం చేసెయ్యడానికే చూస్తారు కాదూ?

చిట్టివీరన్న: దీనికి సాయం, మహారుద్రయ్యగారు, ఇది తమ జీవిత సాఫల్యం అన్నంత శ్రద్ధతో చూసుకుంటున్నారు.

విజయాదిత్యుడు: అయితే, యీ సందర్భంలో, అన్నగారి ముచ్చట బలీయం అంటారా, మీరు, మహారుద్రయ్యగారి ప్రోద్బలం యెక్కువ అంటారా?

చిట్టివీరన్న: రెండూనూ.

రత్నాంగి: కనకనే యింత పట్టుదల.

విజయాదిత్యుడు: (ఒక్కమాటు రత్నాంగికేసి చూసి, ఆవేశంతో, చిట్టివీరన్నతో) ఇక మనమేనా పట్టుపట్టలేము? ధర్మపక్షం మనది కదా, మన మెందుకు జంకాలీ? (చేత్తో నిషేధిస్తూ దృఢస్వరంతో) ఇది జరగడానికి వల్లకాదు.

రత్నాంగి: ఫలితం?

విజయాదిత్యుడు: (చిట్టివీరన్నకేసి చూస్తాడు)

చిట్టివీరన్న: (రత్నాంగికేసి చూస్తాడు)

రత్నాంగి: పోనీ, ఏ కారణంవల్లనేనా మహారాజు మాను కుంటా రనుకోండి. మరి అబ్బాయి ఆమెని స్వీకరిస్తాడా ?

చిట్టివీరన్న: (విజయాదిత్యుడితో) చిత్తగించారా ? నా అను నమూ అదే.

విజయాదిత్యుడు: తం(డిగా రామెకోసం ప్రయత్నిస్తూ వుండడమేనా అందుకు కారణం ?

చిట్టివీరన్న: చిత్తం, అంతే.

రత్నాంగి: అది యేమంత తక్కువదా తండ్రీ ?

విజయాదిత్యుడు: అయితే, కొడుకు కోరుకున్న ఆమెని— (అర్ధోక్తి)

రత్నాంగి: తమరు మళ్లీ మొదటికి వస్తున్నారు.

విజయాదిత్యుడు: అది నిజమే వదినా ! అయితే, నా దృఢదీక్ష యేమిటంటే - జక్కులదీవి రాజపుత్రికను అబ్బాయి వొక్కడే కాదు, అన్నయ్యగారు కూడా వదలుకోవలసిందే. ఆమె యేమయినా అయిపో నివ్వండి యిది జరిగి తీరాలి.

చిట్టివీరన్న: భట్టారకులవారి పట్టుదల కూడా యిదే.

రత్నాంగి: సరే, మనం పట్టుపట్టి అది సాధిస్తా మనే అనుకోండి. అందువల్ల, కుటుంబంలో కల్లోలాలు పుట్టవూ ?

విజయాదిత్యుడు: ఇంతకంటే అదే నయం. (చిట్టివీరన్నకేసి చూస్తాడు)

చిట్టివీరన్న: "నందో రాజా భవిష్యతి" - అడ్డుకోడమే నా అభిప్రాయమున్నూ.

రత్నాంగి: (నిరాశతో) ఏమో, యేం చేస్తారో చివరికి. ఏది యెలా జరిగినా, యిక, నా నాయన వుల్లాసంగా వుండడం తటస్థపడదు. నా బతు కెలాగా చట్టుబండలే అయిపోయింది.

చిట్టివీరన్న: అమ్మా ! తమ రంతమాట సెలవిప్పించవద్దు.

విజయాదిత్యుడు: ఎలాంటి వదినగారి కెలాంటి యాతన సంభవించిందో చూశారా ? వారికి రావలసిం దేనా యిది ?

రత్నాంగి: ఒక్క కొడుకు. అతని అభ్యుదయం చూడడానికి పెట్టిపుట్టందే తంద్రే! (కళ్ళల్లో నీళ్లు పెట్టుకుంది)

గౌరి: (తటాలున వచ్చి రత్నాంగి కళ్ల తుడుస్తూ) వద్దు తల్లీ, వద్దు.

చిట్టిపీరన్న: అమ్మా! తమరే యిలా అయితే, యిక మేమేమి చెయ్యగలమూ?

విజయాదిత్యుడు: తమ రిక లోపలికి దయచెయ్యండి వదినా! గౌరీ!

గౌరి: చిత్తం మహాప్రభూ! (చెయ్యిపట్టుకుని రత్నాంగిని గడకేసి తిప్పి) అమ్మా! (నడిపిస్తుంది)

రత్నాంగి: (నాలుగడుగులువేసి మొగం వెనక్కి తిప్పుకుని) మరిదిగారూ! చిట్టిపీరన్నగారూ! భారం అంతా——

దుఃఖం ముంచుకురాగా, రత్నాంగి మరి మాట్లాడలేక, తన కళ్లు తనే తుడుచుకుంటూ గౌరి ఆసరాతో లోపలికి వెళ్ళిపోతుంది. గుమ్మందాటి వెళ్ళిందాకా విజయాదిత్యుడూ, చిట్టిపీరన్నా ఆమెకేసి చూస్తారు.

విజయాదిత్యుడు: ఇది అన్నయ్యగారికి శ్రేయస్కరమా! ఆ మహాయిలా లలా కుమిలిపోతూ వుండగా, వారు, తమ నవోఢతో సుఖాన వుండగలరా?

చిట్టిపీరన్న: అది సరే కాని ప్రభూ! మహారాణికి నేనేమి సేవ చేసినట్టూ? యువరాజులుంగారి శ్రేయస్సు ఏమి సాధించగలిగానూ? తప్పుదారి మళ్లించలేని నేను ప్రభువుకి చేసిన సేవ మాత్రం యేమిటీ?

విజయాదిత్యుడు: (తల పంకించి) అవును, అన్నయ్యగారి మనస్సు మళ్లించగలిగితేనే మన ప్రజ్ఞ. నిజానికి, మీవల్ల ప్రయత్న లోపం లేదు; కానీ——(మెరుపుకొట్టినట్టయి) పోనీ, యిక్కడి ప్రయత్నాలిలావుండగా, మనం జక్కులదీవివారితో మంతనాలు సాగిస్తే?

చిట్టివీరన్న : (ఆలోచనలో పడతాడు)

విజయాదిత్యుడు : ఉన్నట్టుండగా అబ్బాయినే జక్కులదీవి పంపించేస్తే?

చిట్టివీరన్న : (నిరాశగా) వారిని పంపగలమా మనం?

విజయాదిత్యుడు : (మిడుతూ మిడుతూ చూస్తాడు)

చిట్టివీరన్న : జక్కులదీవివారు అన్నయ్యగారితోనే కూడితే?

విజయాదిత్యుడు : (నిరుత్సాహ పడిపోయి) సరే పదండి. భట్టారకులవారితో ఆలోచింతాం.

ఇద్దరూ బయలుదేరతారు.

చిట్టివీరన్న . భట్టారకులవా రిది చావుబతుకుల సంరంభంగా భావించుకున్నారు.

విజయాదిత్యుడు : ధర్మాన్ని పురస్కరించుకుని మాటాడుతున్నారు; కనక, వారి పట్టుదల అలా వుండడమే ఉచితంగా వుంది.

చిట్టివీరన్న: నిన్నటిదాకా చరచరా సాగిపోతూ వచ్చింది భారత రచన. ఇవాళ యెంత ప్రయత్నించినా వొక్క పద్యమేనా నడవలేదు. ఏం కనిపెట్టుకునివుందో అని నారాయణభట్టుగారు గడగడలాడి పోతున్నారు.

విజయాదిత్యుడు : ఇదేదో అటోఇటో తేలేదాకా సాగడం కష్టమే మరి.

చిట్టివీరన్న : సామ్రాజ్యం అంతటిలోనూ వొక్క భటారకులవారి యెడల మాత్రమే మహారాజులుంగారు పరమవిధేయులు. ఇదొక్కటే మన కుండుకున్న ఆశాలేశం. కనక, దయచెయ్యండి.

ఇద్దరూ వెళ్లిపోతారు.

---

# ఏడో రంగం

రత్నాంగినగరిలో సారంగధరుడి వాసగృహం. జాముపొద్దెక్కింది. విప్పివుండిన ఆంధ్ర మహాభారతం, ఆదిపర్వం వొడిలో వుంచుకుని, సారంగధరుడు పడకకుర్చీలో వాలి వున్నాడు. ఎదట మరో కుర్చీలో సుబుద్ధి కూచుని వున్నాడు.

సారంగధరుడు: ఈ విషయమై మీరందరూ యింతగా ప్రయత్నించడం యేమీ బాగాలేదు.

సుబుద్ధి: ప్రయత్నించకుండా వుండడం మాకు సాధ్యమా ప్రభూ?

సారంగధరుడు: ఎందుక్కాదూ? ఇది యెంత రసాభాస విషయమో మీకు యోచించడంలేదు. ఉన్న చిక్కల్లా యిది.

సుబుద్ధి: తమరు—(అర్ధోక్తి)

సారంగధరుడు: నా విషయమై నాకే ఆందోళన లేదే, మీకేలా?

సుబుద్ధి: ధర్మం కోసం—(అర్ధోక్తి)

సారంగధరుడు: సార్వభౌములను యెదిరించడం మీకు ధర్మమా? బాబయ్యగారితో పోటీపడడం నాకు ధర్మమా?

సుబుద్ధి: తమ విషయమై తరవాత మనవి చేసుకుంటాను. దేశంలో వున్న ప్రజ యావన్మందీ అక్రమం అని ఘోషపెడుతూ వుంటే సార్వభౌములు అది గమనించవద్దూ ప్రభూ?

సారంగధరుడు: జనుల అందరి అభిప్రాయాలూ మీరు తెలుసుకుని వచ్చారా?

సుబుద్ధి: (మిడుతూ మిడుతూ చూస్తాడు)

సారంగధరుడు: ఇక్కడి పరిస్థితులన్నీ జనుల కందరి యథాతథంగా తెలిసివున్నా యని మీరు చెప్పగలరా?

సుబుద్ధి: (చూస్తూ వూరుకుంటాడు)

సారంగధరుడు: ఇదీకాక, ధర్మం ధర్మం అని మీరు చాల నిక్కచ్చిగా మాట్లాడుతున్నారే. సార్వభౌముల పక్షంగా వున్న కారణ లేవో తెలిసే మీరు ధర్మనిర్ణయం చేశారా?

సుబుద్ధి: తమరు నీహారలేశాలు వెతికితే మేము తాళలేము: కాని, భృత్యధర్మాలు మేము అనుష్ఠించితీరాలి. మేము స్వామిద్రోహం చెయ్యలేము.

సారంగధరుడు: అయితే, మీ స్వామి యెవరండీ?

సుబుద్ధి: రాజరాజనరేంద్రులవారే.

సారంగధరుడు: వారి ప్రయత్నాలు ప్రతిఘటించడం స్వామిద్రోహం కాదో?

సుబుద్ధి: అంటే, వివరంగా మనవి చేసుకుంటాను.

సారంగధరుడు: కానివ్వండి.

సుబుద్ధి: సార్వభౌములవా రిప్పు డొక వ్యామోహంలో తగులుకుని—(అర్ధోక్తి)

సారంగధరుడు: చాలు. ఆ మాటతో మీ వుద్దేశమూ కారణమూ బోధపడ్డాయి. సార్వభౌములవారి విషయమై మీరందరూ కేవలమూ, భ్రాంతులయి, తలకు మించిన పని చేస్తున్నారు. నేనిది అంగీకరించలేను. కనక, మాటిమాటికీ నాకీ విషయం జ్ఞాపకం చేస్తూ వుండకండి. ఏకాగ్ర చిత్తంతో నేను భారతం చదువుకుంటూ వుండగా మీరు నన్ను కలత పెట్టారు. అంచేత నేనిలా మనవి చేసుకోవలసి వచ్చింది. అన్యథా భావించకండి. ఇంతకంటే మరొక పని లేకపోతే క్షమించి మీ రిప్పటికి దయచెయ్యండి. (ప్రత్యుత్తరం కోసం చూడకుండా భారతం చేత్తో పుచ్చుకుంటాడు)

సారంగధరుడు: (సుబుద్ధికేసి చూస్తాడు.)

సుబుద్ధి: (లేస్తూ) సెలవిప్పించండి.

సారంగధరుడు: సెలవు.

సుబుద్ధి: (బ్రువంచుకుని వెళ్ళిపోతాడు.)

సారంగధరుడు: (భారతం చూస్తూ) "ఇట్లు జరాక్రాంతుండైన యయాతి గొడుకుల నెల్ల రావించి నాకు విషయసుఖతృప్తి లేకున్నయది గావున, మీయం దొక్కఁడుండు నా ముదిమి గొని తన జవ్వనంబు నాకిచ్చునది యనిన విని యదు తుర్వసుద్రుహ్యానులు దండ్రి కిట్లనిరి:

ఆ. వె. తగిలి జరయు రుజయు దైవవశంబున
నయ్యెనేని వాని ననుభవింత్రు
గాక యెఱిఁగిఁయెఱిఁగి కడఁగి యారెంటిఁ జే
కొందు రయ్య యెట్టి కుమతు లైన?

క. నరలు గల కాము నైనను
దరుణులు రోయుదురు డాయ ధనపతియయ్యుం
బురుషుడు దుర్వారజరా
పరిభూతి నభీష్టభోగబాహ్యుఁడు కాఁడే!

అని యొడంబడకున్న నలిగి యయాతి యదువంశంబునవారు రాజ్యంబున కయోగ్యులుగాఁ దుర్వసువంశంబునవారు ధర్మాధర్మ వివేకశూన్యులై సంకీర్ణవర్ణకిరాతులకు రాజులుగా ద్రుహ్యువంశంబున వా రుడుపప్లవసంతార్యంబైన దేశంబునకు రాజులుగా జరాదూషకుం డగుట ననువంశంబువారు ముదియునంతకు నుండక జవ్వనంబునన పంచత్వంబున కరుగువారునుంగా శాపం బిచ్చి—"

ముదిమి ముదిరినా యయాతిమహారాజులుంగారికి విషయసుఖ తృప్తి కాలేదుట. ఎంచేతా? యౌవనప్రాదుర్భావం అయినప్పణ్ణుంచీ వారు స్త్రీలతో సుఖించినవారేనే? తరవాత సౌందర్యరాశి దేవయానీ

దేవమ్మగా రయాచితంగా లభించి వుండడంవల్ల నైనా వారి విషయ సుఖాశ తీరిపోయి వుండవలసిందే? త్రిభువన సుందరి శర్మిష్ఠాదేవమ్మ గారితో నున్నా వారు సుఖించి వుండివారే ? ఏం, యెంచేత తృప్తి కలగలేదూ ? (ఆలోచించి) ఆ, అదీ హేతువు. శర్మిష్ఠాదేవమ్మ గారితో వారు రహస్యంగా ప్రవర్తించ వలసివచ్చింది. అంచేత, అక్కడ, వారి శృంగారవిలాసాలకు చాలినంత అవకాశమూ, వినియోగమూ కూడా లేకపోయాయి. తద్వారా, విషయసుఖతృప్తి కాకుండానే వారికి జరాభారం ముంచుకు వచ్చేసింది. దీనికి సాయం వారికి నిగ్రహశక్తి చాలకపోయింది. దీంతో చేతి కందివచ్చిన కొడుకులు కూడా వారికి ఉపకరణాలకంటే నికృష్టులు అయిపోయారు.

"ఆ నలువురకుం గొండుకవానిఁ బూరుం బిలిచి యడిగిన వాఁడు తండ్రి కోరినయట్ల చేసిన నవయౌవనుడై యయాతి యభిమత సుఖంబులు సహస్ర వర్షంబు లనుభవించి తృప్తుండై పూరు జవ్వనంబు వానికి యిచ్చి తన జరాభారంబు తాన తాల్చి—"

పూరుని యౌవనబలంతో అతణ్ణి కన్న తల్లితోనే—(కళ్ళు మూసుకుని వాణికిపోతాడు)

అప్పుడు గౌరి వస్తుంది.

గౌరి: అమ్మగారి సెల నయింది బాబూ !

సారంగధరుడు: తొందరగా రావాలా ? (ఇలా అడుగుతూనే లేచి నుంచుంటాడు)

గౌరి: వడ్డన అయింది. తమకోసం కనిపెట్టుకుని వున్నారు బాబూ !

సారంగధరుడు: అయ్యో!

సారంగధరుడు గౌరి దగ్గిరిగా ముందుకి అడుగు వేస్తాడు. గౌరి అతను కప్పుకున్న శాలువ తీసివేసి కుర్చీ పీటమీద వుంచుతుంది. తరవాత, ముందు సారంగధరుడూ వెనక గౌరీ వెళ్లిపోతారు.

# ఎనిమిదో రంగం

రాజరాజు నగరు. కింద సభాశాలా, పైన రాజు నిత్యనివాసమూనూ. మజ్జన భోజనాదులు తరుచు అక్కడే జరుగుతూ వుంటాయి. సారంగధరుడి కేడెనిమిదేళ్ల వయస్సు వచ్చినప్పణ్ణుంచీ అతనీ యేర్పాటు చేసుకున్నాడు. వార్త వచ్చినప్పుడూ తనకి బుద్ధి పుట్టినప్పుడూ అతను రత్నాంగి నగరికి వెడుతూ వుంటాడు. రత్నాంగిన్ని అప్పుడప్పుడక్కడికి రావడంకూడా కద్దు.

అప్పటికి జామున్నర పొద్దుంది. అది కొలువుతీరి వుండవలసిన సమయం అయినా, అయిదారు దినాలనుంచి అతను కిందికి రావడంలేదు. రాజకార్యాలు అష్టప్రధానులద్వారా అక్కడే పరిష్కారం అయిపోతున్నాయి.

తరుచు రాజసభకి వెళ్ళే పౌరులంతా చాలా నిరుత్సాహంగా వున్నారు. దేశదేశాలనుంచీ వచ్చిన కళాకుశలులు, ఎటూ సాహసించలేక, ముళ్లమీద వున్నట్టు నగరంలో పడివున్నారు.

నృత్యగీతాది వినోదాలకు లోపం లేకపోగా రాజు పని యథాపూర్వంగానే వుంది; కాని నగరం అంతా రాజు లేనట్టు యీసురోమంటూ వుంది. కోరివస్తే, మంత్రులకూ విజయాదిత్యుడికీ సారంగధరుడికీ నన్నయభట్టుకీ రత్నాంగికీ తప్ప తక్కిన అందరికీ రాజదర్శనం అందరానిదిగా వుంది. మహారుద్రయ్య మాత్రం షష్టిగడియలూ సన్నిధినే వుంటున్నాడు. ఒక్క భోజనానికి మాత్రమే అతనింటికి వెడతాడు.

గది అంతా అగరువత్తుల పరిమళం గుబాళిస్తోంది. పాముకూసంవంటి జరీ చెంగావి పంచె కట్టుకుని. తెల్లని పట్టు

అంగీ తొడుక్కుని, రాజు, గిరజాలు చక్కగా సవరిం పించుకుని వున్నాడు. తాంబూలరక్తిమాలైన పెదవులు, తెలుపు ఎక్కువగా కలిసిన కోరమీసాలకు వింతసోయగం ఘటిస్తున్నాయి. వజ్రాల కమ్మల ధగధగలూ, కొనకాడ పచ్చ నిగనిగలూ, చెక్కులమీద ప్రతిఫలిస్తూ మెరుపు తీగలు పరుపుతున్నాయి. మోకాలిమీదికి చాపుకునివున్న కుడిచేతి రత్నాంగుళీయకం కళ్లుకుట్టేటంత మిలమిల మెరు స్తోంది. ఇలాంటివేషంతో, అతను, బాలీసుకు ఆనుకుని రత్నకంబళీమీద కూచుని వున్నాడు.ఎదటిగోడకి నిలువునా మించుటద్దం ఉంది. రాజుముందర సందుకాపెట్టె, దాని మీద, ఆంధ్రమహాభారతం సభాపర్వమూ వున్నాయి.

ఎదట, కొంచెం కుడిగా నన్నయభట్టూ, కొంచెం యెడమగా ప్రధానమంత్రి చిట్టిపేరన్నా కూచుని వున్నారు. వసారాలో నుంచి కవుజుపిట్టల కోలాహలం శ్రావ్యంగా వినవస్తోంది.

నన్నయభట్టు : యువరాజులుంగారి ప్రణయగాధ అలా వుంచు దాం. పోగా, చిత్రపటాల నిమిత్తం మనం రాయబారులను పంపే టప్పటికి గాని, అవి వచ్చాక గాని, మనం కొంతవరకూ వాటిని పరిశీలించినప్పటికి గాని తమకు వివాహ సంకల్పం లేదు.

రాజరాజు : సెలవిప్పించండి.

నన్నయభట్టు : వచ్చిన చిత్రాలన్నీ మనం యువరాజులుంగారి నిమిత్తమే వుద్దేశించాము.

రాజరాజు : సెలవిప్పించండి.

నన్నయభట్టు : అవి పంపినవారున్నూ యువరాజులుంగారి నిమిత్తమే వుద్దేశించారు.

రాజరాజు : సెలవిప్పించండి.

నన్నయభట్టు: ఆ చిత్రాలకు చెందిన రాజపుత్రికల కందరికీ అబ్బాయిగా రంభేనే యిష్టం.

రాజరాజు: అది వివాదాస్పద మైన విషయం. అయినా, తమ సెలవేమిటో కానివ్వండి.

నన్నయభట్టు: మాట అనేసి కానివ్వ మంటే కాదు. ఇందులో వివాదకు ఆస్పదం యేమిటో సెలవిప్పించండి. అబ్బాయిగా రంటే యిష్టంలేని సుందరి చిత్రం యిక్కడి కెవరు పంపగలరూ?

రాజరాజు: (నచ్చలేదన్నట్టు మూతి విరిచి తల అడ్డంగా వూపుతాడు)

నన్నయభట్టు: మనవి చేసుకుంటాను. ఒక రాజపుత్రికకు, స్వయంవరం ప్రకటించా రనుకుందాము. అది తెలిసి యెందరో రాజ పుత్రు, లెంతెంతో వ్యయప్రయాసల కోర్చి సభకు దయచేస్తారు కదా?

రాజరాజు: (కనుబొమ లెగరవేసుకుని తల పంకిస్తాడు)

నన్నయభట్టు: ఆ రాజపుత్రిక యెడల యిష్టం లేని రాచ కొమాళ్లు అక్కడికి రావడం సంభవ మేనా?

రాజరాజు: కనకి?

నన్నయభట్టు: కినక, అనురాగంవల్ల కావచ్చు. భక్తివల్ల కావచ్చు; పదవీవ్యామోహంవల్ల కావచ్చు; కాని యెటయినా, ఆ రాజ పుత్రికల కందరికీ, అబ్బాయిగారి యెడల భర్తృభావం యేర్పడి వుంది. వారందరూ అబ్బాయిగారిని అవలంబం చేసుకుని విభ్రమవిలాసాలు సాధన చేసుకుంటున్నారు.

రాజరాజు: మన అబ్బాయి తిరస్కరిస్తే ఆ రాజపుత్రికలు మరి పెళ్ళే చేసుకో రంటారా తమరు?

నన్నయభట్టు: శ్రీకృష్ణులవారు తిరస్కరిస్తే రుక్మిణీదేవమ్మ గారు మరొకర్ని వివాహం చేసుకుని వుందురో? నలసార్వభౌములు తిరస్కరిస్తే దమయంతీ దేవమ్మగారున్నూ మరివొకర్ని వరించి వుందురో?

రాజరాజు: (చూస్తూ వూరుకుంటాడు)

నన్నయభట్టు: సత్యవంతులవారిని ప్రేమించి, చివరికి సావిత్రీ దేవమ్మగా రేంచేశారో మనకి తెలవందా? సాల్వప్రభు బద్ధానురాగ లైన అంబగారి విషయం చివరికి యెలా పర్యవసించిందో మనం యెరగనిదా?

రాజరాజు: (చూస్తూ వూరుకుంటాడు)

నన్నయభట్టు: అంటే, అది శీలనైతిత్యాన్నిబట్టి వుంటుంది. అంచేత, ఏది యేమయినా, ఆ రాజపుత్రిక లందరూ, యేలినవారికి కోడలువావివారని తమ రంగీకరించక తప్పదు.

రాజరాజు: (దొరికిపోయా వన్నట్టు తల యెగరవేసుకుంటూ) అలాగే కానివ్వండి. అయితే, ఆ వావి తప్పనీ, పనికిరాదనీ, త్యాజ్యం అనీ యే గ్రంథంలో వుందీ?

చిట్టివీరన్న: (మెరుపుకొట్టి నట్టయి మొదట రాజుకేసీ, తరవాత నన్నయభట్టుకేసీ చూస్తాడు)

నన్నయభట్టు: సందేహం దృఢపడి ఆత్మప్రత్యయం కలగనప్పుడు గదా గ్రంథపరిశీలన?

రాజరాజు: అవును.

నన్నయభట్టు: అయితే, మళ్లీ వొక్కమాటు తమ హృదయం విప్పి చిత్తగించుకోండీ.

చిట్టివీరన్న: (అదీ మాట అన్నట్టు తల పంకిస్తాడు.)

రాజరాజు: (మొగం పక్కకి తిప్పుకుంటాడు)

నన్నయభట్టు: (అనునయపూర్వకంగా) మహాప్రభూ! అర్థాలు తియ్యడమే పనిగా పెట్టుకుంటే యేది యేమయినా చెయ్యవచ్చు. పదస్థులైనవారు మాట్లాడితే వూతం వుండాలి కిరీటమాంధాతల మీద, ప్రజలు, ఆనందముగ్ధులైన అలసదృష్టులు ప్రసరింపచెయ్యాలి; గాని తిరస్కారలిప్తాలైన నిశితదృక్కులు గుప్పించగూడదు.

చిట్టివీరన్న: (రాజుకేసి చూసి తల పంకిస్తూ అదీ మాట అన్నట్టు చెయ్యి వూపుతాడు)

రాజరాజు: (మొగం పక్కకి తిప్పుకునే వుంటాడు)

నన్నయభట్టు: ఇంతకీ, నేను వావి అన్నప్పుడు తమరు వావి మాత్రమే అనుకోరాదు. యువరాజులుంగారు మనసారా వాక సుందరిని వరించి, మన కాసంగతి స్పష్టపరిచేదాకా, మొత్తాని కారాజ పుత్రిక లందరూ తమకు కోడళ్ళే.

రాజరాజు: (అవ్యవధానంగా) ఔనేసీ, తరవాత ? (మంత్రికేసి సగర్వంగా చూస్తాడు)

చిట్టివీరన్న: (నన్నయభట్టుకేసి దెబ్బతిన్నట్టు చూస్తాడు.)

నన్నయభట్టు: తమరు తరవాయి అట్టే పెట్టిం దేదీ ?

రాజరాజు: ఇప్పుడు మాత్రం తమరా సూత్రం యెందు కన్వయించుకోరాదూ !

చిట్టివీరన్న: (కొంచెం విసుగు కనపరుస్తూ తల అడ్డంగా వూపుతాడు.)

నన్నయభట్టు: (చూసి చూసి కొంచెం తీవ్రంగా) ఇప్పు డది అన్వయించదు కనక.

రాజరాజు: (వెటకారంగా మందహాసం చేసి) మహాకవీ! ధర్మ శాస్త్రాలు తమకు క్షుణ్ణంగానే తెలుసు, సందేహం లేదు. అయితే, తమరు సూక్ష్మవిచారణ చెయ్యాలి; గాని తక్కిన విషయాలకు ప్రాధాన్యం యివ్వకూడదు.

నన్నయభట్టు: తమ కా సందేహం వద్దు. సూక్ష్మవిచారణ చేసే మాట్లాడుతున్నాను.

రాజరాజు: లేదు. ఎంత మాత్రమూ లేదు. తమ రిప్పుడు కవితావేశంతో వున్నారు. అంచేత భ్రాంతులై మాట్లాడుతున్నారు.

చిట్టివీరన్న: (చకితుడై) భ్రాంతా ? (రాజుకేసీ నన్నయ్యకేసీ చురుగ్గా చూస్తాడు.)

నన్నయభట్టు: (అహమికతో) మహాప్రభూ ? నాకా భ్రాంతి ?

రాజరాజు: (ఒత్తిపలుకుతూ) అక్షరాలానూ. కాకేమీ ?

నన్నయ్యభట్టు: (తల పంకించి, దృఢస్వరంతో) భ్రాంతి— తమదీ. నాది కాదు. నే నిప్పుడు కవితావేశంతో ఉన్నానంటే సత్యమే.

అయితే, అది నాకు లజ్జావహమైనది కాదు. గర్వకారణమే. కవితావేశం వుంటే మనిషి. అంతర్ముఖు డవుతాడు. కవితావేశం వచ్చినప్పుడు, మాయావృతమైన యీ చరాచరజగత్తులో, అపరిచ్ఛిన్నమైన సత్యమే గోచరిస్తుంది. కవితావేశం వచ్చినప్పుడు ద్వంద్వచింత నశిస్తుంది. ఇక, ధర్మనిర్ణయం చేసేటప్పుడే కనక కవితావేశం వస్తే— అంతకంటే కావలసిం దేమిటి? కవితావేశంవల్ల మాటలు పొంకంగా పడతాయే గాని, విషయమే తారుమారయిపోదు. ఇక భ్రాంతి కలగడం మోహావేశంతో వున్నప్పుడే మహాప్రభూ !

చిట్టివీరన్న : (నన్నయకేసీ రాజుకేసీ కంగారుగా చూస్తాడు)

రాజరాజు : (ఔదాసీన్యం కనపరుస్తూ) తమరు పెద్దలు, వేత్తలు, — మహాకవులున్నూ, కాని, యిప్పటి పరిస్థితుల్లో నా యీ ప్రవృత్తికి కారణం మోహావేశమో మరొకటో తమకు విన్నవించడం వల్ల ప్రయోజనం లేదు ; కాని అబ్బాయికి, చూడ మని, చిత్రపటాలు పంపించినప్పుడు, రామభద్రరాజు కూతురు విషయమై ఆలోచించ వలసిన పని లేదనీ, వీలే లేదనీ నేను వర్తమానించాను. తమ రిది గమనించారా ?

నన్నయభట్టు : చక్కగా గమనించాను. నేనే కాదు, అబ్బాయిగారి వివాహం కోసం యేలినవారు చేసి, చేస్తూ వున్న ప్రయత్నాలు తెలిసినవా రందరూ కూడా చక్కగా గమనించే వున్నారు. అంచేతనే నేనీవిషయం తమతో యింతదూరం మనవిచేసుకోవలసి వచ్చింది.

రాజరాజు : (ఆశ్చర్యం నటిస్తూ) అదేమిటండీ ?

నన్నయభట్టు : (దృఢస్వరంతో) జక్కులదీవి రాజపుత్రికను కేటాయించడమే శుద్ధ తప్పు, తమరిది గమనించారా ?

చిట్టివీరన్న : (ఉత్సాహం నటిస్తాడు)

రాజరాజు : (తలపంకించి చూస్తూ వూరుకుంటాడు)

నన్నయభట్టు : జక్కులదీవి రాజపుత్రిక చిత్రపటంతో పాటు, తక్కిన రాజపుత్రికల చిత్రపటాలున్నూ, తమరే వుపయోగపరుచుకో వచ్చు నని అబ్బాయిగారు తిప్పి పంపించివేశారు, తమరిది గమనించారా ?

చిట్టివీరన్న : (చకితుడై చూస్తాడు)

రాజరాజు : (మొగం పక్కకి తిప్పుకుంటాడు)

నన్నయభట్టు : నిర్హేతుకజాయమాన కటాక్షంతో, మహా రుద్రయ్యగారు నా అనుష్ఠానం కాలాతిపాతం అయిపోకుండా రక్షించి నప్పుడు, మహారుద్రయ్యగారూ — నేనూ — (వొత్తి) తమరూ కూడా—యీ జక్కులదేవి రాజపుత్రిక అబ్బాయిగారికి తగుదురా తగరా అనే చర్చించుకుంటూ వుండినాము; కాని, ఆమె తమకు తగుదురా తగరా అని కాదు, తమ రిది గమనించారా ?

రాజరాజు : (ఒక్క క్షణం నీరవుడై వుండి, తరవాత చిట్టి వీరన్నతో) ధర్మనిర్ణయాన్ని పురస్కరించుకుని ప్రారంభ మైన ప్రసంగం దారితప్పి దూరందూరంగా పోతోంది.

చిట్టివీరన్న : (తల అడ్డంగా వూపుతూ) కాదు—భట్టాగు కులవా రిప్పుడు విషయదూరులు కాలేదు, మహాప్రభూ !

రాజరాజు : (తిరస్కార భావంతో) అలాగా ?

నన్నయభట్టు : నేనిప్పుడు విషయదూరుణ్ణి కావలసిన కారణం యేమి కలిగింది మహాప్రభూ ? ఇది క్లిష్టమైన విషయం కాదే ? తమకి — అందని దిస్నీ కాదే? ధర్మం అంగీకరించడం వేరూ, ఆచరించడం వేరూ కావచ్చు; గాని—(అర్థోక్తి)

రాజరాజు : (దారిదొరికిం దన్నట్టు ధైర్యంగా) తమ రిప్పుడు కొంచెం రాజనీతిదృష్ట్యా పరిశీలించండి మహాకవీ !

చిట్టివీరన్న : (ఉలిక్కిపడి) రాజనీతి దృష్టి !

రాజరాజు : (కచ్చితంగా) అవును.

నన్నయభట్టు : (విక్కచ్చిగా) రాజనీతి కిక్కడ ప్రసక్తి యేమిటి మహాప్రభూ !

రాజరాజు : అంతానూ-ఉన్నదే అదీ.

నన్నయభట్టు : కించిత్తూ లేదు. ఇక్కడ లేనిదే అదీ.

రాజరాజు : (మిడుతూ మిడుతూ చూస్తాడు)

నన్నయభట్టు : ఏలినవారి కిది కేవలమూ సాంసారిక విషయం.

రాజరాజు: తమ రచిత సూక్ష్మవిచారణకు పూనుకుంటే, నా సంసారంలో, మళ్లీ యిది నా సొంత విషయం.

నన్నయభట్టు: సరిగా సెలవిప్పించారు తమరు, తమ సొంత విషయమే నేను మనవిచేసుకుంటున్నదిన్నీ.

రాజరాజు: (ప్రత్యుత్తరం తోచక చూస్తూ వూరుకుంటాడు)

నన్నయభట్టు: ఏలినవారి వంశకర్తలలో వొకరైన ప్రతీప మహారాజులుంగారు, కుడితొడమీద కూచున్న కారణాన, కోడలుగా భావించి, కోరివచ్చిన గంగాదేవమ్మ గారిని తిరస్కరించి వున్నారు, జ్ఞాపకం.... ....?

రాజరాజు: సెలవిప్పించండి.

నన్నయభట్టు: అక్కడ తమ్మేకోరి వచ్చిన యువతిని తిరస్కరించడం — ఇక్కడ కుమారులకోసం తామే వుద్దేశించిన యువతిని పరిగ్రహించ బూనడం—భేదం—(అర్ధోక్తి)

రాజరాజు: దాని కిక్కడ పోలికే లేదు, ఇలాంటి కుశ్శంకలు పెంచుకున్నట్టుంటే—(అర్ధోక్తి)

నన్నయభట్టు: (తల వంకిస్తూ) కుశ్శంకలు!

రాజరాజు: ముమ్మాటికీనీ, ఎందుక్కాదూ? సీతాస్వయం వరాని కెవ రెవరో రాచకొమాళ్ళు వచ్చారు. అందరూ ఆమెని కోరి—గాఢంగా కామించే వచ్చారు. ఆమెని తలుచుకుని సుఖ స్వప్నాలు కనుక్కుంటూనే వచ్చారు. తమరు ప్రతిపాదించిన ధర్మ సూత్రాన్ని పురస్కరించుకుని చూస్తే, సీతాఅమ్మవారు, ఎవరిమట్టుకి వారికే పరస్త్రీ అయిపోలేదూ?

చిట్టివీరన్న: (నిర్విణ్ణు డవుతాడు)

నన్నయభట్టు: (హృదయం దూసుకు పోయినట్టు బాధ నటించి, చివరికి చురచుర చూస్తూ, నిక్కచ్చిగా) మహాప్రభూ! యుక్తులకు స్థానాస్థానా లున్నాయి. అధికారానికిన్నీ పరిమితి వుంది. ఎటు చూసినా ధర్మానికి ప్రాతికూల్యం వహించడం శ్రేయస్కరం కాదు కన్యావరణంలో కొడుకుతో పోటీపడడం—(అర్ధోక్తి)

చిట్టివీరన్న: (నన్నయతో) నేను మనవి చేసుకుంటాను. తమరు—ఒక్క మాటు—(రాజుతో) మహాప్రభూ! తమ రిప్పుడు చాలా దూరం ఆలోచించవలసివుంది.

రాజరాజు: (చిట్టివీరన్నతో) ఎంత దూరం ఆలోచించాలో (పెటి గుద్దుతూ) అంతదూరమూ ఆలోచించే నేనీ పనికి పూను కున్నాను. కనక, యికనైనా చర్విత చర్వణం కట్టిపెడితే బాగుం టుంది.

చిట్టివీరన్న: (నన్నయచేసి చూస్తూ) చరిత్వచర్వణం—

నన్నయభట్టు: (ఉద్రేకం అణుచుకుంటూ రాజుతో)చి—త్—తం ...కట్టిపెడతాను.......మహాప్రభూ! .......కట్టిపెట్టేస్తాను. నేను చేసేది చర్వితచర్వణం అని తమరు నిక్కచ్చిగా సెలవిప్పించా టప్పుడు, ఇక చెప్పవలసిం దేమి వుంది? (తర్జనితో టొకాయిస్తూ) కానీ, కల్లోలాలు చెలరేగే సూచనలు—(అర్ధోక్తి)

రాజరాజు: కల్లోలాలు!

నన్నయభట్టు: అవును, కల్లోలాలే. ఆవేళా ......బురుజు మీదా... చిత్రపటాలు పరిశీలించినప్పుడు .... జక్కులదీవి రాజ పుత్రిక విషయమై నేను మనవిచేసిన వన్నీ—(అర్ధోక్తి)

రాజరాజు: (వికటంగా మందహాసంచేసి) అదా? ఇంకా తమ రదే మననం చేసుకుంటున్నారా? (దృఢస్వరంతో) మహాకవీ! అప్పుడే అది అప్రస్తుత—అసందర్భ ప్రశంస. మళ్లీ ఆ విషయం తవ్వి తల కెత్తుకోవడం మరీ అనుచితం.

నన్నయభట్టు: చి—త్తం.

రాజరాజు: ఈపాటికి తమరు ప్రకృతిస్థులయి వుండవలసింది.

నన్నయభట్టు: చి—త్తం.

రాజరాజు: ఏతావతా, రామభద్రరాజు తన కొమార్తను నా కిచ్చి పెళ్లిచెయ్యడానికి సర్వమూ సన్నద్ధం చేసుకుని వున్నాడు.

నన్నయభట్టు: (ఉలిక్కిపడి చిట్టివీరన్నకేసి చూస్తాడు)

చిట్టివీరన్న: ఇది కొత్తసంగతి. మహాప్రభూ! వ్యవహారం చాలా రహస్యంగా జరిగినట్టుంది.

రాజరాజు : రహస్యాని కేంవచ్చిందీ? రామభద్రరాజు స్వయం గానే—యిష్టాపూర్తిగానే యీ విషయం తెలియపరిచాడు. అతని కూతురున్నూ త్రికరణయా అంగీకరించివుంది.

చిట్టిపీరన్న : జక్కులదీని మండలేశ్వరులే కోరి వర్తమా నించినట్టా?

రాజరాజు : (మొదట గజిబిజిపడి అటూ యిటూ చూసి, తరవాత దిటవు తెచ్చుకుని) అవును. మహారుద్రయ్యగారు వెళ్లి వుండకపోతే అతని పజ్ఞప్తి యిక్కడికే వచ్చివుండేది.

చిటిపీరన్న : మహారుద్రయ్యగారు వెళ్లాకే వారి నిశ్చయానికి వచ్చివుండాలి.

రాజరాజు : (ఉండు అన్నట్టు చిట్టిపీరన్నను చేత్తో నిషేధిస్తూ నన్నయుటుతో) కనక, అవసరమయితే, తమరు మరొక ప్రస్తావన చెయ్యడం మంచిది.

చిట్టిపీరన్న : (నన్నయ్యకేసి చూసి, యిక లాభం లేదన్నట్టు నిరుత్సాహం కనపరుస్తాడు )

నన్నయభట్టు : ఈ విషయం యిలా పరిష్కారం అయింది, ఇక మరొక విషయం . ..ఏదో విషయమై మాటాడా నవిపించు కంటే చాలని నేనిక్కడికి రాలేను. ధర్మానికి గ్లాని సంభవించినప్పుడు— (అర్థోక్తి)

రాజరాజు : ధర్మాని కిప్పు డేమీ గ్లాని సంభవించలేదు. ధర్మ నిర్ణయంలో అభిప్రాయభేదం మాత్రం వచ్చింది.

నన్నయభట్టూ, చిట్టిపీరన్నా నిర్విణ్ణులై వొకరికేసి వొకరు చూసుకుంటారు.

నన్నభయట్టు : (రాజుతో) అభిప్రాయభేదమా ?

రాజరాజు : అవు, నంతే.

నన్నయట్టు : చాలా వింతగా వుంది. కోడలుగా స్వీకరించ దలచిన కన్యను భార్యగా పరిగ్రహిస్తూ "అభిప్రాయభేదం మాత్రమే" అనడం చాలా సాహసమైన మాట.

రాజరాజు : (పక్కకి చూస్తూ విసుగ్గా) కోడలు! కోడలు! ఒకటే ధోరణి. (చురుగ్గా చూస్తూ, కచ్చితంగా నన్నయతో) అయితే, నేను తమరు చెప్పినట్లల్లా విని పడివుండవలసిందేనా! ధర్మ నిర్ణయంలో నా స్వబుద్ధి వినియోగించుకోనే కూడదా?

నన్నయభట్టు : ఆ ప్రశ్న యిక్కడ సంగతంగా లేదు. ఏమంటే? ఇది తమ సొంత విషయం. పైగా, కాంతా సంబంధం కూడానూ. ఇక చెప్పడం యెందుకూ?

రాజరాజు : (ముదలకింపుగా) "చెప్పడం యెందుకూ?" అనే నేనూ అడుగుతున్నాను.

చిట్టివీరన్న : (నన్నయకేసి చూస్తూ పెదవి విరుస్తాడు.)

నన్నయభట్టు : (తల పంకించి) ఎందుకా?

రాజరాజు : అవు, నెందుకూ?

నన్నయభట్టు : (అధికారదర్పంతో) నేను కులబ్రాహ్మణ్ణి కనక.

రాజరాజు : (తల పంకించి చూసి వూరుకుంటాడు.)

నన్నయభట్టు : కులబ్రాహ్మణ పదవి వినోదం కోసం సృష్టించబడ్డది కాదు కనక.

రాజరాజు : (మళ్లీ తల పంకించి వూరుకుంటాడు.)

నన్నయభట్టు : ప్రాణికోటి అంతా ప్రభువుకి వశవర్తి అయితే, ప్రభువు కులబ్రాహ్మడి వశవర్తి అయి ఉండి తీరాలి కనక.

చిట్టివీరన్న : (ఆదుర్దాపడుతూ అంజలి బంధంతో) మహాకవీ! మహాకవీ! మహాప్రభూ! మహాప్రభూ!

రాజరాజు : (అది వినిపించుకోకుండా నన్నయతో) అగత్యం లేనిదే తమరు వ్యగ్రు లవుతున్నారు. తమ పదవి కలుషితం కానేలేదు.

నన్నయభట్టు : (దృఢస్వరంతో) అయితే, తమ రీవయస్సున మళ్ళీ వొక నవోఢను వివాహం చేసుకోడానికి సంకల్పించుకోడమూ, విశేషించి జక్కులదీవి రాజపుత్రిక చిత్రాంగీదేవమ్మగారి యెడల అనురక్తులు కావడమూ కేవలమూ ధర్మబాహ్య లని నేను నిష్కర్షగా

నిర్ణయిస్తున్నాను. తమరు దీన్ని జవదాటడానికి వల్ల కాదని ఖచ్చితంగా విధిస్తున్నాను.

చిట్టివీరన్న : (దోసిలి వొగ్గి రాజుతో ఆత్రంగా) మహా ప్రభూ ! నా మనవి—నా మనవి—(అర్ధోక్తి)

రాజరాజు : (మీ రుండండి అన్నట్టు పళ్లు బిగించి, చూడకుండానే చిట్టివీరన్నను చేత్తో నిషేధించి, నన్నయతో రోషంగా) తమ ధర్మనిర్ణయం శుద్ధ తప్పు, తమది పదవికి మించిన ఆజ్ఞ. కనక, నేను నిస్సంకోచంగా నిరాకరిస్తున్నాను.

నన్నయభట్టు : (చెయ్యి జాడిస్తూ) అదీ మాట. అదీ తేలవలసిన పర్యవసానం. ఇంత ఘనీభవించిన పోయిన తరువాత అది నిగూఢంగా యెందుకుండిపోవాలి ?

రాజరాజు : ఘనీభవిస్తే యేమిటండీ ? జగన్నియంతను నాకు రహస్యం యేమండీ ?

నన్నయభట్టు : తమరు జగన్నియంతలే. నేను కాదనడం లేదు. అయితే, ధర్మనిబద్ధం ఆయి వున్నంతసేపే ఆ నియంతృత్వానికి చెల్లుబడి. ధర్మం వున్నదా, వజ్రాయుధమైనా దాన్నేమీ చెయ్యలేదు. లేదూ, గడ్డిపరక చాలు దాన్ని కూలగొట్టడానికి. మహా మహా నహూషాదుల గతి యేమైనదో మనం యెరగనిదా ? ధర్మం తప్పి చివరదాకా యెవరు మనగలిగారూ ?

రాజరాజు : (చూస్తూ వూరుకుంటాడు.)

నన్నయభట్టు : నిజానికి, నిన్నటిదాకా, ధర్మదేవతకు చళుక్య సామ్రాజ్యమే ఆటపట్టు! కాని, యివాళ, అక్కడే ఆ ధర్మదేవతకు పాదప్రహారం జరిగింది. ఇది ఊహాతీతమైన పరిణామం. తెలిశాక కూడా ముక్కు మూసుక్కూచోడం అవివేకం. తమరు మహాభారతం తమ పేర ఆంధ్రీకరించమని ఆజ్ఞాపించినప్పుడు తాము ధర్మరక్షకులుగా ఉండడంవల్లనే అంగీకరించి నేనందుకు పూనుకున్నాను; గాని తమ ధనకనకవస్తు వాహనాదులు ఆశించి కాదు. పాండవుల ధర్మేతిహాసం వారి సంతతివారి ప్రేరేపణవల్లనే ఆంధ్రీకరించబడడం చాలా గొప్ప సంగతి అనీ, ఆ ఆంధ్రీకరణం నాకు వ్యాసమహర్షి పదవి సమకూరు

స్తుందనీ నే నుభ్యాంగిపోయాను; కాని, యివాళ, యిలాగ, వైదిక ధర్మం కాలరాసేసిన తమ పేరు మీదుగా ఆ పంచమవేదం ఇంకా ఆంధ్రీకరించడం చాలా అనుచితమైన పని. ఇంకా అది సాగి స్తే నా జన్మ కలుషితం అయిపోతుంది. కనక, ఇంతటితో నే నది కట్టి పెట్టేస్తున్నాను. ఈ విధంగా, నా పదవికి కూడా, యిప్పుడే స్వస్తి వాచనం అయిపోయింది; కనక (గభీ మని లేచి) యిదే నేను వెళ్ళి పోతున్నాను.

నన్నయ చివాలున వెళ్ళిపోతాడు. రాజూ, చిట్టి పీరన్నా మొదట, కనపడ్డంత సేపూ నన్నయకేసి చూసి, తరవాత, వొకర్నొకరు గంభీరంగా చూసుకుంటారు.

చిట్టిపీరన్న : మహాప్రభూ! అంతా విషమిస్తోంది. తమ రిప్పటికేనా దూరం ఆలోచించకపోతే యింకా చిక్కులు వస్తాయి. సెలవయితే, నేను వెళ్లి, కాళ్ళా వేళ్ళా పడి ప్రార్థించి భట్టారకుల వారిని తీసుకువస్తాను. వారిని న్యూనతపరచడం యేమీ మంచిది కాదు. భారత రచన ఆగిపోవడమే అపాయకరం. అందులోనూ అరణ్య పర్వంలో విఘాతం రావడం యెంత మాత్రమూ శ్రేయస్కరం కాదు. తమరు త్వరపడాలి. లేకపోతే—(అర్థోక్తి)

రాజరాజు : (నిర్లక్ష్యంగా) ఏమిటి లేకపోతే? (తాపీగా) ఆత్రపడకండి. అంతటితో ఆగండి. మీరేమీ భయపడనక్కరలేదు అంతా సవ్యంగా జరుగుతుంది. ఏదీ మిగిలిపోదు, దేనికీ విఘాతమూ రాదు.

చిట్టిపీరన్న : తమ కీ నమ్మకం యేమిటో, యీ ధైర్యం ఎలా కలుగుతోందో నాకేమీ బోధపడ్డం లేదు.

రాజరాజు : అంతా బోధపడుతుంది, కొంచెం వోపికపట్టండి. ఒకానొక ప్రాజ్య సామ్రాజ్యానికి ప్రధానులు, మీరే యిలా బేలపోవడం ప్రశంసాపాత్రం కాదు.

చిట్టిపీరన్న : భట్టారకులవారు—(అర్థోక్తి)

రాజరాజు : వారు సర్వసమర్థులే, ఎవరూ కాదనడం లేదు; కాని వారి కావేశం యెక్కువ. వారి దినచర్యలో అనుక్షణమూ అది

కనపడుతూనే వుంది. అది వారికి కవిత్వం వల్ల సంక్రమించిన దోషం. పరిశీలించి చూడండి. కవిత్వమూ ధార్మికత్వమూ వొకదాని కొకటి చుక్కెదురు. వాటి కెప్పుడూ పొత్తు కుదరదు. దురదృష్ట వశాన, అవి రెండూ భట్టారకుల వారిలో పరమావధి పొందాయి; కాని దురత్యయమైన వాటి వేగం వారు తాళుకోలేకపోయారు. అంచేత నే వారిప్పుడిలాగ మహోన్మాద ప్రదర్శనం చేశారు.

చిట్టివీరన్న : భట్టారకుల వారి ధర్మనిర్ణయం తప్పనడానికి వీలు లేదు మహాప్రభూ!

రాజరాజు : అది మీ కలాగే కనపడుతుంది; కాని, వారు కొద్ది దినాల్లోనే తమ తప్పు తెలుసుకుంటారు. పశ్చాత్తాపపడి, తమ విధులన్నీ యథాపూర్వకంగా నిర్వర్తించుకుంటారు. కనక, తొందర పడి, మీరు, వారి పేరి మీదుగా జరుగుతున్న యేర్పాట్లు ఏమీ తగ్గించకండి.

చిట్టివీరన్న : చిత్తం. నేను మనవి చేసుకోవలసింది మనవి చేసుకోక తప్పదు. కనక, విన్నవించుకుంటున్నాను. భట్టారకులవారు తమరు భావించినంత చలచిత్తులు కారు మహాప్రభూ!

రాజరాజు : మనకి వాద మెందుకూ, మీ రలాగే అనుకుంటూ ఉండండి. కొద్ది దినాల్లోనే యీ భట్టారకులవారు చిన్నరాణీగారి నాశీర్వ దించి నన్ను ప్రశంసిస్తారు. చూస్తూ ఉండండి.

చిట్టివీరన్న : (నిరాశగా) ఇక తమ చిత్తం. నా కిప్పటికి సెల విప్పించండి.

రాజరాజు : వెళ్ళిరండి.

చిట్టివీరన్న వెళ్ళిపోతాడు.

రాజరాజు : (వెనక్కి చూస్తూ) మహారుద్రయ్యగారూ!

మహారుద్రయ్య : ("చిత్తం చిత్తం" అంటూ వచ్చి ఎదట మండె మీద కూచుంటాడు.)

రాజరాజు : ఏమంటారు?

మహారుద్రయ్య : తిరుగుబాటు ప్రారంభం అయిందన్న మాట.

రాజరాజు : ప్రారంభమే అయితే, అణిగిపోయిం దన్నమాటే.

మహారుద్రయ్య: అవు నవును ఈ పాటయినా అల్లరి చెయ్యగలగడాని కింకెవరికి గుండె లున్నాయీ? అంతే మహాప్రభూ!

రాజరాజు: (నిర్వేదపాటుతో, పక్కకి చూస్తూ) కానీ, భట్టారకులవా రింత స్వతంత్రులు టండీ? ఇంత నిర్భీకులు టండీ?

మహారుద్రయ్య: ప్రయోజనం?

రాజరాజు: అలా అనకండీ. చూడండీ అంతఃపురములో చంద్రు డుదయించబోతున్నాడు. నిజమే. కాని, తన్మూలంగా, ముందు, రాజసభలో అస్తమించాడు, తెలుసా?

మహారుద్రయ్య: నష్టం—(అర్థోక్తి)

రాజరాజు: మనదే. అంతా యింతా కూడా కాదు. మళ్ళీ, కూడదీసుకోవాలంటే చుక్కలు దుళ్లుతాయి. అంత పాండిత్యం— అంత ప్రామాణికత్వం—అంతటి కవితాశక్తి—

మహారుద్రయ్య: (ఆత్రంగా) ఇంతాచేసి తమ కిప్పుడే పశ్చాత్తాపం—(అర్థోక్తి)

రాజరాజు: (అలవోకగా) అబ్బే! అదేమిటండీ? పశ్చాత్తాపం యేమిటండీ? ఏదేనా పని ప్రారంభించామంటే ఇతిశ్రీగా నడిపించాలి, గాని—(సాలోచనగా పక్కకి చూస్తూ) సరే. మహారాణీ, అబ్బాయీ, తమ్ముడూ, ప్రధానమంత్రిగారు—ఇంతమంది నమ్మిన బంట్లున్నారు; కనక, భట్టారకులవా రూరూ విడిచిపోయ, మళ్లీ సమీకరణమూ జరక్కపోదు,—అయితే,—(మహారుద్రయ్యతో) బెట్టు సరీ సడలించుకోడానికి మాత్రం వీలులేదు. ఏమంటారు?

మహారుద్రయ్య: అమ్మమ్మా! అలా చేస్తే యిక మనం దమ్మిడీకి మారతామూ?

రాజరాజు: మారం. (ఆలోచించి) ఈ శుభకార్యం కానివ్వండి. తరవాత, సావకాశంగా, భట్టారకులవారి విషయం చక్కబెట్టుకుందాం.

మహారుద్రయ్య: అప్పుడైతే, అభ్యంతరమూ లేదు, అది అసాధ్యమూకాదు. చిత్తగించారూ?

రాజరాజు : (పక్కకి చూస్తూ, జ్ఞాపకం చేసుకుంటూ) "నిండు మనంబు- నవ్యనవనీత- సమానము - పల్కు - దారుణాఖండల - శస్త్ర తుల్యము జగన్నుత, విప్రులయందు —" (మహారుద్రయ్యతో) అచ్చంగా, యిది, భట్టారకులవారి ప్రవృత్తి. (మళ్లీ పక్కకి చూస్తూ, సాలోచనగా) మనసులేని జక్కులదీవి రాజపుత్రికను స్వాధీనపరుచుకోగలిగిన వాళ్లం, అమాయికులైన భట్టారకులవారిని మళ్లీ, మంచి మాట చేసుకోలేక—(మహారుద్రయ్యతో) పోతామా ?

మహారుద్రయ్య : (ఆలోచన నటిస్తాడు)

రాజరాజు : (చూసి చూసి) ఏదో ఆలోచిస్తున్నారు మీరు.

మహారుద్రయ్య : చిత్తం, ఒక్క మనవి.

రాజరాజు : ఏమిటదీ?

మహారుద్రయ్య : ఇక్కడ కాదు. లోపల భవనంలో—(మాట నాన్చేస్తాడు)

రాజరాజు : జడివాన కురిసి వెలిసినట్టుంది. పదండి.

ఇద్దరూ లేస్తారు.

మహారుద్రయ్య : (ద్వారం కేసి చూస్తూ) చిట్టీ!

చిట్టి వస్తుంది.

చిట్టి : ఏమి సెలవు ?

మహారుద్రయ్య : (రాజుతో) పానీయం ?

రాజరాజు : అవశ్యమూనూ.

మహారుద్రయ్య : (చిట్టితో) వసారాలో ఉంటాము.

రాజు ముందు వెళ్ళిపోతాడు.

చిట్టి : (మహారుద్రయ్యతో) తమకున్నూ—

మహారుద్రయ్య : స్వల్పంగా.

ఇలా అని, మహారుద్రయ్య, కుడిబుగ్గమీద వేలు పెట్టుకుని ఎడమచెయ్యి చాపి పతాక సూచించి వెళ్లిపోతాడు. తల పంకించి చిట్టికూడా వెళ్ళిపోతుంది.

# తొమ్మిదో రంగం

రాజరాజు విలాసమందిరం. కోటలోవున్న భవనాలన్నిటి లోనూ అది దక్షిణపు చివర వుంది. రాజరాజు నగరి కంటేనూ, రత్నాంగి నగరికంటేనూ అది కొంచెం చిన్నది. కాని, అందులో వున్నన్ని గొప్పవస్తువులు మరెందులోనూ లేవు. చళుక్య సార్వభౌముల వైభవానికది ప్రదర్శనశాల అని చెప్పవచ్చు. రాజూ, మహారుద్రయ్యా తప్ప, మరెవరూ అందులోకి వెళ్ళడానికి వల్లకాదు. ఏ వొకరిద్దరో తప్ప, భృత్యులున్నూ అక్కడికి వెళ్ళగూడదు. రాజు పరిచారకులకు మాత్రం యేమీ అడ్డులేదు. రాజు అక్కడి కెప్పుడు వెడతాడో, యెందుకు వెడతాడో, వెళ్ళి ఎంతసే పుంటాడో, యెవరికీ తెలవదు. దాని బాధ్యత అంతా మహారుద్రయ్యది.

గడియకిందటే వచ్చి చిత్రాంగి అందులో విడిసింది. చిలకా రుక్కూకాక, అరణపుదాసీలు ఆమెవెంట మరో వందమంది వచ్చారు. యాభైమంది భృత్యులున్నూ వచ్చారు. అయితే, రాజరాజు భృత్యులు సెలవుపొంది గుమ్మందాకా మాత్రమే వెళ్ళవచ్చు. పరిచారికలు కింది అంతస్థులోకి మాత్రం వెళ్ళవచ్చు. జక్కులదీవి పరిచారకులుకూడా కిందే వుండాలి. జక్కులదీవి పరిచారికలు మాత్రం పైనీ వుండ వచ్చు. అయితే, పిలుపువస్తేగాని వెనక భాగంలోకి వెళ్ళకూడదు. అక్కడి సర్వాధికారాలు చిత్రాంగి

అనుమతికి లోబడి చిలకవి. చిలక తరవాత, రుక్కు అంతటిది. జక్కులదివి పరిచారికలు కొద్దిపాటి సారెవస్తువులు యథార్థంగా సద్దుతున్నారు. చిత్రాంగి, వెనక వసారాలో, బాలీసుకానుకని రత్నకంబళీమీద కూచుని వుంది. పక్కన కూచుని, చిలక, చిత్రాంగి ధరించివున్న నగలలో అసాధారణాలైనవి ఒక్కొక్కటే వొలిచి దంతపుబరిణలో వుంచుతోంది. చిలక కూడా నిరుత్సాహంగానే వుంది. అప్పటికి నాలుగ్గడియల పొద్దుమాత్రమే వుంది.

చిత్రాంగి: అనుభవించడం తప్పనప్పు డనుకుంటే వచ్చిన తప్పేమిటీ? అచ్చంగా, నే నిప్పు డభిసారిక నయ్యే వున్నాను.

చిలక: (మాట్లాడదు. నగలు వొలుస్తూనే వుంటుంది.)

చిత్రాంగి; అభిసారిక ప్రియుణ్ణి వెతుక్కుంటూ సంకేత స్థలానికి వెడుతుంది. నేను తిన్నగా ప్రియుడి ఇంటికే వచ్చేను. ఈ తేడా మాత్రం వుంది.

చిలక: (మాట్లాడదు. నగలు వొలుస్తూనే వుంటుంది.)

చిత్రాంగి: అయితే, యీ సాహసానికి ఫలితం? ఈ జన్మకి సాఫల్యం వుందా?

చిలక: (గడ్డం పట్టుకుని చిత్రాంగిని బతిమాలుతూ)వద్దు తల్లీ! గోడలికి చెవు లున్నాయి మామ్మా!

చిత్రాంగి: అక్కడి గోడలికి కూడా చెవు లున్నాయా మరీ?

చిలక: (మాట్లాడదు. నగలు వొలుస్తూనే వుంటుంది.)

చిత్రాంగి: సాఫల్యం మాట దేవు డెరుగును. అక్కడ కూడా యిలాంటి తపన వున్నట్టు తెలిస్తేనే గాని యీ బతుకు కడతేరడం యెలాగా?

చిలక: అది సుఖసుఖాల తేలే విషయమూ తల్లీ? వారు మహా గంభీరులని బిరుదాయె, ఈ సమయాన అది మరింత గంభీరం

అయిపోయి వుండదూ? తమలో తామయినా మథనపడడానికి వారి కవకాశం వుందో లేదో? సుబుద్ధి అయ్యవారు — (అర్ధోక్తి)

చిత్రాంగి: (చెవులు మూసుకుని) శివశివవా! ఆ పేరెత్తకే. నా ఆశ కాయో పండో తేలిపోయేదాకా ఆ భూతం నా కళ్ళబడకుండా చూడవే.

చిలక: వారు షష్టి గడియలూ సుబుద్ధి అయ్యవారిని విడిచి వుండరని వింటాం కదా, యిక్కడ నేనేంచేతునమ్మా?

చిత్రాంగి: (విరాశతోటీ నిరసనతోటీ చేతులు దులుపుకుంటూ) శని........శనిగాడు. ఆదిలోనే వక్రించాడు. వా రిప్పటికయినా గ్రహించుకోకపోతే యేమిటి దారి?

తెరలో

"చిలకా!"

చిలక: ఆ! రావచ్చు.

రుక్కు వస్తుంది.

రుక్కు: మహారాజు దయచేశారు. దర్శనం—(అర్ధోక్తి)

చిత్రాంగి: (రుక్కుతో దురుసుగా) వల్లకాదని చెప్పు. ఇంకా మించిపోలేదూ, యీపాటికి దయచెయ్యమని చెప్పెయ్యి.

చిలక: (గడ్డం పట్టుకుని చిత్రాంగిని బతిమాలుతూ) మీ రుండండి తల్లీ! (రుక్కుతో) ఏమిటే?

రుక్కు: మహారాజూ రుద్రయ్యగారూ వచ్చారు.

చిలక: వచ్చి?

రుక్కు: మహారాజు మొగం కలకల్లాడిపోతోంది.

చిత్రాంగి: ఆ మొగాన నిప్పులు పొయ్యి, వెళ్లు.

చిలక : (చిత్రాంగి గడ్డంపట్టుకుని) మా అమ్మకారూ? ఇవాళ మీకళ్ళబడనివ్వను. మిమ్మల్ని చూడనివ్వను. ఇక్కడికి రానివ్వను. సరా?

చిత్రాంగి : (మొగం పక్కకి తిప్పుకుంటుంది)

చిలక : (రుక్కుతో) ఎక్కడున్నారే?

రుక్కు : కిందే వున్నారు.

చిత్రాంగి : మెట్లమీదకూడా అడుగు పెట్టడానికి వల్లకాదని చెప్పు.

చిలక : ఏం చేస్తున్నారే?

రుక్కు : ఏమిటేమిటో ఆలోచనలు చేస్తున్నారు. ఇక్కడ సమకూర్చవలసిన సంభారాలు—(అర్ధోక్తి)

చిత్రాంగి : ఇక్కడికి కావలసిన సంభారం వొక్కటే. వెళ్లి తొరగా సంపమను. (చిలకతో) ఇంకా కూచుంటా వెందుకూ?

చిలక : ఇదిగో వెడుతున్నాను. (లేచి) పదవే.

చిలకా రుక్కూ వెళ్లిపోతారు.

చిత్రాంగి : వచ్చి గడియ కాలేదు, ముసిలా డప్పుడే సిద్ధం .. నా గతి యింతకి వచ్చేసిందా?.... ....ఆడదాని బతు కింత దిక్కుమాలి పోయిందా?.... ..ధైర్యంగా నిలిచి ఆడది యెదురుకోగలిగితే మొగాడుక్కిరిబిక్కిరి అయిపోతాడు, నేనెందుకు బేలపోవాలి? నా తండ్రి తనకి సామంతుడు; కనక, యీ రాజు నన్నిక్కడికి రప్పించగలిగాడు. మరి, తానిప్పుడు నాకు భృత్యు డయిపోయి వుండడం గుర్తించుకున్నాడా? నేను తలుచుకుంటే ముకుదాళ్లుపోసి యెలుగుబంటి నాడించినట్టు తన్నాడించగలను తెలుసా? కాని, ఛీ! అదేం బతుకూ? ముసిలాణ్ణి దద్దమ్మని చేసి యీ సామ్రాజ్యం అంతా కొనగోట నిలపాలంటే క్షణం; కాని నా జన్మ కలుషితం అయిపోదూ?.... పెట్టి

పుట్టానా, వారి కౌగిలి. లేదూ, మృత్యుక్రోశం. నాకు మూడోదారి పనికిరాదు, లేనూ లేదు. నా బతుకు బుగ్గిచేసి యీ రాజేమి బాముకో గలడో చూస్తాను. వీలుతప్పి వచ్చేటట్టయితే ఈ ముసిలాణ్ణి సమూలంగా నాశనం చెయ్యకపోతే నేను చిత్రాంగిని కాను.

చిలక వస్తుంది.

చిత్రాంగి: ఏం, బుద్ధిగా వెళ్లాడా?

చిలక: కీలెరిగి వాతపెడితే వెళ్ళక ఏంచేస్తారు తల్లీ?

చిత్రాంగి: ఏంజరిగింది, నువ్వేమన్నావు?

చిలక: వ్రతం—(అర్ధోక్తి)

చిత్రాంగి: (చిటికెవేస్తూ) సెబాస్!

చిలక: దాంతో నవనాడులూ కుంగిపోయాయి.

చిత్రాంగి: ఇక, రేపు, మిడసరిలగ్గంలో వస్తాడు, అంతే కాదూ?

చిలక: అంతే తల్లీ!

చిత్రాంగి: తలుపుచా టుండనే వుంది, అట్నుంచి నరుక్కువద్దాం....అయితే, వెళ్లిపోయాడా, కూచుని యింకా ఆలోచనలు— (అర్ధోక్తి)

చిలక: వెళ్లారు, వెళ్లారు; అయితే, వెడుతూ వెడుతూ— (అర్ధోక్తి.)

చిత్రాంగి: వెడుతూ వెడుతూ?

చిలక: ఒక్క మాట చెప్పారు.

చిత్రాంగి: ఏమనీ?

చిలక: భోజనం చేశాక, వొక్క మాటు మహారాణీ దర్శనం చేసుకు రమ్మన్నారు. అది చాలా అగత్యం ట. దానివల్ల చాలా మేళ్లున్నాయి ట.

చిత్రాంగి: (లేస్తూ) "ముసలమ్మా! నా ముద్దుల పెళ్ళాన్ని చూసుకో" అని ఆ మహా యిల్లాలిని వుడికించా లని కాబోలు ఈ నవమన్మథుల వారి వుబలాటం. అయినా, ఆ ప్రయత్నంతోనే వచ్చాం కాదూ మనమూ? కథ అంతా సవ్యంగా నడిచినా, నాకు మొదట లభించేది అత్తయ్యగారి దర్శనమే. ఇప్పుడూ అదే లభిస్తోంది. లోటేమిటీ? కనక, భోజనం చేసుకుని దర్శనానికి వస్తున్నామని అత్తయ్యగారికి వర్తమానించు.

చిలక: ముందొక్క మాటు లతామండపంలో కూచుని విశ్రమించి వద్దాము రండమ్మా!

చిత్రాంగి: పద.

ఇద్దరూ బయలుదేరతారు

చిలక: (ఒక్క అడుగు వేశాక ఆగి వెనక్కి చూస్తూ) రుక్కూ!

రుక్కు: (వచ్చి) ఆ!

చిలక: అదిగో, బరిణ జాగ్రత్తచెయ్యి. మహారాణీకి పట్టుకు వెళ్ళవలసిన కానుకలు పళ్లేలలో సర్దివుంచు. స్నానానికి సకలమూ సిద్ధంచేయించు. తామరపువ్వులు వచ్చినవి చాలవనీ, పొద్దుగుంకా టప్పటికి కలవపువ్వులుకూడా రావాలనీ గట్టిగా చెప్పిపంపు రాజుగారి మనుషులికి.

రుక్కు: వారి అరికాళ్ళకింద మంటలు పెట్టేస్తాను, చెప్పాలా?

చిత్రాంగి: (వెనక్కి చూస్తూ) ఆ మంటలు రాజుకి తగలాలి, తెలుసా?

రుక్కు: అవునమ్మా!

అందరూ వెళ్ళిపోతారు.

# పదోరంగం

రాజరాజు నగరియెదటి పూలతోట. సూర్యాస్తమయం కాబోతోంది. మహారుద్రయ్య ఒక పాలరాతి అరుగుమీద కూచునీ, ఆతని నమ్మినబంటు మల్లప్ప, యెదట నుంచునీ ఉంటారు.

మహారుద్రయ్య: కొత్తరాణీగారు విడిశాక విలాసభవనం యెలా వుందిరా మల్లప్పా?

మల్లప్ప: దేవేంద్రభవనాన్ని మించిపోయింది బాబయ్యా!

మహారుద్రయ్య: మరి కొత్తరాణీగారు?

మల్లప్ప: రంభ—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: అదేమిటిరా?

మల్లప్ప: (తప్పుతెలిసి భయపడ్డట్టు వంగి) ఏం‡ బాబయ్యా?

మహారుద్రయ్య: విడిది దేవేంద్రభవనలాం వుంటే, విడిసిన వారు శచీదేవమ్మగారిలా వుండరుట్రా?

మల్లప్ప: శచీదేవమ్మగారి లెక్కేమిటి బాబయ్యా? దేవేంద్రుల వారికే పనికివచ్చారు కారుగదా వారు?

మహారుద్రయ్య: (చకితుడై) వోరి పిడుగా! అట్టుపుట్టాణీ లన్నీ కదిలించేశావురా.

మల్లప్ప: (లెంపలు వేసుకుంటూ) అదంతా తమ అనుగ్రహం బాబయ్యా! అపరాధిని దేవరా!

మహారుద్రయ్య: అక్కర్లే దక్కర్లేదు. అయితే, కొత్తరాణీగా రెలావున్నారంటావూ?

మల్లప్ప: (క్రమాంతరువులుగా కుడిచెయ్యి పైకెగరవేసుకుంటూ) రంభ—ఊర్వశి—తిలోత్తమ—మేనక—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: ఆ, చాలు, ఆగు.

మల్లప్ప: చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: ఊళ్లోకి అలాంటివారు దయచేస్తే—(అర్థోక్తి)

మల్లప్ప: జనం విరగబడిపోతుంది బాబయ్యా!

మహారుద్రయ్య: ఎందుకోసం?

మల్లప్ప: వారిని చూడ్డానికి—వారు కనబడకపోతే చూసిన వారు చెబితే వినడానికి—తాము వెళ్లి రానివాళ్ళకి హడలెత్తించడానికి-(అర్థోక్తి)

మహారుద్రయ్య: వోహ్!

మల్లప్ప: వారికి స్వాగతం చెప్పుకోడానికి—వారిని సేవించుకోడానికి—(అర్థోక్తి)

మహారుద్రయ్య: భేషూ!

మల్లప్ప: వారితో మాట్టాడ్డానికి—వారిని సంతోషపెట్టడానికి—వారి దయ సంపాదించుకోడానికి—(అర్థోక్తి)

మహారుద్రయ్య: ఒ—హో! కవీశ్వరుడి వయిపోయావురా! తరతమ భేదా లన్నీ చూపించేశావురా!

మల్లప్ప: దాసుణ్ణి బాబయ్యా, తప్పులు క్షమించాలి దేవరా!

మహారుద్రయ్య: అది తరవాత చూసుకుందాం. చూడూ, ఎవరెవరో వస్తారు. సరే, అయితే, యెక్కడికి?

మల్లప్ప: ఆ సమీపాన వున్న ప్రాకారాలమీదికి—లేక—బురుజులమీదికి—లేక—ఆ ప్రాంతానికి—లేక—ఆ ఆవరణలోకి—లేక—ఆ గుమ్మంలోకి—లేక—ఆ భవనంలోకి—(ఆగి మహారుద్రయ్య కళ్లల్లోకి గంభీరంగా చూస్తాడు)

మహారుద్రయ్య: భలే, భలే, చివరికి క్రమాలంకారం పూర్తి చేశావు.........సరే,.........అయితే. ఆ వచ్చేవా రెవరెవరో విడమర్చి చెప్పూ. చూతాం.

మల్లప్ప: చిత్తం బాబయ్యా! ఇక్కడిదీవి మనుషులు రావచ్చు, ఇక్కడి మనుషులు రావచ్చు—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: కలిపికొడుతున్నావురా.

మల్లప్ప: లేదు బాబయ్యా, లేదు, ఇక మనవిచేసుకుంటానండి.

మహారుద్రయ్య: సరే కానియ్యి. (కళ్లుమూసుకుని చెవు లోర చేసుకుంటాడు)

మల్లప్ప: పెద్దరాణీగారి దాసీలు రావచ్చు. పెద్దరాణీగారే రావచ్చు. చిన్నరాణీగారు—(నాన్చేస్తాడు)

మహారుద్రయ్య: (కళ్లుమూసుకు నేవుండి తల ఆడించుకుంటూ) బాగుంది

మల్లప్ప: మహారాజులుంగారి దాసీలు రావచ్చు, చిన్నరాణీగారి దాసీలు రావచ్చు. మహారాజులుంగారు రావచ్చు, విజయాదిత్యుల వారు—కూడా—(నసుగుతాడు)

మహారుద్రయ్య: (కళ్లుమూసుకునే వుండి తల యెగరవేసుకుంటూ) ఊ! కానియ్యి. రావచ్చు.

మల్లప్ప: తమరు రావచ్చు—(ఆగుతాడు)

మహారుద్రయ్య: (కళ్లుమూసుకునే వుండి తల యెగరవేసుకుంటూ) ఆహా! మన కద్దేమిటీ? రావచ్చు.

మల్లప్ప: మరిగత్తే—సుబుద్ధి అయ్యావారు రావచ్చు, యువరాజులుంగారే—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: (మల్లప్పని చూస్తూ, చెయ్యి జాడించుకుంటూ మహోత్సాహంతో) అదిగదీ! అదిగదీ! అందుకున్నావ్ సమస్య.

మల్లప్ప: (చిటికెవేసి) చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: సరే, వస్తారు. వస్తే? ఏమిట్రా వస్తే?

మల్లప్ప: సెలవిప్పించండి దొరగారూ!

మహారుద్రయ్య: బాగా విను.

మల్లప్ప: వింటున్నాను దొరగారూ!

మహారుద్రయ్య: వింటున్నా నంటే చాలదు, ఎలా వినా లంటే—(అర్ధోక్తి)

మల్లప్ప: బోధపడింది బాబయ్యా! సెలవిప్పించండి.

మహారుద్రయ్య: కారణాలు నీకక్కర్లేదు, కార్యాలే ప్రధానం.

మల్లప్ప: చిత్తం దేవరా!

మహారుద్రయ్య: కనక, ఆ వచ్చినవారు - ఎవరూ? ........ ఎవరైనా సరే, ఏమి చూసినా, ఏమి చేసినా, ఏమి అన్నా—(ఆగి, తెలిసిందా అన్నట్టు ప్రశ్నార్థకంగా తల పంకిస్తాడు)

మల్లప్ప: చిత్తం చిత్తం, బోధపడుతోంది బాబయ్యా!

మహారుద్రయ్య: ఆ చూడ్డంవల్లా, ఆ చెయ్యడం వల్లా, ఆ అనడంవల్లా ఏమి జరిగినా—(మళ్లీ ప్రశ్నార్ధకంగా తల పంకిస్తాడు)

మల్లప్ప: బోధపడుతోంది బాబయ్యా!

మహారుద్రయ్య: ఏమీ జరక్క పోయినా - (మళ్లీ ప్రశ్నార్ధకంగా తల పంకిస్తాడు)

మల్లప్ప: బోధపడుతోంది బాబయ్యా!

మహారుద్రయ్య: ఇదంతా మనుష్యుల సంగతి.

మల్లప్ప: చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: ఇక, పిట్ట లెగురుతాయనుకో.

మల్లప్ప: (ఊగిసలాడుతూ, చిటికె వేస్తూ) బోధపడి పోయింది బాబయ్యా! బోధపడిపోయింది బాబయ్యా!

మహారుద్రయ్య: (గంభీరంగా చూస్తాడు)

మల్లప్ప: తమకి సందేహం అక్కర్లేదు దేవరా! అంతా తెలిసిపోయింది. ఇంతెందుకూ? చివరికి గాలి విసిరినా, వచ్చి విసరక పోయినా—(అర్థోక్తి)

మహారుద్రయ్య: ఒప్పుకున్నా. నువ్వు కనిపెట్టేశావ్.

మల్లప్ప: చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: ఇక తరవాత. ఏ నిమిషాని కా నిమిషం. నువ్వు బాగా పరకాయించాలి. పరిశీలించాలి. నలుసయినా జారిపో కుండా—(అర్ధోక్తి)

మల్లప్ప: జ్ఞాపకం వుంచుకోవాలి దేవరా?

మహారుద్రయ్య: అదీ సంగతి. విన్నావా?

మల్లప్ప: చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: నువ్వు జ్ఞాపకం వుంచుకుంటావు. సరే. అయితే, వాళ్ళని, నువ్వు—(ఆగి, ప్రశ్నార్థకంగా చూస్తాడు)

మల్లప్ప: నే నెవర్నీ — ఏం చేసినా అడ్డుపెట్టగూడదండి. వారికేసి రెండుకళ్ళా చూడనే కూడదండి. నేను గమనిస్తున్నట్టు వారికి అనుమానం అయినా కలక్కూడదండి.

మహారుద్రయ్య: అదీ సంగతి. తెలిసిందా? సరే, అలా తెలుసుకుని?

మల్లప్ప: తమతో మనవిచేసుకోవాలండి

మహారుద్రయ్య: మనవిచేసుకోవాలి. ఎప్పుడూ?

మల్లప్ప: ఎప్పటి కప్పుడే నండి.

మహారుద్రయ్య: సరే, యింకెవ రెవరితో మనవిచేసుకోవాలి?

మల్లప్ప: తమతోటే మనవిచేసుకోవాలండి. మరి ఫాలాక్షుడి కేనా తెలవనివ్వ కూడదండి.

మహారుద్రయ్య: నీకూ్కడా నువ్వు చెప్పకోగూడ దన్న మాట.

మల్లప్ప: అవును బాబయ్యా! ఆ జరిగే సంగతి - (తన హృదయంమీద తర్జని ఆన్చి) ఇక్కడ అచ్చుగుద్దుకోవడమూ, అది తమకి చూపించు కోవడమూ—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: నాకు చూపించి?

మల్లప్ప: చెరిపేసుకోడమే దొరగారూ!

మహారుద్రయ్య: ఆ, అదీ పద్ధతి. నీకు సర్వమూ తెలిసి పోయింది. అయితే, వారే మల్లప్పా!

మల్లప్ప : సెలవిప్పించండి బాబయ్యా!

మహారుద్రయ్య : సరే, భవనం బైట జరిగే సంగతులు తెలిసి పోతాయనుకో. మరి లోపల జరిగేవి ?

మల్లప్ప : కనిపెట్టేస్తాను బాబయ్యా!

మహారుద్రయ్య : ఎలాగరా ? ........ సాధ్యమా ?

మల్లప్ప : నా మాట నమ్మండి ప్రభూ!

మహారుద్రయ్య : నువ్వసాధ్యుడివే. నాకు తెలుసు. నీటిలో జాడలు తీస్తావ్ నువ్వు. అయినా, గుడ్డిగా నమ్మెయ్యడం యెలాగరా?

మల్లప్ప : (నలువైపులా చూసి) అటయితే, మరిగత్తే - (నసుగుతాడు)

మహారుద్రయ్య : సందేహించకు. చూడూ. ఇవతల నువ్వు శ్రద్ధగానే పని చేస్తావనుకో, లోపల జరిగే సంగతులు నువ్వు తప్పకుండా కనిపెట్టేస్తావే అనుకో, అయినా, నేను గాని, మరి వాకళ్ళుగాని, అందుకోసం ప్రయత్నించం గదా? ఆలాంటప్పుడు, నీకున్న ఆధారా లేమిటో తెలిస్తేగాని—అవి బలీయాలే అని నాకు నమ్మకం కలిగితే గాని, అవతల, నేను నిశ్చింతగా వుండగలనా?

మల్లప్ప : అవును బాబయ్యా, అవును. (వంగి, కొంచెం నింపాదిగా) అక్కడ వున్న రెండు పూటల్లోనూ జక్కులదీవి దాసీ పిల్ల వాకర్తి-కొంచెం - మచ్చిక అయింది స్వామీ! (ఇలా అని భయపడుతూ నోటికి చెయ్యి అడ్డు పెట్టుకుంటాడు)

మహారుద్రయ్య : (ఉత్సాహకరంగా) అలా చెప్పు. అదీ నీ ధైర్యం! బాగుంది. అయితే యేదీ? మచ్చిక అయింది, తరవాతా?

మల్లప్ప : వచ్చాటప్పుడు, దానిపాలకీతో కూడా పట్టించానండి నా గుర్రం!

మహారుద్రయ్య : నువ్వు దాని పాలకీలో కూచుంటే మాత్రం నిన్నడ్డు పెట్టగలవా డెవడూ? అదీ పద్ధతి. అయితే, తరవాతా?

మల్లప్ప : ఉరికి నా వాళ్ళో కూచోవా లన్నంత సరదాపడి పోయిందండి పిల్ల!

మహారుద్రయ్య: బా — గు బాగు.

మల్లప్ప: అది నా చేతిలో కీలుబొమ్మ అయిపోయివుంది బాబయ్యా! లోపలి సంగతులు దానిద్వారా లాగేస్తాను, నమ్మండి దేవరా!

మహారుద్రయ్య: కోటలో సాగా వేశావు. లాగెయ్యడానికి నీకు అసాధ్యం యేముందీ యిక? కాని, గత్యాగత్యా, దారితప్పి, దానియెదుట నువ్వే పిచ్చికుక్క వయిపోతా వనుకో—(అర్ధోక్తి)

మల్లప్ప: (గర్వంతో, యెదుర్రొమ్ము విరుచుకుని) ఎంత మాట సెలవిప్పించారు దొరగారూ! తమరు మల్లప్ప నెప్పుడేనా సందేహించారా బాబయ్యా? నే నెంతెంతలేపి పనులు చక్కబెట్టు కొచ్చానో - యెంతెంత వాళ్ళని బోల్తా కొట్టించానో —(అర్థోక్తి)

మహారుద్రయ్య: అదంతా నాకు చెప్పాలిట్రా? కాని, అవన్నీ వొకదారీ యిదొకదారీనీ. అంచేత—(అర్ధోక్తి)

మల్లప్ప: మాటతప్పితే, నిలబెట్టి చర్మం వొలిపించెయ్యండి ప్రభూ!

మహారుద్రయ్య: జ్ఞాపకం వుంచుకో, భద్రంగా మసులుకో.

మల్లప్ప: చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: పాతికయేళ్ళయింది నువ్వు నాదగ్గరికి వచ్చీ. అప్పణ్ణుంచి యిప్పటిదాకా నువ్వు చేసిన సేవ అంతా వొక యెత్తూ, యీ ఆరు మాసాల్లోనూ చెయ్యవలసిందీ చేసేదీ వొక యెత్తూనూ.

మల్లప్ప: చిత్తం, బోధపడింది దేవరా!

మహారుద్రయ్య: మరి పిల్లకోసం, యేమన్నా, డబ్బు—?

మల్లప్ప: దమ్మిడీ అయినా అక్కర్లేదండి. డబ్బిచ్చి— (అర్థోక్తి)

మహారుద్రయ్య: ఒకవేళ-అయితే?

మల్లప్ప: కాదంటే నమ్మండి దొరగారూ!

మహారుద్రయ్య: నీ నమ్మకాన్ని బట్టి కాకపోనూ వచ్చు. నా నమ్మకాన్ని బట్టి కానూవచ్చు కనక—(చిన్నమూట అందిస్తూ) ఇది దగ్గిర వుంచుకో.

మల్లప్ప: (అందుకుని కళ్లకద్దుకుని) చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య: అవి అయిదువందల వరహాలు.

మల్లప్ప: చాలు బాబయ్యా, చాలు.

మహారుద్రయ్య: చాలకపోతే, అడుగుతూ వుండు. సందేహించకూ.

మల్లప్ప: చిత్తం చిత్తం.

మహారుద్రయ్య: సరే, అయితే, దాని నిజస్వరూపం యేమిట్రా?

మల్లప్ప: తెలుసు దొరగారూ, తెలుసునండి.

మహారుద్రయ్య: ఏమిటి?

మల్లప్ప: ఒకవిధంగా—(గోరుమీటుతూ) సెనగపప్పండి.

మహారుద్రయ్య: మరోవిధంగా?

మల్లప్ప: (ఒత్తి) అగ్గి బాబయ్యా!

మహారుద్రయ్య: మరిచిపోకు. వొళ్లు తెలిసి మసులుకో.

మల్లప్ప: చిత్తం చిత్తం.

మహారుద్రయ్య: చూడూ, ఇప్పుడు నీ మెడమీద వున్నది యేమిటో తెలుసా?

మల్లప్ప: కొబ్బరిపుచ్చె బాబయ్యా!

మహారుద్రయ్య: ఆ, ఇక వెళ్లిపో.

మల్లప్ప మహారుద్రయ్య పాదాలంటి కళ్లకద్దుకుని చిత్రాంగి మేడకేసి వెడతాడు. మహారుద్రయ్య రాజరాజు నగరికేసి వెడతాడు.

# పదకొండో రంగం

రత్నాంగి నగరు. రమారమి అది రాత్రి భోజనాల వేళ. దక్షిణపు వసారాలో రత్నాంగీ, విజయాదిత్యుడూ బాలీసుల కానుకుని ఒకరికొక రెదురెదురుగా కూచుని వున్నారు. రాజ పురోహితుడు, రుద్రంభట్టు విజయాదిత్యుడికొక పక్కగా, ఒక బాలీసుకి ఆనుకుని ఎడంగా కూచుని వున్నాడు.

రంయిమని చల్లనిగాలి కొడుతోంది. ఆ గాలికి విజయాదిత్యుడి గిరజాలూ, కొంచెం నరసివున్న రత్నాంగి ముంగురులూ కదులుతున్నాయి. ఉండుండి, ఒక్కొక్క రివ్వు, దక్షిణాభిముఖుడైవున్న రుద్రంభట్టుకి కొంచెం ఉక్కిరి బిక్కిరి కలిగిస్తోంది. ఒక దాసి మైనగోరువంకలకూ చిలకలకూ పంజరాలలో జామిపళ్లుంచుతోంది. మరోదాసి దీపాలు ఎగసన తోస్తోంది. గౌరి, ద్వారం ఆనుకుని గుమ్మంలో నుంచుని వుంది.

విజయాదిత్యుడు: (రుద్రంభట్టుతో) తమ మాటలు చూస్తే యెటూ నిశ్చయించుకోడానికి వీలులేకుండా వుంది. పోనీ, యిది సెల విప్పించండి. బాగా జ్ఞాపకం చేసుకోండి. ఆమె, కత్తికి పూలదండ వెయ్యడం, విసిరికొట్టినట్టుందా, మురిసిపోతూ——(మాట తేల్చేస్తాడు.)

రుద్రంభట్టు: మురిసెమా ?

రత్నాంగి: తర్కంవద్దు. జరిగింది జరిగినట్టు సెలవిప్పించండి బాబయ్యా!

రుద్రంభట్టు: చిత్తం అమ్మా! జరిగిందే——యథావత్తుగా మాయ్యేవే మనవి చేసుకుంటాను. చిత్రాంగిదేవమ్మగారు, పరిచారిక

తెచ్చి అందిచ్చిన ఆ యొక్క పుష్పహారం స్వీకరించడమూ, మహా రాజులుంగారి కత్తికేసి సుతారంగా తిరగడమూ దానికి—పతిభావనతో టియ్యేవే—చిత్తగించారూ? వెయ్యడమూ, అలాగ వెయ్యడంతో డట్టే—అదీ—యేదీ? ఆ యొక్క పూలదండ, విచ్ఛిన్నం అయిపో వడమూనున్నూ—నేను విభ్రాంతుణ్ణయి—(అర్థోక్తి)

విజయాదిత్యుడు: తమ విభ్రాంతి సంగతి మన కిప్పు డక్క ర్లేదు. ఆమె సంగతి సెలవిప్పించండి. ఆమె మొగాన అనిష్టం యేమయినా కనపడిందా?

రుద్రంభట్టు: అనిష్టం—(మాట నాన్చేస్తాడు)

విజయాదిత్యుడు: తమరు నా ప్రశ్న గమనించడంలేదు. వేసిన తరవాతగాని దండ తెగిపోలేదు, అవునా?

రుద్రంభట్టు: చిత్తం చిత్తం. నాకు కనపడ్డంతవరకూ— (అర్థోక్తి)

విజయాదిత్యుడు: ఆమె కత్తికి వెయ్యడానికి వెనకటి స్థితి నేనడుగుతున్నాను. వేస్తూవుండినప్పటిదిన్నీ సెలవిప్పించండి.

రుద్రంభట్టు: అదే విన్నవించుకుంటున్నాను మహాప్రభూ! (స్మృతి అభినయిస్తూ) చూపుల్లో కొంచెం నైశిత్యం కనపడింది. లజ్జ స్ఫుటంగా లేదు. సాధ్వసమున్నూ గోచరంకాలేదు. అలా అని అది అనిష్టత అనుకుందామంటే వీలులేకుండా వుంది. పుష్పహారం అందు కున్నాక, చేతులు నిశ్చలంగా లేవు. పైగా, పుష్పహారం యెత్తడంలో, యెడమజబ్బ అడ్డురావడంవల్ల కళ్లల్లో యెలాంటి—(అర్థోక్తి)

రత్నాంగి: (విసుగు మాటుచేసుకుంటూ) సరే బాబయ్యా, యేదో అయింది, దానికేం లెండి. తమకి భోజనంవేళ అతిక్రమిస్తూ వుంది. తమర్ని శ్రమపెట్టాము.

రుద్రంభట్టు: అమ్మ, అమ్మ! ఎంతమాట సెలవిప్పించారూ? అన్నదాతలు తమరే యింకా భోజనం చెయ్యలేదు కదా? ఇందులో నాకు వచ్చిన శ్రమ యేమిటి తల్లీ?

రత్నాంగి గౌరికేసి చూస్తుంది. వెంటనే గౌరి సదక్షిణాకంగా ఫలతాంబూలాలు వున్న పళ్లెం తెచ్చి నుంచుంటుంది.

రత్నాంగి: (లేచి, ఆ పళ్లెం పుచ్చుకుని వెళ్లి రుద్రంభట్టు కందించి పాదాభివందనం చేస్తుంది.)

రుద్రంభట్టు: (లేచి, వొత్తుసాదులు స్ఫుటంగా పుచ్చరిస్తూ తాపీగా)

"యాః ఫలినీ ర్యా అఫలా అపుష్పా యా శ్చ పుష్పిణీః
బృహస్పతిః ప్రసూతా స్తా నో ముంచం త్వగ్ంం హసః"
శ్లో. ఫలం మనోరథఫలం పుత్రపౌత్ర ప్రవర్ధనం,
యస్మా త్తస్మా చ్ఛివం మే స్యా దత శ్శాంతిం ప్రయచ్ఛ మే.

ఫలదానకల్పో క్త సంపూర్ణ సకలఫలావా ప్తి రస్తు. మా అమ్మా! సెలవిప్పించండి.

రత్నాంగి: చి త్తం బాబయ్యా!

రుద్రంభట్టు: (విజయాదిత్యుడికేసి తిరుగుతాడు)

విజయాదిత్యుడు: (లేచి దోసిలివొగ్గి నమ్రుడై) నమస్కారాలు.

రుద్రంభట్టు: రాజద్వారే రాజగృహే సర్వదా దిగ్విజయోస్తు వేదో క్తం పరిపూర్ణ మాయుష్య మస్తు. (కొంచెం వూగిసలాడుతూ) చి త్తం చి త్తం, సెలవు మహాప్రభూ!

విజయాదిత్యుడు: చి త్తం సెలవు.

రుద్రంభట్టు వెనక్కి వెనక్కి తగ్గుతూ వెళ్లిపోతాడు. గౌరి పళ్ళెం పుచ్చుకుని అతని వెనకనే వెళ్ళి బండిలో అప్పగించి వచ్చేస్తుంది. విజయాదిత్యుడూ, రత్నాంగీ యథాపూర్వకంగా కూచుంటారు.

విజయాదిత్యుడు: సరిగా గుర్తించకపోవడం కొంత- భయం కొంత- వీటికి సాయం సహజమైన ఛాందసం-ఇన్ని కారణాలవల్ల రుద్రంభట్టుగారు జరిగింది జరిగినట్లు చెప్పలేకపోయారు.

రత్నాంగి: ఏది యేమయినా కావలసిన సంగతి తేలేపోయింది. సిగ్గువల్ల ఆమె చూసీచూడనట్టు వేసినా, యిష్టంలేక- విథిలేక విసిరి కొట్టినా ఫలితం వొక్కటే. పూలదండ తెగిపోవడం శుభసూచన కాదు.

విజయాదిత్యుడు: అదీ సంగతి. పూలదండ విచ్ఛిన్నం అయి పోవడం-చిత్తగించారా వదినా! తాను తెంపివేసే ఆమె కత్తికి దండ వేసిందా అని కూడా నా కనుమానం వుంది. ఏతావతా: ఆదిలోనే యీ వ్యవహారం అశుభంగా ప్రారంభం అయింది. ఇక సవ్యంగా యెలా సాగుతుందీ? ఇకనైనా అశుభాలు జరక్కుండా కాలంగడిస్తే అదే పదివేలు.

గౌరి: అమ్మా!

రత్నాంగి: ఆ!

గౌరి: జక్కులదీవి పరిచారికలు వచ్చి, దర్శనంకోరి వేచి వున్నారమ్మా!

రత్నాంగీ విజయాదిత్యుడూ గభీరంగా చూసుకుంటారు.

రత్నాంగి: తీసుకురా.

గౌరి: మంచిదమ్మా!

రుక్కునీ, మరొకతెనూ తీసుకువచ్చి, గౌరి, రత్నాంగి యెదట "యిక్కడ నుంచుని మాట్లాడండి" అన్నట్టు స్థలనిర్దేశం చేస్తుంది. వాళ్ళిద్దరూ పసుపుకుంకమలూ, నూతనవస్త్రాలూ, రత్నాభరణాలూ, ఫలాలూ వున్న పళ్ళేలు రత్నాంగి యెదట సమీపంగా వుంచి, ముందు రత్నాంగికీ, తరవాత విజయాదిత్యుడికీ పాదాభివందనం చేస్తారు. చేతులు కట్టుకునిన్నీ నుంచుంటారు.

రత్నాంగి: మీ రాణీగారు క్షేమంగా వేంచేశారా?

రుక్కు: చిత్తం మహారాణీ! మాతల్లి చిత్రాంగి దేవమ్మ గారు క్షేమంగా చేరినట్టు తమకు విన్నపాలు చేసుకుంటున్నారు. స్వల్పమైన యీ కానుకలు స్వీకరించ వలసిందని వేడుకుంటున్నారు. మరిన్నీ, భోజనానంతరం దర్శనం చేసుకుంటున్నామని మనవి చేసుకుంటూ అనుజ్ఞ కోరుకుంటున్నారు.

రత్నాంగి: మంచిది. (పళ్లే లొక్కమాటు తాకి) చాలా సంతోషం. కనిపెట్టుకుని వుంటా మని విన్నవించు.

రుక్కు: చిత్తం మంచిదమ్మా!

రత్నాంగి: గౌరీ!

గౌరి: మంచిదమ్మా!

గౌరి తాంబూలా లిస్తుంది. అందుకుని, వాళ్ళు మళ్ళీ పాదాభివందనం చేసి సెలవు అని విన్నవించి వెళ్ళిపోతారు.

రత్నాంగి: (విజయాదిత్యుడితో) ఏమి కావలసిన పిల్ల యేమయిందో, యెలా తెచ్చుకోవలసిన పిల్ల యెలా వచ్చిందో ఏత్తగించారా? ఇది యిలా జరుగుతుం దని యెవరేనా అనుకున్నారా మరిదిగారూ?

విజయాదిత్యుడు: వదినా, గతం మరిచిపొండి, ఇక భవిష్యత్తు విషయమై ఆలోచించండి

రత్నాంగి: వొకచే భవిష్యత్తు, మనస్సు మనస్సులో లేదండీ!

విజయాదిత్యుడు: పరిపరి విధాల ఆలోచనలు సాగుతున్నాయి; కాని వొక్కటీ నిలవడం లేదండీ వదినా!

గౌరి: అమ్మా!

రత్నాంగి: ఆ!

గౌరి: (ముందుకి వచ్చి) తమకి ఆకలి లేదుట, కనక, తమర్ని భోజనం చెయ్యవలసిం దని వర్తమానించారు అబ్బాయి.

రత్నాంగి: (విజయాదిత్యుడితో) విన్నారా?

విజయాదిత్యుడు: అదేమీ? (గౌరితో) అత నిప్పు డెక్కడున్నాడూ?

గౌరి: కింద, వుత్తరపు వసారాలో వున్నారుట బాబయ్యా!

విజయాదిత్యుడు: ఎవరెవ రున్నారూ?

గౌరి: ఒక్కరే వున్నారు, సుబుద్ధి అయ్యవా రిప్పుడే వెళ్ళిపోయారుట.

రత్నాంగి. బుల్లి బాబయ్య పిలుస్తున్నా రని చెప్పి పంపు.

గౌరి: చిత్తం అమ్మా!

గౌరి గుమ్మందాకా వెళ్ళి, యీ సంగతి చెప్పి, అక్కడవున్న పరిచారికను పంపేసి ద్వారంలో నుంచుంటుంది.

రత్నాంగి: నాయనకి యిక నిద్రాహారా లుండ వన్నమాట.

విజయాదిత్యుడు: (నిట్టూర్పు విడిచి మొగం వంచుకుంటాడు)

రత్నాంగి: ఆ జంజాటంలో పడిపోతే యిదంతా మరిచిపో వచ్చు ననుకుంటే, మరోపిల్ల అంటేనే కాదు, పెళ్ళి అనే మాటే వినిపించుకోడం లేదు నాయన.

గౌరి: బుల్లిబాబయ్య యిక్కడున్నారు బాబూ!

రత్నాంగి: (గ్రీవాభంగంగా వెనక్కి చూస్తూ) నాయనా!

"వచ్చానమ్మా" అంటూ సారంగధరుడు వస్తాడు.

రత్నాంగి: బుల్లిబాబయ్య సెలవయిందోయ్!

విజయాదిత్యుడు: ఇలా రావోయ్!

సారంగధరుడు: (చేతులు కట్టుకుని విజయాదిత్యుడి దగ్గరగా నుంచుని) ఏమి సెలవు బుల్లిబాబయ్యా?

విజయాదిత్యుడు: (కూచోమని తనకి దగ్గిరగా నిర్దేశిస్తూ) భోజనం మానుకోడం యేమిటోయ్? దానివల్ల యేమిటీ ప్రయోజనం?

సారంగధరుడు: (మండెమీద కూచుని) మధ్యాహ్నం భోజనం ఉదాత్తం అయిందండీ!

విజయాదిత్యుడు: (రత్నాంగికేసి చూస్తాడు)

రత్నాంగి: మధ్యాహ్నం కంచందగ్గర కూచున్నాడు, లేచాడు. అంతే. నాలుగు మెతుకులయినా పుచ్చుకోలేకపోయాడు.

విజయాదిత్యుడు: అవునా? ........ అబ్బే! నువ్వు బంతిలో లేకపోతే అమ్మ భోజనం చేస్తారా?

సారంగధరుడు: (రత్నాంగికేసి ఆత్రంగా చూస్తాడు)

రత్నాంగి: పోనీ, బుల్లిబాబయ్య నీపూట కిక్కడ వుండమన మంటావా నాయనా?

సారంగధరుడు: ఉండమనండీ అమ్మా! (విజయాదిత్యుడిడితో) ఉండండి బుల్లిబాబయ్యా!

విజయాదిత్యుడు: (రత్నాంగికేసి చూస్తాడు)

రత్నాంగి: దయచెయ్యండి. తప్పదు. తమరు లేకపోతే నాయన యీ పూట భోజనశాలకే రాడు.

విజయాదిత్యుడు: (సారంగధరుడికేసి చూస్తూ) సరే మరీ!

రత్నాంగి: గౌరీ!

గౌరీ: అమ్మా!

రత్నాంగి: ఈ పూట భోజనా లిక్కడే అని చెప్పి, చెల్లెమ్మ గారినీ పిల్లల్నీ తీసుకురా.

సారంగధరుడు: (ఉత్సాహం కనపరుస్తాడు)

గౌరి: మంచిదమ్మా!

విజయాదిత్యుడు: వారెందుకు వదినా?

సారంగధరుడు: రానివ్వండి బుల్లిబాయ్యా! ఏక బంతయి పది దినాలు కావస్తోం దండీ! (రత్నాంగితో) నేను వెళ్లి పిలుచుకు వస్తానండీ అమ్మా!

రత్నాంగి: అంతకంటేనా తండ్రీ?

విజయాదిత్యుడు: అందరమూ కలిసే వస్తాం వదినా!

రత్నాంగి: అలాగే చెయ్యండి. (గౌరితో) సంగతి రామ సోదెమ్మ గారితో చెప్పి, నువ్వు కూడా వెళ్ళు. చూడూ, చంద్ర శేఖరం బాబుని నడిపించావు సుమా!

గౌరి: (చిరునవ్వుతో) నడవ నుంటే మాత్రం నడుస్తారా బాబయ్య?

విజయాదిత్యుడు: గుర్రం కావా లనకుండా వస్తే నడిచినంత ఫలం.

సారంగధరుడు: ఆ గుర్ర మయినా అదీ యిదీ పనికివస్తుందా, చింత పువ్వన్నె గుర్రమే కావాలి గదా?

రత్నాంగి: బాగా చెప్పావు. చిట్టితండ్రిని నిన్న పొద్దుట అనగా చూశాను. కళ్లు కాయలు కాసిపోయాయి; కాని నిద్రపోతు న్నాడో ఏమో?

విజయాదిత్యుడు: అప్పుడే నిద్రా? చిన్నమ్మకీ అతనికీ దశావ తారీ ఆటసమయం మడత పేచీలుపెట్టి కెక్కు కెక్కు మనిపిస్తూ వుంటా డిప్పుడామెని. ఒక్కొక్కప్పుడు తల్లికూడా విసిగిపోతూ వుంటుందతనితోటి.

రత్నాంగి: నిజంగా, అలాంటి పిల్లల్ని సద్దగలిగితేనే చాతుర్యం. చెల్లెమ్మగారి అదృష్టం చాలా గొప్పది.

విజయాదిత్యుడు: తమ అక్కాచెల్లెళ్ల చాతుర్యం అలాంటిదే వదినా?

రత్నాంగి: మరి తమ అన్నతమ్ముళ్ల గడసరి తనమో?

విజయాదిత్యుడు: (చిరునవ్వుతో) చిత్తం చిత్తం - తమకి పొద్దు పోతుంది, యిప్పుడే వస్తాం.

కిలకిలనవ్వుతూ అందరూ లేస్తారు.

# పన్నెండో రంగం

రాజరాజునగరు. జాముపొద్దు వేళ. రాజరాజొక గదిలో కూచుని వున్నాడు. ఎదట మహామంత్రి.

చిట్టివీరన్న: సంస్థానవైద్య్య లంతా తలోమాటా చెబుతున్నారు. ఒకరిమాట వొకరికి నచ్చడం లేదు.

రాజరాజు: అయ్యో, అయితే, యెలాగా? అది తప్పుచికిత్సకు కారణం కావచ్చునే?

చిట్టివీరన్న: అందుకే నేను భయపడుతున్నాను. ఎంత ప్రయత్నించినా వారికి సమీకరణం సాధ్యం కాకుండా వుంది.

రాజరాజు: గట్టిచిక్కే.

చిట్టివీరన్న: చాలా గట్టిచిక్కు మహాప్రభూ! భట్టారకుల వారియెడల భక్తీ, గౌరవమూ, ఆదరమూ, విశ్వాసమూ వారందరికీ సమానంగానే వున్నాయి. వారి అస్వాస్థ్యానికి వారందరూ సమానంగానే చింతిస్తున్నారు. ఆ కారణంచేత అందరూ తీవ్రాలోచనలు చేసే మాట్లాడుతున్నారు. అంచేత యెవరి నిదానమూ కాదనడానికి వీలు కనపడ్డం లేదు.

రాజరాజు: వారందరూ అగ్ని సముద్రాలూనూ. ఎలా అనగలమూ?

చిట్టివీరన్న: నారాయణ భట్టుగారు, వారి జబ్బుకంటే యీ సన్నివేశం యెక్కువ అపాయకరంగా వుందని భయపడుతున్నారు.

రాజరాజు: సందేహమా? అయితే,—(ఆలోచన నటిస్తాడు)

చిట్టివీరన్న: (ఎదురుచూస్తూ వుంటాడు)

రాజరాజు: చూడండీ!

చిట్టివీరన్న: చిత్తం.

రాజరాజు: (పక్కకి చూస్తూ) భట్టారకుల వారియెడల వారి కుండుకున్న భక్తిని శంకించడం కాదుగానీ — (చిట్టివీరన్నతో) ఒక సర్వాగ్రహారం బహుమతీ అని విశదం చెయ్యండీ!

చిట్టివీరన్న: (ఉదాసీనంగా) చిత్తం మహాప్రభూ!

రాజరాజు: ఇప్పుడు చికిత్స యెవరు నడుపుతున్నారూ?

చిట్టివీరన్న: నరసం భట్టుగారు.

రాజరాజు: యత్కించిత్తైనా గుణం—?

చిట్టివీరన్న: అది గుణం అనే వారి నమ్మకం; కాని, కోనప్ప శాస్త్రులుగారూ, అన్నంభట్టుగారూ ఆ మాట వొప్పుకోడం లేదు.

రాజరాజు: పరాశరభట్టారకులు?

చిట్టివీరన్న: అనువూ, మినువూ చెప్పడం లేదు వారు. చూస్తూ, వింటూ, గమనిస్తూ, ఆలోచిస్తూ—(అర్ధోక్తి)

రాజరాజు: అంతకంటే వారేం చెయ్యగలరూ? అనుభవ పూర్ణులున్నూ అయిన వృద్ధులను కాదనడానికి వారి కింకా ధైర్యం చాలదు, పాపం.

చిట్టివీరన్న: అలాగే కావచ్చు ... ...

రాజరాజు: ఇంతకీ ...? మీ వుద్దేశం ....?

చిట్టివీరన్న: మనవిచేసుకుంటాను. న్యూనతపరచడం నా వుద్దేశం కాదు; గాని యీ వృద్ధులవల్లా యేమీ కాదు. పరాశరభట్టారకులూ యేమీ చెయ్యలేరు. పోగా, నన్నయభట్టారకులవారి కీక వొక్కటే చికిత్స వుంది.

రాజరాజు: ఈ విషయమై మీ కంత నిష్కృష్టాభిప్రాయం వుంటే, ఆ చికిత్స మీరే యెందుకు నడిపించగూడదూ?

చిట్టివీరన్న: నావల్ల కూడా కాదు, మహాప్రభూ!

రాజరాజు: ఏమీ? మీ దగ్గర సాధనసామగ్రి తక్కువా, మీరు సాధారణులా? సంచికట్టే లేదు; కాని సంస్థాన వైద్యులకంటే మీ తక్కువ యేమిటండీ? రెండేళ్ళనాడు మహారాణీకి సన్నిపాతించి నప్పుడు మీ వుపాయమే కదా వొడ్డెక్కించ గలిగిందీ?

చిట్టివీరన్న: నేను మనవి చేసుకునేది ఔషధ చికిత్స కాదు మహాప్రభూ!

రాజరాజు: మరేమిటీ?

చిట్టివీరన్న: మమ్మేలినవారి అనుగ్రహం వొ—క్కటే దానికి పరమౌషధం.

రాజరాజు: (తల పంకించి వూరుకుంటాడు.)

చిట్టివీరన్న: తమ దర్శనం వొక్కటే దానికి తగ్గ చికిత్స.

రాజరాజు: అయితే, యిప్పటికీ అది నిషిద్ధం కాలేదే?

చిట్టివీరన్న: కాలేదంటే చాలదు మహాప్రభూ! తమరు దయార్ద్ర హృదయులు కావాలి.

రాజరాజు: (తల పంకించి వూరుకుంటాడు.)

చిట్టివీరన్న: నిజానికి, భట్టారకులవారు, అలా చివికి చివికి జీర్ణించి పోవలసినవారు కారు మహాప్రభూ!

రాజరాజు: అవును. అది యెరుగుదును. అయితే, ఆ దురశ, వారికి పరాపాదితం కాదు. స్వయంకృతం, తెలుసా?

చిట్టివీరన్న: (అంజలి బంధంతో) చర్చ వద్దు మహాప్రభూ!

రాజరాజు: (చురుగ్గా) మరేమంటారండీ!

చిట్టివీరన్న: వారి భాగ్యం తమ చేతిలో వుందని.

రాజరాజు: తెనిగించి చెప్పండి.

చిట్టివీరన్న: ఆస్థానానికి రావలిసిందని తమ రొక్క మాటు వర్తమానిస్తే—(అర్థోక్తి.)

రాజరాజు: (మొగం పక్కకి తిప్పుకుని) అసంభవం. (వొత్తి) అది సాధ్యపడేది కాదు.

చిట్టివీరన్న: (మిడుతూ మిడుతూ చూస్తాడు.)

రాజరాజు: ఆదిలో, ఆస్థాన మర్యాద లతిక్రమించినవారు వారే అని మీకే తెలుసు.

చిట్టివీరన్న: అది నేను కాదనలేదు.

రాజరాజు: ఇదెలా చెప్పగలిగా రండి మరీ?

చిట్టివీరన్న : కటాక్షించమని ప్రార్థించడం తప్పా మహా ప్రభూ?

రాజరాజు : క్షోభపెట్టినవారు బిర్రబిగిసి వుండడమూ, క్షోభ పెట్టబడ్డవారు దయతలచడమూ, కటాక్షించడమూనూ, కదూ!

చిట్టివీరన్న : (చూసి చూసి) ఒక్క సంగతి మనవి చేసుకుంటాను.

రాజరాజు : కానివ్వండి.

చిట్టివీరన్న : ఆ వేళే కనక తమ రాగ్రహించివుంటే యేమయ్యేదో ?

రాజరాజు : దాన్ని మీరేమంటారూ ?

చిట్టివీరన్న : కటాక్షించడమే. కాదని యెవరనగలరూ ?

రాజరాజు : ఇక్కడ కటాక్షం వుండడం చూశారు గదా. మరి అక్కడ పశ్చాత్తాపం ఉందేమో గుర్తించారా ?

చిట్టివీరన్న : దూరాలోచన చేసి కొంత కటాక్షించడం. మరికొంత కటాక్షించడానికి ప్రతిబంధకం కాదే ?

రాజరాజు : విధాయకం అంటారా మీరు ?

చిట్టివీరన్న : అవకాశం అంటాను. కాకపోతే యెలా ప్రార్థించగలనూ ?

రాజరాజు : (మొగం పక్కకి తప్పుకుని, తల అడ్డంగా వూపి) వీల్లేదండీ!

చిట్టివీరన్న : (సాలోచనగా చూస్తాడు )

రాజరాజు : వారు పశ్చాత్తాపపడవలసిందే.

చిట్టివీరన్న : ఒప్పుకున్నాను మహాప్రభూ !

రాజరాజు : అది నా యెదట జరగవలసిందే.

చిట్టివీరన్న : అదీ ధర్మమే మహాప్రభూ !

రాజరాజు : తమకి తామై వారే యిక్కడికి రావలసిందే.

చిట్టివీరన్న : ఆ వొక్క విషయమే—(అర్థోక్తి)

రాజరాజు : (దృఢంగా) రిజగి తీరాలి.

చిట్టివీరన్న : (నిట్టూర్చి చూస్తూ వూరుకుంటాడు.)

రాజరాజు : (పక్కకి చూస్తూ) పోనీ-నేనింకొక మెట్టు దిగుతాను. (చిట్టివీరన్నతో) వారు స్వయంగా దయచేస్తే నేను మనస్ఫూర్తిగా స్వాగతం నివేదించుకుంటాను. వెనకటి సంగతు లేమీ పుటంకరించను. ఈ నడమంత్రపు కల్లోలం సంభవించినట్టు స్ఫురణ కూడా కలగనివ్వను. ఏం, సరా ?

చిట్టివీరన్న : మహోదారులు కదా, తమ రన్యథా చెయ్యడం యెలా సంభవిస్తుంది మహాప్రభూ ?

రాజరాజు : వా రప్పుడెందు కలా వ్యగ్రు లయిపోయారో నేను గుర్తించకపోలేదు. వారియెడల గల నా భక్తి యీషణ్మాత్రమూ కలుషితం కాలేదు. గౌరవాదరాలున్నూ క్షీణించలేదు.

చిట్టివీరన్న : అది కనపడుతూనే వుంది. అయితే, యింత స్నిగ్ధహృదయులు తాము——(అర్ధోక్తి)

రాజరాజు : అంతే. ఇక నేనేమీ చెయ్యలేను.

చిట్టివీరన్న : చెయ్యలే నంటూనే అనేకాలు చేయించారు తమరు, నేనెరగనా ? ఇంతకీ; వారు బ్రాహ్మణమాత్రులే అయితే, వారి సంగతి నేను స్మరించకే పోదును. గొప్ప పండితులూ, మహాకవులూ అయినా నేనేమీ కలగజేసుకోకే పోదును; కాని యేలినవారికి అంకితంగా వారు ఆంధ్రీకరిస్తూ వున్న మహాభారతం- తమ వంశ చరిత్ర——(అర్ధోక్తి)

రాజరాజు : ఆ విషయమై నేనెంత మథనపడుతున్నానో ?

చిట్టివీరన్న : తెలుసు మహాప్రభూ, పూర్తిగా తెలుసు. కనకనే, తమ యెదుట మళ్లీ నేనీవిషయం ప్రస్తావించుకో గలిగాను. తమ కంత తపన వున్నప్పుడు పట్టుదల కాస్త సడలించుకోగూడదా మహాప్రభూ ?

రాజరాజు : నేనేవెళ్లి రమ్మనడానికీ, రావలసిం దని వర్తమానం పంపడానికీ భేదం యేమయినా వుందిటండీ ?

చిట్టివీరన్న : అమ్మా ! తమరే అక్కడికి వేం చెయ్యడమా ? ఎంతమాటా ?

రాజరాజు : (కొంచెం కఠినంగా) అది కాదు. భేదం అడుగుతున్నాను.

చిట్టివీరన్న : (యుక్తి తోచక చూసి చూసి) నేను భట్టారకులవారిని పూసుకు వస్తున్నానని మమ్మేలినవారు భావించకూడదు· వారిప్పుడస్వస్థులై మంచాన పడిపోయి వున్నారు. అనుష్ఠానా లన్నీ కట్టుబడి పోయాయి. లేకపోతే, బ్రతిష్ఠాపిశాచా న్నుచ్చాటనం చేసి వారినే తమ సన్నిధికి నేను తేగలిగివుందును.

రాజరాజు : పదేపదే యిక మీరా విషయం యెత్తవద్దు.

చిట్టివీరన్న : (నిరాశ కనపరుస్తూ) అయితే, భట్టారకులవారికిక రక్షణ లేదన్నమాటే.

రాజరాజు : (పక్కకి చూస్తూ) ఉండావచ్చు, లేకపోనేవచ్చు: కాని సహనానికేనా అవధి వుంది.

చిట్టివీరన్న : సహనంలో తాము అవధి దాటే వున్నారు· కాదనడానికి వీలులేదు. ఔదార్యంలోకూడా తమరు పారంగతత్వం కనపరిచారు; కాని వాటి కనుగుణంగా, కాస్త పట్టుదల మాత్రం (మాట నాన్చేస్తాడు)

రాజరాజు : పోనీ, వారు చేసిన ధర్మనిర్ణయం తప్పని వారిచేత అనిపించగలరా మీరు ?

చిట్టివీరన్న : వారిప్పు డున్న ఉన్మాదావస్థలోనా ?

రాజరాజు : ఆమాట అన్నప్పుడు వారున్మాదావస్థలో లేరనా మీ వుద్దేశం ?

చిట్టివీరన్న : చర్చ వద్దని నా మనవి. అది యిదివరకే కావలసినంతకంటే యెక్కువే అయిపోయింది. స్థితిగతు లిలా విషమించడానికదే కారణం కూడానూ. అయితే, యీ నడమంత్రపు కల్లోలం సంభవించినట్టే తోచనివ్వనని తమ రిప్పుడిప్పుడే—(అర్థోక్తి)

రాజరాజు : దాని కిక్కడ కాదు సమన్వయం. ఆ సందర్భం వేరు. మీరు ముఖపిధానం చెయ్యాలని చూడకండి.

చిట్టివీరన్న : అనుగ్రహించమని ప్రార్థించడం ముఖపిధానం చెయ్యడమా మహాప్రభూ? భట్టారకులవారు నాకు వియ్యంకులు కారు. సన్నిహితులయినా కారు. భారతాంధ్రీకరణంవల్ల కూడా నాకు కలిగే ప్రయోజనం లేదు. పోగా, ఏలినవారి సేవలో నేను దీక్షితుణ్ణయి వున్నాను. తమకి అభ్యుదయం కోరడమూ, అది సాధించడమూ- ఇదే నా విధి. భట్టారకుల వారున్నూ తమ అభ్యుదయం ఆకాంక్షించే వారే. అయితే, హఠాత్తుగా పొరపొచ్చాలు వచ్చాయి వాటిని సవరించక పోతే నేనుండిన ప్రయోజనం యేమున్నదీ!

రాజరాజు : (కొంచెం కరుగ్గా) దాని కిదా మార్గం?

చిట్టివీరన్న : (నిరుత్సాహపడిపోయి) సరే.

రాజరాజు : ఇందులో మీ రెరగనివారు లేరు. మీ ప్రయత్నం తప్పనీ నేను చెప్పడం లేదు.

చిట్టివీరన్న : శివశివా!

రాజరాజు : దోషం యేమిటో, తత్పరిహారం యేమిటో, దోషిన్నీ—(అర్థోక్తి)

చిట్టివీరన్న : ఇంకెందుకూ? నా కోరిక మన్నింపకపోయినా, తమరు, అసాధారణ దయాదాక్షిణ్యాలే కనపరిచారు. ఇది మాత్రం యేమంత తక్కువా? నా ఆశలు భగ్నం కాలేదు; కనక, అక్కడ కూడా మళ్లీ ప్రయత్నించి చూస్తాను. నేను కృతార్థుణ్ణి కాగల ననే నా నమ్మకం.

రాజరాజు : మీ ప్రజ్ఞ అలాంటిదే. తప్పకుండా ప్రయత్నించండి. చూడండీ, భట్టారకులవారికి మనస్థిమితం లేదని చెబుతున్నారు మీరు. అంచేత, మీరు తీసుకురావాలని ప్రయత్నించినప్పుడు వా రందు కనువైన స్థితిలో వుండకపోవచ్చు. అనువైనప్పుడు మాత్రం ఇక్కడ వేళ కాకపోయినా మీరు జంక నక్కరలేదు.

చిట్టివీరన్న : చిత్తం మహాప్రభూ!

రాజరాజు : వస్త్రాభరణాల విషయమై కూడా పట్టింపు అక్కరలేదు. ఎలా ఉన్నవా రలా బయలుదేరినా నిస్సంకోచంగా తీసుకురావచ్చు.

చిట్టివీరన్న : చిత్తం చిత్తం.

రాజరాజు : కులబ్రాహ్మణపదవిలో, మళ్ళీ వారిని ఆ క్షణం లోనే అభిషిక్తుల్ని చేస్తాను. జాంబూనదాంబరాభరణాలతో కర్పూర తాంబూలం సమర్పించుకుని, భారతాంధ్రీకరణం అనుగ్రహించ మని వారిని మళ్ళీ వేడుకుంటాను.

చిట్టివీరన్న : (దోపిలి వొగ్గి) మహాప్రసాదం, మహాప్రసాదం.

రాజరాజు : ఏమీ, మీకు తృప్తి అయినట్టేనా ?

చిట్టివీరన్న : అయింది, మహాప్రభూ, అయింది. నాకు పూర్తిగా ధైర్యమున్నూ కలిగింది.

రాజరాజు : మరి వెళ్లిరండి.

చిట్టివీరన్న : సెలవు.

ఇద్దరూ లేస్తారు. చిట్టివీరన్న వెళ్ళిపోతాడు.

రాజరాజు : (లోపలికి చూస్తూ) ఎవరక్కడ ?

"నేనున్నాను మహాప్రభూ!" అంటూ చిట్టి వస్తుంది.

రాజరాజు : మహారుద్రయ్యగారు——

చిట్టి : వారు.... కింద.... వేచి.... ....

రాజరాజు : రప్పించు.

చిట్టి : గౌరి.... ....వచ్చి.... ....

రాజరాజు : ఏమిటి సంగతి ?

చిట్టి : మహారాణీ వర్తమానించారు.

రాజరాజు : రాత్రి దయచేస్తా మనీ?

చిట్టి : అవును మహాప్రభూ!

రాజరాజు : వారి కద్దేమిటీ! ఏర్పాట్లు చేయించు.

రాజు ముందుకి అడుగు వేస్తాడు. చిట్టి తప్పుకుంటుంది. రాజు వెళ్లిపోతాడు.

చిట్టి : (ఒక్క క్షణం వుండి, లోపలికి చూస్తూ) అన్నా!

అన్నపూర్ణ : (వస్తూ) ఎందుకు చిన్నా?

చిట్టి : వినపడిందా?

అన్నపూర్ణ : కిన్నెరలు మోగినట్టు వినపడింది.

చిట్టి : కనక, నాలుగ్ఘళ్ల రాత్రయేటప్పటికి సర్వమూ సజ్జితమై వుండాలి.

అన్నపూర్ణ : ఉంటుంది.

చిట్టి : వీణావాదనకు మంగతాయి. వేణుగానానికి శేషశాయి. మార్దంగికురాలు రంగనాయకి.

అన్నపూర్ణ : మొలిచినట్టు కలుస్తుంది కవ.

చిట్టి : నృత్యానికి కిన్నెరసాని.

అన్నపూర్ణ : బంగారం ముసుముసులాడిపోతుంది.

చిట్టి : సన్నిధిని వుండవలసిన వంతు నీదీ నాదీని. తెలుసా?

అన్నపూర్ణ : ఆహా!

చిట్టి : ముందు మల్లెనూనే, పన్నీరూ ...జ్ఞాపకం వుందా?

అన్నపూర్ణ : (సాగతీసుకుంటూ) ఓ హో!

చిట్టి : మరి పద.

అన్నపూర్ణ : (నృత్యం చేస్తూ) హూ, హూ!

ఇద్దరూ వెళ్లిపోతారు.

# మూడో రంగం

ఉదయం రెండుగడియల పొద్దెక్కింది. వాయవ్యపు బురుజు సమీపంగా పశ్చిమప్రాకారంమీద, రాజరాజూ మహారుద్రయ్యా పచారు చేస్తున్నారు. ఇటూ అటూ వున్న రెండు బురుజులమీదా నలుగురైదుగురు సేవకులు ఆజ్ఞలకోసం వేచి ఉన్నారు.

మహారుద్రయ్య: మహారాణీ అనుదినమూ కదుపుతూనే వున్నారట. సందర్భం అయినప్పుడల్లా తామున్నూ, కోరుతూనే వున్నారట; కాని "యిప్పుడు కాదు" అని తప్ప మరో మాట లేదంటారు తమ్ముడుగారు.

రాజరాజు: మరి అబ్బాయి?

మహారుద్రయ్య: నిన్న సాయంత్రం తమ సెలవుచొప్పున వెళ్లి యువరాజులుంగారి దర్శనం చేసుకున్నాను.

రాజరాజు: దగ్గిర సుబుద్ధి అయ్యవారున్నారా?

మహారుద్రయ్య: లేరు. అబ్బాయి వొక్కరే పావురాలతో వినోదిస్తున్నారు.

రాజరాజు: మంచి సమయం.

మహారుద్రయ్య: నిజమే. ఆ యేకాంతం చూసి నేనూ తమలాగే అనుకున్నాను; కాని గడియసేపు వుపోద్ఘాతం నడిపి, వారు సావధాను లయినట్టు గుర్తించి, మెల్లిగా అందించాను.

రాజరాజు: సంబరపడుతూ విన్నాడా?

మహారుద్రయ్య: సంబరం! నన్ను చూస్తేనే వా రదో విధంగా అయిపోతారు కదా, నేమ చెప్పినది (అర్ధోక్తి)

రాజరాజు: ఏమన్నాడో చెప్పండి.

మహారుద్రయ్య: "ఇప్పుడు తొందరేమిటి?" అనేసి వూరుకున్నారు తడుముకోకుండా.

రాజరాజు: (తల పంకిస్తూ) ఆ!

మహారుద్రయ్య: ఎన్ని మాట్లు ఎన్ని విధాల మార్చి అడిగినా అదే ముక్తాయింపు. మరో మాటే లేదు.

రాజరాజు: (తల పంకించి) ఆ!

మహారుద్రయ్య: మూడు గడియలు చెప్పినా పూర్తి కాని సంగతి మూడు ముక్కల్లో తేల్చేస్తాట ఆ మితభాషిత వొకనాటి కంటే వొకనాడు పెరిగిపోతుంది

రాజరాజు: మితభాషిత వొకటే అయినా వొక దారే. నాలుక పెరుక్కున్నా అన్నమాట తిరక్కపోవడం వొకటుంది కదా?

మహారుద్రయ్య: అదిన్నీ అసాధ్యంగానే వుంది మహాప్రభూ!

రాజరాజు: ఇలాంటివాడు భార్యకేమి వుల్లాసం కలిగించగలడండీ?

మహారుద్రయ్య: చిత్తం చిత్తం. ఎంతోకాలంగా నేనీ సంగతే యోచిస్తున్నాను. చివరికొక్క వుపాయం—(అర్థోక్తి)

రాజరాజు: ఏమిటదీ?

మహారుద్రయ్య: వారికంటే మితభాషిణి అయిన పిల్లను తెచ్చి పెళ్ళిచెయ్యడం.

రాజరాజు: ఏదో శాస్త్రం చెప్పినట్టుంది మీ మాట.

మహారుద్రయ్య: అదేమి మహాప్రభూ?

రాజరాజు: వివాహమే వద్దంటున్నాడు కదా?

మహారుద్రయ్య: అది ఆశాభంగంవల్ల కలిగిన నిర్వేదం. స్థిరంగా వుండిపోతుందా? ఎప్పుడో వొకప్పుడు—(అర్థోక్తి)

రాజరాజు: అది సరే. అలా అని సర్వమూ కాలానికి విడిచిపెట్టి మనం చూస్తూ వూరుకోడం మంచిదా?

మహారుద్రయ్య: ఒక్కనాటికిన్నీ కాదు. మన ప్రయత్నంలో మనం వుండవలసిందే. తీవ్రంగానే ప్రయత్నించాలి కూడానూ.

రాజరాజు: ఉపాయం?

మహారుద్రయ్య: ఒకటా, లక్షలు.

రాజరాజు: మరి అపాయాలు? అవి మాత్రం వొకట్లా? ఎక్కడచూసినా, ఎటుచూసినా యెదురింపే, ఎవర్నిచూసినా విరోధులే.

మహారుద్రయ్య: సంఖ్య గొప్పదే, కాదనను.

రాజరాజు: సత్తా మాత్రం తక్కువ టండీ?

మహారుద్రయ్య: తమ రలా అధైర్యపడితే—(అర్ధోక్తి)

రాజరాజు: అదేమిటండీ, అధైర్యమూ జంకూ నేనెప్పుడూ యెరగనూ; కాని స్థితిగతులు పరిశీలించుకోవద్దూ?

మహారుద్రయ్య: నా మనవి అదే. మనం యెంతమాత్రమూ తొందరపడకూడదు. మనస్సు పాడుచేసుకోగూడదు.

రాజరాజు: మనస్సు పాడుకావడం యేమిటి గానీ, అయినా చూడండీ. ఎటువెళ్లినా అడివీ ముళ్లూనూ.

మహారుద్రయ్య: సత్యమే.

రాజరాజు: ప్రపంచకం యావత్తూ మీదపడిపోయినా సరే అని కోరి తెచ్చుకున్న జక్కులదీవి రాణీగారు కొమ్మెక్కి కూచున్నారాయె. అదేదో వ్రతంట వ్రతం.

మహారుద్రయ్య: తమ క్షేమం కోసమే—(అర్ధోక్తి)

రాజరాజు: అది నా క్షేమంకోసమే. యయాతిమహారాజులుం గారిలాగ పునర్యౌవనం కోసం నేనే తంటాలు పడ నక్కరలేకుండా ఘోరనిష్ఠతో ఆమే తపస్సు చెయ్యడం సంతోషకారణమే; కాని యెవరికేనా అది తెలిసిపోయిందంటే, నా సంగతి యెంత రసాభాస అయిపోతుందో ఆలోచించండీ.

మహారుద్రయ్య: ఇవన్నీ ఆలోచించే మొదణ్ణుంచీ నేను వ్రతం అంగీకరించవద్దంటున్నది. అయినా, వ్యవహారం యెలాగా

ప్రారంభం అయిపోయింది కనక, మనం చాలా కట్టుదిట్టంగా వుండాలి మహాప్రభూ!

రాజరాజు: ఇప్పటికీ మీ రలా సందేహస్తూనే వుండడ ఆశ్చర్యంగానే వుంది. పోనీండి. ఆ కష్టసుఖాలు తనకీ వున్న కనక, ఆ విషయమై మనకంటే ఆమే జాగ్రత్తగా వుంటుం సందేహం లేదు; కాని, మహారాణీ యెడమొగమూ పెడమొగమూను మాటే తక్కువ. మాట్లాడితే మాత్రం సూటీపోటీలు. ఒక మాట పది అర్థాలూ యిరవై దెబ్బలూనూ.

మహారుద్రయ్య: (తల పంకించి వూరుకుంటాడు)

రాజరాజు: తమ్ముణ్ణి చూశారా? చిట్టివీరన్నగా రెప్పుడు అదే మొగ్గు కదా? భట్టారకులవారి ప్రతిఘటనే సయం, తాటా మంట లాగ గప్పు మని చల్లబడి వూరుకుంది; కాని వారి జబ మనస్సు గుంజేస్తోంది. అబ్బాయి తిరగబడతా డని మన కెప్పుడు అనుమానమే లేదు. కాని, సుబుద్ధిఅయ్యవా రతగాణ్ణి యెప్పు డే తిప్పేస్తారో?

మహారుద్రయ్య: మనం వూరుకున్నంతసేపే.

రాజరాజు: ఊరుకుంటేనే. హెచ్చుతగ్గులు వచ్చా యంటే చివరికి మనం నొక్కేస్తామనే అనుకోండి. అయినా, ప్రస్తుతం మన గుంజాటన తప్పదు కదా?

మహారుద్రయ్య: అలాంటిది సంభవించకుండా వుండాలని. ముఖ్యంగా, అబ్బాయిగారి వివాహం విషయమై, రాత్రీ పగలూ నే చేసే ఆలోచనలు భగవంతుడికే తెలియాలి. తరంగతరంగాలు వూహలు పుట్టుకువస్తున్నాయి. సరి ఉపాయాలు——(అర్థోక్తి

రాజరాజు: ఏదీ మీరు గొప్ప దనుకుంటూ వున్న ఒక ఉపాయం యెలా వుంటుందో చూపించండీ.

మహారుద్రయ్య: ప్రీతిగల వొకనొక సుందర రాజపుత్రిక అబ్బాయిగారికి ఏకాంతం సంఘటించడం.

రాజరాజు : అవునండోయ్ ! (పక్కగా చూస్తూ, తల పంకిస్తూ, సాలోచనగా) అది బాగున్నట్టుంది . ..బాగానే వుంది . . ...(మహారుద్రయ్యతో) చాలా బాగుందండీ.

మహారుద్రయ్య : (ఉత్సాహంగా) చిత్తం.

రాజరాజు : అయితే, అందుకు తగ్గ రాజపుత్రిక యెవరో చూడండీ.

మహారుద్రయ్య : అరవై పటాలు వచ్చివున్నాయి కదా?

రాజరాజు . వాటి సంగతి అలా వుంచండి మనం చెబితే ఇష్టాపూర్తిగా అంగీకరించే రాజెవ రంటారూ?

మహారుద్రయ్య : పైవా రయితే యిది సాధ్యపడదు. మన మండలేశ్వరులయితే—(అర్ధోక్తి)

రాజరాజు : పటాలు పంపినవారిలో కొందరు మండలేశ్వరులే. వారిలో మన మాట వినేవా రెవరు?

మహారుద్రయ్య : ఒక్క మనవి -

రాజరాజు : ఏమిటదీ?

మహారుద్రయ్య : ఎంచేతనో పోల్నాటి మండలేశ్వరులు పటం పంపలేదు. మనం రాయబారులను పంపలేదా?

రాజరాజు : ఉన్న మండలేశ్వరు లందరిలోనూ కొద్దిపాటివా డని మహారాణి ఒభిప్రాయపడ్డారు. తమ్ముడూ అలాగే భావించాడు.

మహారుద్రయ్య : చాలా పొరపాటు జరిగిపోయింది. వారి కొమార్తె త్రిభువనసుందరి అని ప్రఖ్యాతి పొందివున్నారు.

రాజరాజు : విన్నాను.

మహారుద్రయ్య : విలువిద్యలోనున్నూ ఆమె ప్రఖ్యాతి పొంది వున్నారు.

రాజరాజు : అవునవును. అదీ విన్నాను. పైగా, పోల్నాటి మండలేశ్వరుడైన విశ్వనాథభూపతికి మనం యెంతచెబితే అంత.

వారికీ మనకీ తరతరాలుగా యెంతో కొంత బంధుత్వమున్నూ వున్నది. మనయెడల అతనికి గురుభావంకూడా వుంది, తెలుసా?

మహారుద్రయ్య: చిత్తం చిత్తం, తమకి శబ్దవేధ యేలిన వారే నేర్పిన ట్లొకమాటు వారు సెలవిచ్చివున్నారు.

రాజరాజు: కనక,—(స్ఫురణ అభినయించి) ఆమె విలువిద్య సంగతి కూడా మీరు జ్ఞాపకం చేశారు; కనక, ఒక్కపని చెయ్యండి.

మహారుద్రయ్య: సెలవిప్పించండి.

రాజరాజు: మల్లెసాల ప్రాంతాన మెకాలు విజృంభించి జనులను బాధపెడుతున్నట్టూ, అది నివారణ చేయించవలసినట్టూ వుపాయాలుపన్ని విన్నపాలు తెప్పించండి. మనం సుబుద్ధి అయ్యవారిని జతచేసి అబ్బాయిని పంపుదాం. సరిగా, అదే వేళకి, చెలికత్తెలను మాత్రమే తోడిచ్చి తాను దూరంగా వుంటూ తన కూతుర్ని అక్కడికి పంప మని అతనికి వర్తమానం—(అర్థోక్తి)

మహారుద్రయ్య: వారితో ముందు మాట్లాడకుండానే?

రాజరాజు: (ఆలోచించి) సరే, మీరు విన్నపాల ప్రయత్నం సాగించండి. ఈలోపున నేనతనితో మాట్లాడతాను. అంచెగుర్రాల యేర్పాటున్నూ చేసి, రావలసిందని ఆతనికి వార్త పంపండి.

మహారుద్రయ్య: చిత్తం, యిది కార్యకారి కావచ్చు ననే నా నమ్మకం మహాప్రభూ!

రాజరాజు: నాలుగు దినాలలో సంధానం కావాలి సుమండీ.

మహారుద్రయ్య: చిత్తం చిత్తం.

రాజరాజు: తరవాతి సంగతి తరవాత చూసుకుందాం, మరి, మనం, విహారానికి వెడదామా?

మహారుద్రయ్య: చిత్తం గుర్రాలు సిద్ధంగా వున్నాయి. పరివారమున్నూ కనిపెట్టుకుని వుంది, దయచెయ్యండి.

ఇద్దరూ వెళ్లిపోతారు.

# పద్మాలు గోరంగం

పడమటి ప్రాకారానికి చేరివున్న పూలతోట. ఉదయం అయిదారు గడియల పొద్దెక్కింది. పగటి పువ్వులన్నీ చక్కగా వికసించి వున్నాయి. దక్షిణపు దిక్కునుంచి సంపంగెపువ్వుల పరిమళం రివ్వున దూసుకువస్తోంది. పక్కనే వున్న బొడ్డుమల్లె పొదలమీద, చక్కని పాటలు పాడుతూ, కొదమ తుమ్మెదలు చక్కగా నృత్యం చేస్తున్నాయి. ప్రకృతి అంతా ప్రసన్నగంభీరంగా వుంది.

సారంగధరుడు, దిగుడుబావి పిట్టగోడమీద కూచునీ, సుబుద్ధి, గోడకానుకు నుంచునీ వున్నారు. నాలుగైదు గజాలలో వున్న పొగడచెట్టు కిందనుంచి, రెండు మూడు పావురాలు, ఉండుండి వచ్చి సారంగధరుడి దగ్గరగా గోడ మీద వాలుతూ, అతను ఆదరించకపోగా చెట్టుకింది కెగిరి పోతూ, ఆటమటించిపోతున్నాయి. వారిద్దరూ చింతా క్రాంతులయివున్నారు.

సారంగధరుడు: మరి నా మాట? వారేనా మరో నాలుగు కాలాలు బతికి వుండకపోతే నా గతి యేమి కానూ?

సుబుద్ధి: అంతా అయోమయంగా వుంది. ఏమీ కనపడదు ఏమీ తోచదు.

సారంగధరుడు: వ్యాసులవారి రచన యెన్నిమాట్లు చదివినా యేదో లోటున్నట్టే కనపడుతూ వుంటుంది. నన్నయభట్టారకులవారి రచన చదివిన కొద్దీ నూత్నరుచులు పుడుతున్నాయి. హృదయాని కాప్యాయనమున్నూ కలుగుతోంది. అటు సంస్కృత మర్యాదలూ, యిటు తెనుగు జాతీయాలూ మిశ్రితం కావడంవల్ల వారి భాష

గంభీరమై, ఆ యితిహాసానికి పూసినట్టు సరిపోయింది. అలాంటి భాషలో గ్రంథం అంతా కాకపోయినా, అధమం, ప్రారంభమై కొంత నడిచివున్న అరణ్యపర్వ మయినా పూర్తి కాకపోతే యెలాగా ?

సుబుద్ధి : ఒక అరణ్యపర్వమే అన్న మాటేమిటీ, భారతం యావత్తూ వొక్క వూపున పూర్తి చెయ్యా లన్నంత ఆవేగం వుంది వారికి. ఆ వున్మాదానికీ ఆవేగం తోడు కాగా, మహారాజులుంగారిమీద అలిగి తాము భారతరచన కట్టిపెట్టేసిన శపథం కూడా గుర్తించు కోలేని స్థితిలో వున్నారు. నిన్న మధ్యాహ్నం నేనక్కడ వుండగా "యీ పాటికి యుద్ధపంచకం ముగిసి వుండక పోయేదా ?" అని చీదమయ్యగారి నడిగి, అంతలో నారాయణభట్టుగారు రాగా "ఇంత జాప్యం అయితే యెలాగోయ్ ? సంపుటం విప్పు. గంటం పుచ్చుకో" అంటూ నాలుగుమాట్లు తొందర పెట్టారు వారిని.

సారంగధరుడు : వారు చేసిన తపస్సెంతటిదో, వారిని ముసురుకున్న జాడ్యం యెటువంటిదో చూశారా ?

సుబుద్ధి: అంతటి తపశ్శాలి కనకనే వారింకా ఆ స్థితిలో నయినా వుండగలిగారు. ఉన్మత్తులైన సాధారణుల పరిస్థితులు మనం చూడ్డం లేదూ ? "శారదరాత్రులు - శారదరాత్రులు" అని మననం చేసుకుంటూ, తరవాయి అందుకోడానికి వారుద్యుక్తులవుతూ వుండడం చూడగా, అలాంటి స్థితిలో కూడా కవితాశక్తి వారి కెంత వాచోవిధేయంగా వుండిందో, ఆ క్షుద్రవ్యాధి దాన్నెంత తరిమికొడుతూ వుండిందో కళ్లకి కట్టినట్టు కనపడింది నాకు.

సారంగధరుడు : (మాట రాక వూరుకుంటాడు)

సుబుద్ధి : ఇలాంటి స్థితిలో కూడా, ముందు వారే తమ సన్నిధికి రావాలనడంకంటే, మహారాజులుంగారే వొక్కమాటు వారి సన్నిధికి వేంచెయ్య గూడదూ ప్రభూ ?

సారంగధరుడు : (ప్రకృతిస్థుడై) ఏమన్నారూ ?

సుబుద్ధి : ఇలాంటి స్థితిలో కూడా ముందు వారే తమ సన్నిధికి రావాలనడంకంటే మహారాజులుంగారే—(అర్థోక్తి)

సారంగధరుడు: అది మంచిమాటే; కాని యెవరికీ? సంహారి పక్షంగా మనం ధర్మనిర్ణయం చేస్తే చెల్లుతుందా?

సుబుద్ధి: చెల్లకపోడాని కిందులో వుండుకున్న విప్రతిపత్తి యేమిటి మహాప్రభూ?

సారంగధరుడు: అంతానూ. కాని దేమిటో ఆలోచించండీ మీరు.

సుబుద్ధి: (చూస్తూ వూరుకుంటాడు)

సారంగధరుడు: వారు మహారాజులు, వీరు మహాకవులు. వారి పట్టుదలకి వారికీ కారణా లున్నాయి. వీరి పట్టుదలకి వీరికీ హేతువు లున్నాయి. లోకసామాన్యధర్మాల కుభయులూ అతీతులే కదా, యెవరు తీసిపోతారూ? ఇది యోచించుకోకుండా మనం పేరా సలకు పోవడం మంచిదా?

సుబుద్ధి: (చకితు డయి వూరుకుంటాడు)

సారంగధరుడు: ఏం, నామాట మీకు విపరీతంగా కనపడు తోందా? బాబయ్యగారు తమ పట్టుదల కొంత సడలించుకున్నారు, మీ రెరగరా?

సుబుద్ధి: ఎరుగుదును.

సారంగధరుడు: బాబయ్యగారు కృతకృతులు. అయినా వారు పట్టు సడలించుకున్నారు. భట్టారకులవారు విఫలులు. అయినా వారు తమ పట్టు ఎడవరు. ఇది యోచించారా మీరు?

సుబుద్ధి: అదీ యెరుగుదును. అదీ యోచించాను. నా మాట కేం, మా నాయనగా రెంత దూరం మనవిచెయ్యాలో అంతదూరమూ మనవి చేశారు. ఈ విఘ్నం తమకున్నూ అనర్ధకారే అని కూడా మనవిచేశారు.

సారంగధరుడు: అయ్యేవుంది కాదూ?

సుబుద్ధి: పావులూరి మల్లన్నగారి చేత సెలవిచ్చారు. రెండు చేతులూ పట్టుకుని వారు భట్టారకులవారిని బతిమాలారు. చివరికి "మీ పట్టుదలే మిగిలిపోతుం" దనీ "మీ కోస మయినా మీర్రు

భారతాంధ్రీకరణం సాగించడం చాలా అగత్య" మనీ "యీ తరంతో చెల్లిపోయే యీ వివాహం కోసం తరతరాలుగా వుండిపోవలసిన భారతం విడిచిపెట్టెయ్యడం ప్రాజ్ఞలక్షణం కా" దనీ కూడా వారు వేడుకున్నారు; అయినా భట్టారకులవారు వినిపించుకోలేదు.

సారంగధరుడు: (తల పంకించి ఆలోచిస్తూ వూరుకుంటాడు)

సుబుద్ధి: సమానభాగస్వాములు కావడంవల్ల, నారాయణభట్టు గారి ఆందోళన చెప్పడానికే సాధ్యం కానంతగా వుంది. "పోనీ, కులబ్రాహ్మణ పదవి ముట్టుకోకపోయినా సరే, భారతరచన మాత్రం సాగించండి" అని వారు కాళ్లావేళ్లా పడి ప్రార్థిస్తున్నారు. అయినా, లాభం లేక పోతోంది.

సారంగధరుడు: (నిరాశతో) ఎప్పటి కయినా మనం భట్టారకులవారికే నచ్చ చెప్పవలసివుంది. మరొక వుపాయం లేనేలేదు. గురుదేవులు బయలుదేరా రని తెలిస్తే బాబయ్యగారు వంకదార దగ్గిరకే యెదురువెళ్ళి పాదాభి వందనం చేసి గుచ్చికౌగిలించుకుని తోడి తెచ్చుకుంటారు. మనం సత్యం గుర్తించుకోవాలి. కుపితులై గురుదేవులు వెళ్ళిపోయినప్పణ్ణుంచీ బాబయ్యగా రుత్సాహదూరులై కనపడుతున్నారు. అది అలా సంభవించినందుకు వారు చాలా మథనపడిపోతున్నా రని నేను భావిస్తున్నాను.

సుబుద్ధి: కానే వచ్చు, మహాప్రభూ! తాము కోరిన మహాగ్రంథం — జగత్ప్రసిద్ధ మైన తమ వంశచరిత్ర పూర్తి కాకపోతే వారు మాత్రం నిర్విచారులై వుండడం సంభవమా?

సారంగధరుడు: కనక, వా రీపూట యెలా వున్నారో చూసి రండి.

సుబుద్ధి: మరిచాను, ఇంకొక్కసంగతి. పరాశరభట్టారకులు, షష్టిగడియలూ నన్నయభట్టారకులవారిని కనిపెట్టుకుని వుండడమూ, భట్టారకులవారి స్థితీ వృద్ధవైద్యుల చికిత్సా తత్పరిణామమూ పరిశీలిస్తూ మౌనంగా కూచుని వుండడమూ తమరూ యెరుగుదురు.

సారంగధరుడు: అవును.

సుబుద్ధి: నిన్న సాయంత్రం, మార్కండేయస్వామి సన్నిధిలో, నేను ప్రార్థించగా ప్రార్థించగా వారు చెప్పిం దేమంటే? ఇంత మంది నచ్చచెప్పినా—ప్రార్థించినా నన్న పార్యులు వినకపోవడం వుండే, అది, వారి సహజప్రవృత్తి అనుకోవద్దన్నారు వారు. ఉన్మాదం అలా చేస్తోం దనీ, ముందు దానిపని చూసుకోవా లనీ—(అర్థోక్తి)

సారంగధరుడు: ధన్వంతరి అవతారం, పరాశరభట్టారకుల వారి మాట కొట్టెయ్యడం కాదు, కానీ, ఆదిలో, శపథంవల్ల నే వున్మాదం వచ్చివుండడం........?

సుబుద్ధి: సరే... ముందు... చూసివస్తాను.

సారంగధరుడు: భోజనానంతరం మళ్లీ వొక మాటు మనం ప్రయత్నించిచూతాం.

సుబుద్ధి: చిత్తం, తమరు.......?

సారంగధరుడు: ఒక్క క్షణం యీ తోటలో తిరిగి, బుల్లి బాబయ్యగారి దర్శనానికి వెడతాను. వెళ్లిన పని తొరగా అయితే మీరక్కడికే రావచ్చు. (గోడ దిగుతాడు.)

సుబుద్ధి: చిత్తం. (రెండడుగులు వేసి ఆగి) కోనప్ప శాస్త్రిల వారినికూడా తీసుకునే వెడతాను.

సారంగధరుడు: బాగుంది, అలా చెయ్యండి.

సుబుద్ధి వెళ్లిపోతాడు.

సారంగధరుడు: బాబయ్యగారే వెళ్లి దర్శనం చేసి ప్రార్థించినా ప్రయోజనం వుంటుందా? ఆ శపథానికీ, పట్టుదలకీ యీ దారుణ వ్యాధికూడా తోడు కానా?...... దీని కంతకీ విప్రకృష్టకారణం జక్కులదీవి రాజపుత్రికా, సుబుద్ధి అయ్యవారా?.......ఎవ రయినా వొకటే.

సారంగధరుడు ముందుకి అడుగు వేస్తాడు. రెండు మళుపులు తిరిగాటప్పటికి చిలక కనపడుతుంది. స్నానం చేసి, కేశపాశం జారుముడి వేసుకుని, పట్టుచీర ధరించివుండి, పువ్వులుకోస్తూ వుంటుంది చిలక. ఒకర్నొకరు చూసుకుని

యిద్దరూ చకితులవుతారు. చిలక, వెంటనే దిటవు తెచ్చు కుని. పూలసజ్జ కిందవుంచి, సారంగధరుడికేసి తిరిగి వంగి రెండు చేతులతోనూ నేల అంటి కళ్ల కద్దుకుని, చేతులు కట్టుకుని నుంచుంటుంది.

సారంగధరుడు: (సందేహిస్తూనే) ఎవరు?

చిలక: (సవినయంగా) నేను జక్కులదేవి పరిచారికను మహా ప్రభూ! నాపేరు చిలక.

సారంగధరుడు: (మళ్లీ చకితు డవుతాడు.)

చిలక: మా అమ్మగారి పూజ నిమిత్తం పువ్వులు కోతా మని వచ్చాను మహాప్రభూ!

సారంగధరుడు: అయితే, నుంచుంటా వేమీ? ఇప్పటికే— (పొద్దుచూస్తూ) పొద్దెక్కిందే?

చిలక: దీనిక పొద్దెక్కడం అంటూ యేమిటి మహాప్రభూ? మా అమ్మ బ్రాహ్మముహూర్తానే ప్రారంభించి, జామున్నర పొద్దెక్కి దాకా పూజ చేస్తారు. నేను పువ్వులు పట్టుకు వెళ్లడాని కివాళ యిది మూడోమాటు.

సారంగధరుడు: అయితే, యింకా చాలామాట్లు పట్టుకు వెళ్లాలి కాబోలేం?

చిలక: ఈపాటికి కావలసినన్నీ తామరపువ్వులు వచ్చి వుంటాయి, యిక యివి పట్టుకువెళ్ల నక్కరలేదు మహాప్రభూ!

సారంగధరుడు: ఓహో, తామరపువ్వులున్నూ కావాలా?

చిలక: కావాలి మహాప్రభూ! పొద్దు పొడిచింది మొదలూ, సాయంత్రం మళ్లీ పొద్దుగూకేదాకానూ తామరపువ్వులతో పూజ.

సారంగధరుడు: రాత్రికూడా పూజ చేస్తారా వారు?

చిలక: చేస్తారు మహాప్రభూ! సూర్యాస్తమయం అయింది మొదలూ, తెల్లవారగట్ట సూర్యోదయం అయ్యేదాకానూ కలవ పువ్వులతో—

సారంగధరుడు: మరి యీ భిన్నజాతుల పుష్పాలకు సమయం?

చిలక: ఉభయవేళలా తామర పువ్వులతోటీ, కలవ పువ్వుల తోటీ కలిపి చెయ్యవచ్చు యీ పుష్పాలు. కుంకుమకూడా—(అర్ధోక్తి)

సారంగధరుడు: ఓహో!

చిలక: అదీ అగత్యమే మహాప్రభూ! కొంతసేపు ప్రత్యేకంగా కుంకుమతోనే పూజ.

సారంగధరుడు: కుంకుమా, కలవపువ్వులూ, వాటికి సాయం యివీ- రాత్రి చాలా పొద్దుపోతుందేమో?

చిలక: జామున్నర రాత్రిదాకా పూజ జరుగుతూనే వుంటుంది మహాప్రభూ!

సారంగధరుడు: అంటే, తెల్లవారగట్ల జాము రాత్రివేళ అయినా లేవాలి మళ్లీ రాత్రి రెండు జాములకుగాని భోజనాదికం—(అర్ధోక్తి)

చిలక: భోజనాదికం అంటే, రాత్రి నివేదిత క్షీరాన్నం వొకటే పుచ్చుకోవాలి మా అమ్మ. అవసరం అయితే ఫలాలు మాత్రం (మాట తేల్చేస్తుంది)

సారంగధరుడు: శివశివా!

చిలక: రాత్రి అయినా, బడలికవల్ల పగలయినా, పైటకొంగు పరుచుకుని కటికినేలమీదనే పడక మహాప్రభూ!

సారంగధరుడు: (చెవులు మూసుకుని) శివా!. . . శివా!

చిలక: (సాకూతంగా చూస్తుంది)

సారంగధరుడు: (జ్ఞాపకం చేసుకుంటూ)

శ్లో. "అనన్య శయ్యా పరివర్తనచ్యుతై
స్స్వకేశపుష్పై రపి యా స్మ దూయతే,
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థండిల ఏవ కేవలే"

అని, కాళిదాసుగారు వర్ణించిన పార్వతీ అమ్మవారి తపశ్చర్య జ్ఞాపకం వస్తోంది.

చిలక: పార్వతీఅమ్మవారిది తపస్సు, మా అమ్మది వ్రతం.

అంచేత, యిక్కడ పంచాగ్ని మధ్యం మొదలైనవి లేవు: గాని—(అర్థోక్తి)

సారంగధరుడు: ఇది మాత్రం యేమంత తక్కువా? ఉభయ వేళలా స్నానం—(అర్థోక్తి)

చిలక: వేడినీళ్లు పనికిరావు మహాప్రభూ, చన్నీళ్ళతోనే స్నానం.

సారంగధరుడు: శివా!.... ...చన్నీళ్ళతో స్నానమా? జాముల కొద్దీ పూజా? ఏకభుక్తమా? ఏ కొద్దిగడియలు మాత్రమో నిద్రా? అదయినా కటికినేలమీదా? ఒక్క దినం— (అర్థోక్తి)

చిలక: ఒక్కదిన మేమిటి మహాప్రభూ! "షాణ్మాసికస్థండిల సావిత్రీగౌరీవ్రతం" కదా యిది?

సారంగధరుడు: (చకితుడై) షాణ్మాసికమా?

చిలక: అవును, ఆరుమాసాలు మహాప్రభూ!

సారంగధరుడు: ఆరుమాసాలా యీ దీక్ష?

చిలక: అవును మహాప్రభూ!

సారంగధరుడు: ఇదేదో పెద్దదీక్షగా కనపడుతోంది.

చిలక: పెద్దదీక్ష కాకేం మహాప్రభూ? పెద్దకోరికతో పూనుకున్నప్పుడు సామాన్యదీక్ష యెలా పనికివస్తుంది మహాప్రభూ?

సారంగధరుడు: అయితే, యెప్పణ్ణుంచీ యిదీ?

చిలక: దీక్షాస్వీకారం అక్కడా, వ్రతారంభం యిక్కడానూ! అంటే వచ్చిన ఉత్తరక్షణమందే, అఖండగౌతమీ పావనోదకం కోటిలింగాలక్షేత్రంనుంచి బాపనమ్మవార్లచేత తెప్పించుకుని, స్నానంచేసి పూజాప్రారంభంచేశారు మా అమ్మ.

సారంగధరుడు: (మళ్లీ చకితు డవుతాడు)

చిలక: (బోధపడ్డది అన్నట్టు తల పంకిస్తుంది)

సారంగధరుడు: అయితే, వారి కింత కఠోర వ్రతం వుపదేశించి నడిపిస్తున్న గురువెవరూ?

చిలక: గురువేమిటి మహాప్రభూ? మా ప్రభువంశంలో అనుపూర్వకంగా వస్తున్న సంప్రదాయం యిది. పూజ సొంతంగానే

చేసుకోవాలి. కాకపోయినా, సాయంత్రం పూజా ప్రయత్నాలు ప్రారంభమయింది మొదలు ఉదయం పూజ ముగించుకుని, వ్రత కల్పంలో మూడధ్యాయాలచొప్పున పారాయణ చేసుకుని, అప్పుడు భోజనంచేసి, విశ్రమించి లేచీదాకా మా అమ్మని పురుషు లెవరూ—— చంటిపిల్లలుకూడా చూడగూడదు గదా, యిక గురువుగారు దగ్గిర వుండడాని కెలాగ మహాప్రభూ?

సారంగధరుడు: (నిర్విణ్ణుడై) ఆః ఆః

చిలక: అవును మహాప్రభూ!

సారంగధరుడు: (చూసిచూసి) ఎంతెంత దీక్షాపరులయినా వున్నారు జగత్తులో.

చిలక: అత్యంత క్లిష్టాలైన ఫలితా లుండేటప్పుడు, అంతంత దీక్షలుమాత్రం వుండవా మహాప్రభూ!

సారంగధరుడు: (తటాలున ఏదో అడగబోయి, అంతలో మానేసి, మార్చి) ఉండకేం? మునికన్యలున్నూ యిలాంటి దీక్ష పూని నట్టు కనబడదు. దీనివల్ల చళుక్య కులదేవతలున్నూ వరదు లవుతారు.

చిలక: (సాకూతంగా చూస్తూ) మా నమ్మకమున్నూ అదే మహాప్రభూ!

సారంగధరుడు: (ఆలోచనలో పడతాడు)

చిలక: (ఆలోచన పుట్టింది అన్నట్టు తల పంకిస్తుంది)

సారంగధరుడు: (చూసిచూసి) అయ్యో, నా మూలాన చాలా ఆలస్యం అయిందే. పాపం, తొరగా వెళ్లు.

చిలక: సెలవు మహాప్రభూ!

యథాప్రకారంగా మళ్లీ నమస్కరించి పూలసజ్జ అందుకుని, వెనక్కి తిరిగిచూస్తూ చిలక వెళ్లిపోతుంది.

సారంగధరుడు: (జ్ఞాపకం చేసుకుంటూ) తెరలోపలి మని షిని చూసినట్టు-స్వప్నంలో విన్నట్టు అదేమి వ్రతమూ! అదేమి దీక్షా? రాత్రికి రాత్రి అంతా కాక - ఉభయసంధ్యల్లోనూ కాక - పగలు కూడా చాలాభాగం, పురుషులెవరూ-పురుషశిశువులున్నూ వారిని చూడగూడ

దుట. ఇక మిట్టమధ్యాహ్నంమాత్రమే చూడవచ్చునా? ఆ సమయాన కూడా నియమనిషేధా లేమయినా వుంటాయేమో? ఆరుమాసాలా యీ దీక్ష? ఈ కఠోరదీక్షలో భర్తకూడా పురుషుడికిందే—(నవ్వు ఆపుకుని) భర్తకూడా చూడగూడదా? క్షీరాన్నం వొకటే రాత్రి ధారకం. ఆ పైని స్థండిలశయనం. ఇంకెక్కడి భర్త? ... దీనికి ఫలం? మాట ఆపుకున్నాను నయమే, అడిగితే యెంత తప్పు! . . కాని, నిండు యౌవనమే! కొత్తపెళ్లికూతురే! ఇదంతా యేమిటి? చక్రసామ్రాజ్యాధీశ్వరి తపస్సు చేసి కాని పొందలేని ప్రాప్యమున్నా మరొకటున్నదా? ఈ వ్రతం బాబయ్యగా రెలా అంగీకరించారూ? మహారుద్రయ్యగారున్నూ యెలా అంగీకరించారూ? వారిని చేపట్టిన్నీ నిరుత్సాహంగానే కనపడుతున్నారే బాబయ్యగారు, దాని కిదా కారణం? ఈ వ్రతం రహస్యమా, బహిరంగమా? (విసుగ్గా) నాకెందుకీ గొడవ? నా యాతన కంటంలేదు గదా? కాకపోయినా నా దీక్ష మాత్రం తక్కువదా? యౌవనవ్యగ్ర అయివుండిన్నీ వొకానొక అబల యింత కఠోరదీక్ష పాలించుకుంటున్నదే, పురుషుణ్ణిగదా, నే నెంత దీక్ష పాలించుకోవాలి? .......(నాలు గడుగులు ముందుకి వేసి నాలుగు దిక్కులూ కలయచూస్తూ) ఈ పూలతోట—యీ మిసమిసలు—యీ కుసుమసౌరభాలు—ఈ భ్రమరఝుంకారాలు—ఈ యౌవనోద్వేగం— ఈ చిత్తక్షోభ. . . . . . నే నెక్కడికిపోతున్నానూ? ఏమయిపోతున్నానూ? (గుండెలు పిసుక్కుంటూ) ఇది ధర్మపరీక్షా, దావానలజ్వాలా విజృంభణమా? పాపికొండల సంఘటన యేమి? నాటి ఆశలూ ప్రతీక్షలూ యేమయిపోయినవి? నేటి యీ విలయాని కవధి యేమిటీ?— (నిదానించి)—ఛీ! అప్పు డానిగ్రహం యేమిటి, యిప్పుడీ ఉద్వేగం యేమిటి? (తూలిపడుతూ వెళ్లి పక్కనున్న తిన్నెమీద కూచుని, జలదరించుకుంటూ) శ్శివోహం ... శ్శివోహం.... శ్శివోహమ్మ .... ..
(కళ్లు మూసుకుంటాడు)

# పదిహేనో రంగం

చిత్రాంగి నగరు. సాయంత్రం యేడెనిమిది గడియల పొద్దు వేళ. పూలతోటలోకి చూస్తూ ఉత్తరపు వసారాలో, కిటికీదగ్గిర నుంచుని వుంటుంది చిలక. నెమిలి వన్నె పావురంతో, ఆడుకుంటూ, గోడకి ఆనుకుని ఉత్తరాభిముఖంగా రత్నకంబళీమీద కూచుని వుంటుంది చిత్రాంగి.

చిత్రాంగి: (గునుస్తూ పావురంతో) నీకు బొజ్జ నిండింది. యిక వొక్క క్షణమయినా యింటిపట్టున వుండవు. మళ్లీ దీపాలు పెట్టాకే నీదర్శనం. రాజమహేంద్రపురం నీళ్లు నీకు బాగా వొంట బట్టాయి. నా వూసే అక్కర్లేకపోతోంది నీకు. మీ అమ్మని చూడూ, వొక్క క్షణ మయినా నన్ను విడిచి వుంటోందా?

చిలక: (వెనక్కి చూస్తూ) దాని వయస్సు మళ్లిపోయింది కదా, యిక యెక్కడికి వెడుతుంది తల్లీ?

చిత్రాంగి: (పావురంతో) మరి నాకు? నేనూ నీలాగే నవ యౌవనంలో వున్నాను కదా, నన్ను విడిచి వెడుతూ వుంటావా? నేనక్కర్లేదూ నీకు? మొన్నటిదాకా నువ్వెక్కడి కేనా వెళ్లి యెరుగుదువా? నిన్నెవరు మార్చేశారూ యిలాగా?

చిలక: (వెనక్కి చూస్తూ) ఎవరో దీన్నే మార్చేశారన్నమాటేమిటీ, ఇదే మార్చేసిం దేమో ఆ "యెవర్నో"?

చిత్రాంగి: (పావురంతో) అవునా? అలా చేశావా? చెప్పు నువ్వంతదానవు కావనా? నీకు కొత్తచూపు లబ్బాయి. నీ నడకే! మారిపోయింది.

చిలక: (వెనక్కి చూస్తూ) ఆ కూజితం యెంత సాకూతంగా వుంటోందో చూడ్డం లేదూ తల్లీ?

చిత్రాంగి: (పావురంతో) అవునవును. నీ కూజితంలో యేదో

కొత్త మాధుర్యం పుట్టి నన్ను ముగ్ధురాలిని చేసేస్తోంది. అది నాకు నేర్పవూ ?

చిలక : (వెనక్కి చూస్తూ) మీకు నేర్పడానికే అది బాగా సాధన చేసుకుంటోంది, తొందరపడకండి తల్లీ ?

చిత్రాంగి : (పావురంతో) నిన్న కాక మొన్న పుటావు, యిరవైయేళ్లు నిండిన నాకు గురువుగారి వయిపోతావు. అవునా ?— (ముద్దు పెట్టుకుని గునుస్తూ) అవునా ? (దాని కళ్లల్లోకి గంభీరంగా చూసి రొమ్ముకి అదుముకుని) ఎటు చూసినా నువ్వే నయం. వారి నగరికి వెడుతున్నావుట. వారి లాలనభాగ్యం అనుభవిస్తున్నావుట. వారి పావురంతో జత కట్టుకున్నావుట. ఏం ? కట్టుకున్నావా ?

చిలక : (చేతులు చాపుకుని చిత్రాంగికేసి వస్తూ ఆత్రంగా) అమ్మా అమ్మా, సారంగధరులు—సారంగధరులు —(అర్ధోక్తి)

చిత్రాంగి : (ఆశ్చర్యంగా) ఏమిటీ ? (పావురం విడిచిపెట్టేసి లేచి) దయచేస్తున్నారా ?

చిలక : (కిటికీకేసి చూపిస్తూ) తొరగా — తొరగా—(పొడివి పట్టుకుని చిత్రాంగిని కిటికీ దగ్గరికి తీసుకువెడుతుంది)

చిత్రాంగి : (పొంగిపోతూ కిటికీలోనుంచి చూసి, మళ్లీ అంతలో కుంగిపోతూ తటాలున వెనక్కి మళ్లుతూ) శివశివా ! ఏల్నాటి శని విడిచిపెట్టలేదు కదే ? (గోడకి చేరబడుతుంది)

చిలక : (చిత్రాంగిని పట్టుకుని లాలనగా) అది పోనీండి తల్లీ, మూడేళ్లకి మళ్లీ యివాళ దర్శనం, వొక్కమాటు కళ్లనిండా చూసుకోండి మామ్మా !

ఇద్దరూ వెళ్లి కిటికీదగ్గిర పరాసగా నుంచుంటారు. చిలక, మందహాసం చేస్తూ చిత్రాంగికేసీ కిటికీకేసీ విడిచి విడిచి చూస్తూ వుంటుంది. చిత్రాంగి మొగం వికసిస్తుంది.

చిలక : ఆ నడక చూడండి తల్లీ ! మనస్సు చెదిరిపోవడం లేదూ ?

చిత్రాంగి: (అవు నన్నట్టు చిలకకేసి మురుస్తూ చూసి మళ్లీ కిటికీలోకి చూస్తుంది.)

చిలక: ఆ చెట్టు చాటయిన ట్టుంది, యిలా రండి తల్లీ, యిక్కడికి బాగా కనపడుతున్నారు.

ఇద్దరూ స్థానాలు మారతారు.

చిత్రాంగి: ఆ ధనుర్బాణా లేమిటే? అవెందుకే?

చిలక: నేను చెప్పాలా అమ్మా? ప్రేమోన్మాదంతో కుమిలిపోతూవున్న వొకానొక త్రిభువనసుందరికి మళ్లీ సాక్షాత్కరించే టప్పుడు మన్మథుడు తన శరశరాసనాలు విడిచి వస్తాడా?

చిత్రాంగి: (మురిసిపోయి, నునుసిగ్గుతో చిలక బుగమీద ఇటే అని, మళ్లీ కిటికీలోకి చూస్తుంది)

చిలక: పూవుటీరం అడ్డం వచ్చిన ట్టుంది, యిలారండి అమ్మా!

మళ్ళీ యిద్దరూ మారతారు.

చిత్రాంగి: ఇలా చూస్తున్నారు, కదూ?

చిలక: అవును తల్లీ! (కిటికీలోకి చూస్తూ చప్పట్లు కొడుతుంది.)

చిత్రాంగి: (చిలక చేతులు పట్టుకుని) శని, శనిగా డున్నాడు, వింటాడే, పాముచెవులు సుమా!

చిలక: ఇంకా చూస్తూనే వున్నారు, చూడండి తల్లీ!

చిత్రాంగి: (చూస్తుంది)

చిలక: కొంచెం వికసించిన తామరపువ్వులాగ ఎంత మనోహరంగా వుందో ఆ మొగం? ........ అయితేనూ, (చిత్రాంగిని బుజం తట్టి గంభీరంగా చూస్తూ) చంద్రకిరణాలకి తామరపువ్వు వికసించడం యెక్కడేనా కద్దా తల్లీ!

చిత్రాంగి: (చిలక బుగ్గమీద పొడుస్తుంది)

చిలక: అదిగో, అదిగో, వోరచూపులు చూస్తున్నారు, చూడండి.

చిత్రాంగి : గొజ్జంగి పువ్వులకోసమే ఆ చూపూ, మనకోసమా? అదిగో,అవి తునిమి చేతి కిచ్చి ఛాయాగ్రహం తీసుకుపోతోంది.

చిలక : అవునవును. (ఆత్రంగా) కాదు కాదు.

చిత్రాంగి : కాదు, నిజమే, మళ్లీ ఆగారు. మళ్లీ చూస్తున్నారు.

చిలక : (ఆత్రంగా) అయ్యవారు కూడా చూస్తున్నారు, (కిటికీకి తానొకవేపుకి తప్పుకుంటూ, చిత్రాంగిని రెండోవేపు తోస్తూ) తప్పుకోండి, తప్పుకోండి.

ఇద్దరూ వొక్క క్షణం యెడంగా వున్నాక, చిలక తొంగి చూస్తుంది.

చిలక : మళ్లీ బయలుదేరారు, రండి.

ఇద్దరూ చూస్తారు

చిత్రాంగి : ఆ నడకలో యెంత భేదం వుందో చూడూ. ఆ మూర్తి మంతంలోకూడా యెంత వార కనపడుతోందో—మదగజమూ, గుంట నక్కా — (అర్థోక్తి)

చిలక : అంతే అంతే, ఉండుండి మదగజానికి హఠాత్తుగా రోషం వస్తుంది. అప్పుడు గుంటనక్క వొక్క కాలికిందికేనా చాలదు.

చిత్రాంగి : ఎప్పటి మాటా ?

చిలక : అది తేలకే మనకి ఆందోళన; కాని (చిత్రాంగి గడం పుణుకుతూ) మీ కోరిక నెరవేరుతుంది తల్లీ! బెంగవద్దు నా కూనా!

చిత్రాంగి : (చిలక రెండుచేతులూ పట్టుకుని) నేను చేసుకున్న పాపం కాకపోతే, ఛాయాగ్రహం బిడ్డలతండ్రి అయి కులకడం యేమిటీ, గ్రహరాజు బ్రహ్మచారిగానే వుండిపోడం యేమిటి?

చిలక : (చూస్తూ వూరుకుంటుంది)

చిత్రాంగి : నామీదే ప్రీతి పుట్టలే దనుకోనా, ఆడ దంటేనే వారి కింకా అర్థం కాలేదనుకోనా? పోనీ, అది పిగ్గంటావా, నిర్లిప్తత అంటావా ?

చిలక: నిర్లిప్తులు కావడానికి వారేం శ్రీశుకులా తల్లీ? మొగరాజుకి సిగ్గంటే మాత్రం యేమిటీ?

చిత్రాంగి: మరి యిదంతా యేమి టంటావూ?

చిలక: నిగ్రహమూ, దానికంటే యెక్కువగా గాంభీర్యమూ వారికి సహజా లయి వుంటాయి. ఆపైని, తండ్రిగారి దౌర్జన్యం—(అర్ధోక్తి)

చిత్రాంగి: తండ్రి. (పక్కకి చూస్తూ, రోషంగా) తండ్రిట తండ్రి, యముడు.

తెరలో

చిలకా!

చిలక: (గుమ్మంకేసి చూస్తూ) ఆ, రావచ్చు.

వగర్చుకుంటూ రుక్కు వస్తుంది.

చిత్రాంగి: (ఆతుర్దాగా) ఆ వగ ర్పేమిటే? ఏం జరిగిందే?

చిలక: (రుక్కుతో) పరుగుపరుగున వచ్చావా? ఏదేనా విడ్డూరం—(అర్ధోక్తి)

రుక్కు: విడ్డూరమే, కాకేం?

చిత్రాంగి: ఆపత్తా?

రుక్కు: ఆపత్తు కాదమ్మా సంపత్తే.

చిలక: అయితే, ముందు ముక్తాయించెయ్యి. తరవాత సావకాశంగా వివరాలు చెప్పవచ్చు.

రుక్కు: మహారాజు...... పోల్నాడు .. ...మండలేశ్వరుల సామార్తకూ.... సారంగధరులవారికీ ..... వేట నెపాన ..... సంధానం—(అర్ధోక్తి)

చిత్రాంగి: (నిర్విణ్ణ అయి చిలకకేసి చూస్తూ) ఆ!

చిలక: సరే, సంధానం కల్పించారు. తరవాతా?

రుక్కు: ఆ యిద్దరూ పందివేటలో ......తారసిల్లి...... కలియబడి ... ...వుమ్మడిగా పందిని పొడిచి. .....చివరకి...... చెల్లాయీ అంటే—(అర్ధోక్తి)

చిత్రాంగి: (గుండెలమీద చెయ్యివేసుకుని చిలకతో) అమ్మయ్యా!

చిలక: మరేమనుకున్నారు తల్లీ?

రుక్కు: అన్నయ్యగారూ అంటూ.........(అర్ధోక్తి)

చిత్రాంగి: బతికాం. ఇక చాలు. (రుక్కు భుజాలు తట్టుతూ) వెళ్లి శ్రమతీర్చుకో పాపం.

రుక్కు వెళ్లిపోతుంది.

చిలక: ఇది గొప్ప శుభసూచన.

చిత్రాంగి: మరి పర్యవసానం?

చిలక: (చిత్రాంగి గడ్డం పట్టుకుని బతిమాలుతూ) తొందర పడకండి తల్లీ! నేను కనక బతికి వుంటే, యీ గడువులోపల మీ యిద్దర్నీ కలిపితీరతాను మాఅమ్మా!

తెరలో

చిలకా!

చిలక: (గుమ్మంకేసి చూస్తూ) ఆ, రావచ్చు.

కొంచెం వగర్పుతో రుక్కు మళ్లీ వస్తుంది.

రుక్కు: (వస్తూనే) మహారాణీ పరిచారిక . గౌరి... . వచ్చి—(అర్ధోక్తి)

చిత్రాంగి: (ఆశ్చర్యంతో) గౌరా? (చిలకతో) ఎందుకో?

చిలక: (రుక్కుతో) ఒక్కర్తేనా?

రుక్కు: మరో నలుగుర్ని ... వెంటపెట్టుకుని.... ఏదో కానుకలు—(అర్ధోక్తి)

చిత్రాంగి: (చిలకతో) కానుకలా?

చిలక: మీరు కూచోండి తల్లీ! (చిత్రాంగిని తీసుకువెళ్లి తివాసీమీద కూచోపెడుతూ రుక్కుతో) తీసుకురావే.

చిత్రాంగి బాలీసుకి చేరబడి కూచుంటుంది. రుక్కు, గౌరినీ మరో నలుగురు పరిచారికలనూ తీసుకు వస్తుంది.

తన వస్త్రాలిలా వుండిన పళ్లేలు చిత్రాంగి సమీపంగా చేతులతో నేలఅంటి కళ్ళకద్దుకుని చేతులుకట్టుకుని ంచుంటారు.

గౌరి: (చిత్రాంగితో) ఒక గొప్పపనివాడు తన నేర్పంతా పిస్తూ ఆయి పట్టుచీరలు నేసి తెచ్చి మహారాణీవారికి సమర్పించు న్నాడు (అంజలి బంధంతో పళ్లెంలో వున్న చీరలు చూపిస్తూ) టిలో యివి మేలిరకం. శుభాశీస్సులతో సంవత్సరాది కానుకగా మకు పంపించా రమ్మా మాఅమ్మ.

చిలక: మహాప్రసాదం.

చిత్రాంగి: మహాప్రసాదంగా శిరసావహించా నని వారితో న్నవించు. (ఆ చీర్లలో వొకటి చేత పుచ్చుకుని) కళ్ల కద్దుకుని ంచుకుంటాననిన్నీ విన్నవించు. మరిన్నీ, యిప్పుడే దర్శనం కుని పాదసేవ చేసుకుంటా నని కూడా మనవిచెయ్యి.

గౌరి: (అంజలిబంధంతో) చిత్తం అమ్మా!

చిత్రాంగి: చిలకా!

చిలక: చిత్తం అమ్మా!

రుక్కు పళ్లెంతో తాంబూలాలు తెస్తుంది. చిలక అవి వొక్కొక్కరికే మహారాణీ దాసీల కిస్తుంది.

గౌరి: (మోడ్పుకేలితో) సెల విప్పించండి అమ్మా!

చిత్రాంగి: మంచిది.

గౌరీ, తక్కినవాళ్లూ మళ్లీ యథాపూర్వంగా నమస్కారాలుచేసి, వెనక్కివెనక్కి తగ్గుతూ వెళ్లిపోతారు.

చిలక: (రుక్కుతో) దర్శనం చేసుకుంటున్నామని అలివేలు మంగనీ, భ్రమరక్కనీ పంపి మహారాణీకి వర్తమానించు.

రుక్కు: మంచిదమ్మా! (వెళ్లిపోతుంది)

చిత్రాంగి: (చిలకతో) మహారాణీ వుద్దేశం యేమి టంటావే? మన సంగతి గుర్తించివుంటారా వారు?

చిలక : అలా అనుకోడానికి వీలులేదు తల్లీ ! ఎవరినీ ద్వేషించకపోవడమూ, భర్తగారిని త్రికరణయా అనుసరించడమూ వారి ప్రవృత్తి. జక్కుల దీవిలో వున్నప్పుడే వారిని గురించి మనం యెన్ని కథలు వినలేదూ ?

చిత్రాంగి : (చూసిచూసి డగ్గుత్తికతో) నేను పాపాత్మురాలిని.

చిలక : (చిత్రాంగిని పట్టుకుని లాలిస్తూ) అలా అనుకోవద్దు తల్లీ !

చిత్రాంగి : (రెండుచేతులతోనూ మొగం కప్పుకుని దుఃఖిస్తూ) ఎప్పటికయినా ఆ మహాయిల్లాలికి కోడల్ని కాగలనో లేనో !

చిలక : (చిత్రాంగి చేతులు తప్పించి తన చెంగుతో ఆమె కళ్లు తుడుస్తూ) దుఃఖించవద్దు. మీ కోరిక తప్పకుండా నెరవేరుతుంది. మహారాణీ మిమ్మల్ని కన్నకూతురు కంటేనూ యెక్కువగా చూసుకుంటారు, నా మాట నమ్మండి.

చిత్రాంగి : నీ మాట నమ్ముకునే నేను బతికి వున్నాను. "అత్తయ్యగారూ" అని నోరారా పిలుస్తూ వారి పాదా లెప్పుడు సేవించుకుంటానో—(తాను కూడా తన కళ్లు తుడుచుకుంటుంది)

చిలక ; ఈ వసంతంలోనే మీ కా అదృష్టం పడుతుంది. తప్పకుండా పడుతుంది, ధైర్యంగా వుండం డమ్మా!

చిత్రాంగి : (లేస్తుంది)

చిలక : చీర ధరించండి, మహారాణీ ఆశీర్వచనాలు కూడా సంపాదించుకుని వద్దాము.

చిత్రాంగి : మరి పోల్నాటి రాజపుత్రిక కథ వినవద్దూ?

చిలక : విందురుగాని, విందురుగాని. పూజవేళ కావస్తోంది. మనం మహారాణీ నగరికి తొరగా వెళ్లాలి. ఆ కథ స్నానం చేస్తూ వినవచ్చు సావకాశంగా.

చిత్రాంగి : అయితే, వాటిలో నీకు నచ్చిన చీర పట్టుకురా.

చిత్రాంగి ముందు లోపలికి వెడుతుంది. ఏరియేరి వొక చీరా రైకా పుచ్చుకుని చిలక తరవాత వెడుతుంది.

# పదహారో రంగం

రాజరాజు నగరు. జాము న్నర పొద్దుంది. రాజరాజు బాలీసుకి ఆనుకుని, ఎదట మహారుద్రయ్య, మండెమీద కూచుని ఉన్నారు.

రాజరాజు: అప్పటి మాట చూసుకుందాం, యేర్పాట్లేమీ ముందే తగ్గించకండి మీరు. ఈ యెడమొగాలూ పెడమొగాలూ మధ్య కంటే, మహారణ్యాలలో క్రూరమృగాల మధ్య వుండడమే వులాసంగా వుంటుంది నాకు.

మహారుద్రయ్య: నా మనవి ఏమిటంటే—(అర్ధోక్తి)

రాజరాజు: జక్కులదేవి రాణీగారు తొరగా రమ్మన్నమాటే కాదూ మీరు చెప్పబోయేదీ?

మహారుద్రయ్య: అవును మహాప్రభూ!

రాజరాజు: వచ్చి ప్రయోజనం? ఆవిడగారు మొగం కనబడీ కనబడనట్టు తలుపుచాటున నుంచుని వుండడమూ—అదేనా, యే నాలుగు దినాల కొకమాటో గాని అనుగ్రహించకపోవడమూ. అప్పుడయినా, యేమడిగినా అధరం కదిలీకదలకుండా నోట గొణుక్కోవడమూ, దానిమీద దాసి అందుకుని, చిలవలూ పలవలూ పెంచి ఆ సంగతి నాకు చెప్పడమూ—ఇదే కాదూ సౌదభ్యం?

మహారుద్రయ్య: అందుకు వ్రత నియమా ల్లంఘించలేకపోవడమే—(అర్ధోక్తి)

రాజరాజు: మాట్టాడితే వ్రతం. ఏమంటే యేం బెడిసికొడుతుందో అని మనకీ భయమే. పోనీ, అలాగే కాగట్టండీ! ఇక మనం వూళ్లోవుంటే వొరిగిం దేమిటి, అడవిలో వుంటే లేకపోయిం మిటి?

మహారుద్రయ్య : మన పక్షంగా చూస్తే అంతే కావచ్చు : గాని వారి పక్షంగా చూస్తే —(అర్థోక్తి)

రాజరాజు : అబ్బా ! మీ ధోరణే మీదండీ. పోనీ, వారం దినాలలో కాదు, నాలుగైదు దినాలలో తిరిగివత్తాం, సరా?

మహారుద్రయ్య : చిత్తం చిత్తం, నాకు సంతుష్టి అయింది. అలా యేర్పాట్లు చేయిస్తాను.

రాజరాజు : చిట్టిని రప్పించండి.

మహారుద్రయ్య : చిత్తం. (ద్వారపాలికకేసి చూస్తూ) చిట్టీ!

రాజరాజు : మల్లప్ప కట్టుదిట్టంగా వుండగలడు కాదూ?

మహారుద్రయ్య : సందేహమేం? నీటిలో కూడా వాడు జాడలు తియ్యగలడు మహాప్రభూ !

చిట్టి వస్తుంది.

రాజరాజు : చిట్టీ!

చిట్టి : సెలవిప్పించండి మహాప్రభూ!

రాజరాజు : జక్కులదేవి రాణీగారి విషయమై నువ్వతి జాగ్రత్తగా వుండాలి. వారి సేవలో యేపాటి లోటు వచ్చినా మాట దక్కదు సుమా!

చిట్టి : చిత్తం. జాగ్రత్తగానే సేవించుకుంటాను మహాప్రభూ!

రాజరాజు : అంచెగుర్రాలెలాగా వుండనే వుంటాయి కనక, సైన్యంనుంచి కూడా తామరపువ్వులూ కలవపువ్వులూ వస్తూ వుంటాయి. అలా అని యిక్కడి యేర్పాట్లు తగ్గించడానికి వీలులేదు సుమా!

చిట్టి : చిత్తం చిత్తం.

రాజరాజు : పెద్దరాణీగారి విషయంలోకూడా నువ్వంత శ్రద్ధగానే వుండాలి, జ్ఞాపకం.........?

చిట్టి : ఉంది మహాప్రభూ! వారినీ భక్తిశ్రద్ధలతో సేవించుకుంటూ వుంటాను.

రాజరాజు : కిన్నెరసానీ, శేషశాయీ, రంగనాయికా........?

చిట్టి : వచ్చి సిద్ధంగా వున్నారు మహాప్రభూ!

ద్వారపాలిక : (రాజుతో) మహామంత్రిగారు—(అర్ధోక్తి)

రాజరాజు : రప్పించు. (చిట్టితో) దర్శనానికి వస్తున్నామని మహారాణికి వర్తమానించు.

చిట్టి : చిత్తం (వెళ్ళిపోతుంది)

మహారుద్రయ్య : మనం తిరిగి యెప్పుడు వస్తామో అది చిట్టి వీరన్నగారికి—(అర్ధోక్తి)

రాజరాజు : ఎందుకూ చెప్పడం? మరొకరికి మాత్రం యెందుకు తెలియనివ్వాలీ?

మహారుద్రయ్య : అదీ కావలసింది, చిత్తం చిత్తం.

చిట్టివీరన్న వచ్చి రాజు అంగుళినిర్దేశం చెయ్యగా, ఎదట మండెమీద కూచుంటాడు.

రాజరాజు : (చిట్టివీరన్నతో) నిన్న మనం అనుకున్న వన్నీ అలా చేయించారా?

చిట్టివీరన్న : అవన్నీ పరిష్కారం అయిపోయాయి మహాప్రభూ!

రాజరాజు : నారాయణభట్టుగారు కనిపించారా?

చిట్టివీరన్న : చిత్తం? వారి దర్శనం చేసుకునే వస్తున్నాను.

ద్వారపాలిక : తమ్ముడుగారూ, అబ్బాయిగారూ—(అర్ధోక్తి)
రాజరాజు : తోడితే.

చిట్టివీరన్న : వేములవాడ భీమకవిగారు దయచేసి వున్నారు మహాప్రభూ!

రాజరాజు : సంగతేమిటో తెలిసినదా?

చిట్టివీరన్న: వారింకా యీ ప్రాంతానే సంచారం సాగించు సంటున్నారు. ఇంతలో నాలుగు దినాలకిందట భట్టారకుల వ్యాధి ప్రకోపించినట్టు తెలిసి, వారిని చూతామనీ, ఏలినవారి దర్శనంకూడా— అర్థోక్తి)

రాజరాజు: చాలా సంతోషం. ప్రయాణపు తొందరలో వుండి పోయానని వారికి విన్నవించండి. వారికి ఆస్థానమర్యాదలన్నీ సరిగా జరిపిస్తూ వుండండి మీరు. నేను తిరిగి రాగానే దర్శనం చేసు కుందాము.

చిట్టివీరన్న: చిత్తం.

రాజరాజు: విడిది....

చిట్టివీరన్న: భట్టారకులవారి కోరిక చొప్పున వారి భవనం లోనే విడియించాను. పాలకీ, పరివారమూ కూడా యేర్పాటు చేయిం చాను మహాప్రభూ!

రాజరాజు: ఉద్ధృతం తగ్గి, భట్టారకులవారు భీమకవిగారితో మాట్లాడుతున్నా రన్నమాటే కదూ?

చిట్టివీరన్న: నీరసం తప్ప వారి కిప్పు డేమీ బాధలు లేవు మహాప్రభూ! ఉన్మాదలక్షణాలు కూడా దినాని కేగడియో రెండు గడి యలో తప్ప — (అర్థోక్తి)

రాజరాజు: భీమకవిగారి సాన్నిధ్యం వారికి స్వాస్థ్యం కలిగించ వచ్చు. నా వుద్దేశం కవిగారికి విన్నవించండి.

చిట్టివీరన్న: నారాయణభట్టుగారున్నూ యీ మాటే సెల విచ్చారు. తమ సెలవున్నూ విన్నవించి కవిగారిని మళ్లీ ప్రార్థిస్తాను ను.

రాజరాజు: నా అభిప్రాయం....(ప్రశ్నార్థకంగా చూస్తాడు)

చిట్టివీరన్న: బోధపడింది మహాప్రభూ!

మహారుద్రయ్య: (చిట్టివీరన్నతో) భీమకవిగారి సాన్నిధ్యం వల్ల, భట్టారకులవారికీ, స్వాస్థ్యం కలగడమే కాక, శపథానికి సంబంధించిన పట్టుదల—(అర్థోక్తి)

చిట్టివీరన్న: తెలిసింది.

విజయాదిత్యుడూ సారంగధరుడూ వస్తారు. రాజు వారి నిద్దర్నీ తనకి దగ్గిరగా కూచోబెట్టుకుంటాడు.

రాజరాజు: (చిట్టివీరన్నతో) నేను వచ్చేలోపున తొందర లేమయినా వస్తే తమ్ముడు సవరిస్తాడూ. (విజయాదిత్యుడికేసి చూస్తాడు)

విజయాదిత్యుడు: చిత్తం.

చిట్టివీరన్న: (విజయాదిత్యుడికేసి చూస్తూ) చిత్తం.

రాజరాజు: (సారంగధరుడితో) నాయనా!

సారంగధరుడు: చిత్తం, బాబయ్యా!

రాజరాజు: భట్టారకులవారిని మరచిపోవద్దు సుమా!

సారంగధరుడు: మరచిపోను బాబయ్యా, త్రికాలాలయందూ వారిని సేవించుకుంటూ వుంటాను.

రాజరాజు: నీ సేవలే వారికి జీవగర్ర. వారి స్వాస్థ్యమే నీకు రక్షకం.

సారంగధరుడు: అది యెరుగుదును బాబయ్యా! అప్రమత్తుణ్ణయి వుంటాను.

రాజరాజు: చూడూ, వేములవాడ భీమకవిగారు దయచేసి వున్నారుట, సేవించుకుంటూ వుండూ.

సారంగధరుడు: చిత్తం, సేవించుకుంటాను బాబయ్యా!

చిట్టివీరన్న: (సారంగధరుడితో) భట్టారకులవారి భవనంలోనే వారి విడిది యేర్పాటయి వుంది, ప్రభూ!

సారంగధరుడు: మరీ సంతోషం.

రాజరాజు: (విజయాదిత్యుడితో) అబ్బాయీ నువ్వూ వెంటనే మాటు వెళ్లి కవిగారి దర్శనం చేసుకోండి.

విజయాదిత్యుడు: చిత్తం అన్నయ్యా!

రాజరాజు: (ఇంకేమిటీ అన్నట్లు చిట్టివీరన్నకేసి చూస్తాడు)

చిట్టివీరన్న: భీమవరంలో తటాక నిర్మాణమూ, ద్రాక్షారామ గోదావరిలో కల్యాణ మంటప నిర్మాణమూ పూర్తి అయినట్టు లు వచ్చాయి మహాప్రభూ! పావులూరి మల్లన్నగారు వెళ్లి ౦న చేసేటట్టు ఏర్పాట్లు చేశాను.

రాజరాజు: ప్రతిష్ఠ యేర్పాట్లున్నూ సాగించండి.

చిట్టి వస్తుంది.

చిట్టివీరన్న: పున్నమి వెళ్లిన పంచమినాడు మంచి రార్తం వుందంటున్నారు సిద్ధాంతులు.

రాజరాజు: (మహారుద్రయ్యకేసి చూస్తూ) పున్నమి వెళ్లిన ు——?

మహారుద్రయ్య: వ్యవధి చాలు మహాప్రభూ!

రాజరాజు: (చిట్టివీరన్నకేసి చూస్తాడు)

చిట్టివీరన్న: చిత్తం, ఆ ముహూర్తమే స్థిరపరిపిస్తాను.

రాజరాజు: (చిట్టికేసి చూస్తాడు)

చిట్టి: వేంచెయ్యవచ్చు మహాప్రభూ!

రాజరాజు చిట్టివీరన్న కేసీ, సారంగధరుడి కేసీ, ాదిత్యుడికేసీ వరాసగా చూస్తాడు. లేచి నమ్రులై వు'' అని చెప్పి వారు వెళ్ళిపోతారు.

రాజరాజు : (చిట్టితో) అన్నపూర్ణ వెళ్ళిన పని——?

చిట్టి : అయింది మహాప్రభూ!

రాజరాజు : (మహారుద్రయ్యతో) రాత్రి నిలవడం యెక్కడా?

మహారుద్రయ్య : మహానంది కొండకింద యిసకతిప్పమీద గుడారాలు వేయించాను ప్రభూ!

రాజరాజు : పట్టిసం కొండమీద భద్రకాళీ అమ్మవారిని సేవించుకునే వెడతాం కాదూ?

మహారుద్రయ్య : అదిన్నీ యేర్పాటు చేయించాను మహాప్రభూ!

రాజరాజు : (చిట్టికేసి చూస్తాడు)

చిట్టి : పాలకీ సిద్ధంగా వుంది మహాప్రభూ!

రాజరాజు : మహారాణీ దర్శనాని కివాళ నడిచే వెడదాము.

చిట్టి : చిత్తం.

రాజరాజు : నువ్వు పానీయం సిద్ధపరిచి వుండు.

చిట్టి : చిత్తం. (వెళ్ళిపోతుంది)

రాజరాజు : (మహారుద్రయ్యతో) పోలవరం వార్త వెళ్ళిందా?

మహారుద్రయ్య : ఇలా పోలవరం వార్త వెళ్ళింది, అలా దేవీపట్నంనుంచి విన్నపం వచ్చింది, యేమి చెయ్యడానికీ—— (అర్థోక్తి)

రాజరాజు : చెయ్యడాని కేం వుందీ, యీ జమిలిపుష్పాల అనుభవం మన కిక అవశ్యంభావే కదా, కానివ్వండీ.

మహారుద్రయ్య : (చిరునవ్వుతో) చిత్తం, వెళ్ళి ఆ యేర్పాటు చేయిస్తాను.

రాజరాజు చిట్టి వెళ్ళిన వేపుకీ, మహారుద్రయ్య మరోవేపుకీ వెళ్ళిపోతారు.

# పదిహేడో రంగం

రత్నాంగి నగరిలో సారంగధరుడి వాసగృహం. అప్పటికి జామున్నర పొద్దుంది. ఆంధ్రమహాభారతం ఆదిపర్వం చదువు కుంటూ, సారంగధరుడు పడకకుర్చీలో వాలివుంటాడు.

సారంగధరుడు: "ఏను దాశరాజు కూఁతుఁర, దండ్రి నియోగంబున నిక్కార్యంబు ధర్మార్థంబు సేయుచుండుదు ననిన దాని యభినవ రూప సౌందర్యంబులు దొల్లియు విని యెఱింగినవాడై యక్కోమలిం గామించి దాశరాజు కడకుం జని తన యభిప్రాయం బెఱింగించిన నతండును సంతసిల్లి శంతను నత్యంత భక్తిం బూజించి యిట్లనియె:

పుట్టినప్పుడ కన్యకఁ బోలునట్టి
వరున కిచ్చుట యిది లోకవర్తనంబు
వసుమతీనాథ నీయట్టి వరున కిచ్చి
ధన్యులమె గామె యిక్కన్య దద్ద పేర్మి.

అయినను నా డెందంబునం గలదానిం జెప్పెద నిక్కన్యక నీకు ధర్మపత్నిగా చేయునట్టి యిష్టంబు గలదేని నా వేడినదాని నిమ్మనిన శంతనుండు దాని నీనగునేని యిచ్చెదఁ గానినాఁ డీనేర నది యేది సెప్పుమనిన దాశరా జిట్లనియె:

భూపాల నీకు నిక్కోమలియందు బుట్టిన సుతుడు
నీ పరోక్షంబున రాజుగావలె నెమ్మి నిట్లీగ
నోపుదే యనిన శంతనుఁడు గాంగేయు య్యువరాజుఁ దలఁచి
యీ పల్కు దక్కఁగ నొండు వేఁడుమ యిచ్చెద ననిన.

నా కొండెద్దియు నిష్టంబు లే దనిన విని య ద్దాశరాజుచేతం బ్రతిహాత మనోరథుఁడయి క్రమ్మరి వచ్చి శంతనుండు చింతాక్రాంతుండయి

సత్యవతిన తలంచుచు వీతకార్యావసరుండయి యున్న నొక్కనాఁడు గాంగేయుండు తండ్రి పాలికి వచ్చి యిట్లనియె :

భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పగ నోపునట్టి శా
త్రవనివహంబు లేదు వసుధాప్రజ కెల్ల ననంతసంతతో
త్సవముల రాజు లెల్ల ననిశంబు విధేయులనీకు నిట్లు మా
నవవృషభేంద్ర యేలొకొ మనఃపరితాపము బొంది
యుండగన్.

అనిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి శంతనుండు గొడుకున కిట్లనియె :

వినవయ్య యేకపుత్రుడు
ననపత్యుడు నొక్క రూప యని ధర్మవులఁ
విని నీకుఁ దోడు పుత్రుల
ననఘా ! పడయంగ నిష్ట మయినది నాకుఁ.
జనవినుత ! యగ్నిహోత్రం
బును సంతానమును వేదములు నెడతెగగా
జన దుత్తమవంశజులకు
ననిరి మహాధర్మనిపుణు లైన మునీంద్రుల్.
నీవస్త్రశస్త్రవిద్యా
కోవిదుడవు రణములందు క్రూరుడ వరివి
ద్రావణసాహసికుండవు
గావున నీయునికి నమ్మగా నోప నెడఁ.

బహుపుత్రార్థంబు యత్నంబు సేయవలయు వివాహం బయ్యెద—"

అడవిలో, నదిలో, రేవుపడవ నడిపే పల్లెపిల్లను చూశాటప్పటికి మనస్సు చెదిరిపోయింది. నగరిలో, దేవాంశవల్ల జన్మించిన దేవవ్రతులవారిని చూశాటప్పటికి "ఉంటాడో వూడిపోతాడో" అని అపనమ్మకం కలిగిపోయింది. మహాధర్మనిపుణులైన మునీంద్రులు, ఇలాంటి సంఘటన త్రికాలాలలోనూ ఎప్పు డయినా రావచ్చు నని వూహించి, అది గొప్ప ధర్మసందేహం అయిపోగా, గోష్ఠిజరిపి తీవ్ర

పరిశోధనలు చేసి చివరికి మళ్లీ పెళ్లిచేసుకోవలసిన ఘట్టంగా స్థిరపరిచి ఆజాపించి వుంచారు. శంతనుమహారాజులుంగారికి, ఇది, విధాయకం అయిపోయింది.

ఔచిత్యం అక్కరలేదూ? . . .పోనీ, నిజంగా బహుపుత్రత్వమే ప్రధాన మయితే మరొక సుందరి పనికిరాదూ? ......తరిచి చూతగా, యీ సంప్రదాయం వృత్తరోత్తరాభివృద్ధిగానే కనపడుతోంది. అక్కడ, యయాతి మహారాజులుంగారు, కొడుకు యౌవనం స్వీకరించి, ఆ కొడుకును కన్నతల్లితోనే చిరకాలం క్రీడించారు. ఇక్కడ, శంతనుమహారాజులుంగారు, పెళ్లియీడు వచ్చి వున్న యేకపుత్రుడికి శాశ్వత బ్రహ్మచర్యం అంటగట్టి వారి పరిముఖంగానే కొత్తపెళ్ళి కూతుర్ని సంపాదించుకున్నారు. సరి, యిప్పుడు, నాయనగారు, మరో అడుగే ముందుకి వేశారు.

ఇది వంశాచారం అయిపోయిం దన్నమాట.... .. .. ఇది కాదు........మన వంశచరిత్రలో సూటిగా యిది మనకే సమన్వయిస్తోంది, మరోఘట్టం చదువుకుందాం. (కొన్ని పుటలు తిరగవేసి)

"యాదవకులవిభుడగు శూరుఁ డను నాతఁ
డాత్మనూజలయందుఁ బెద్ద
దాని నంబుజముఖి ధవళాక్షి వసుదేవు
చెలియలిఁ బృథ యను చెలువఁ బ్రీతి
దన మేన యత్త నందనుఁ డపుత్రుకుఁ డైన
యాకుంతిభోజున కర్థితోడఁ
గూఁతుగా నిచ్చినఁ గోమలి యాతని
యింటఁ దానుండి యనేకవిప్ర
వరుల కతిథిజనులకు నవారితముగఁ
దం(డ్రి)పని నిష్టమృష్టాన్నదాన మొనరఁ
జేయుచున్న దుర్వాసుఁ డన్సిద్ధమునియు
వచ్చె నతిథియై భోజనవాంఛఁ జేసి.

కుంతియు నమ్మౌని వరు కోరిన యాహారంబు వెట్టిన సంతుష్టుండై యమ్మునివరుం డిట్లనియె: నీమంత్రంబున నీ వెవ్వేని నొక్క

వేల్పు నారాధించి తద్వేల్పు నీకోరినయట్టి పుత్రకుల నిచ్చు నని యాప ద్ధర్మంబుగా నొక్క దివ్యమంత్రంబుఁ బ్రసాదించి చనిన—"

ఎక్కడి కెక్కడికీ సంబంధం? కుంతీఅమ్మవారు భక్తిశ్రద్ధలతో సపర్యలు చెయ్యడమూ ధర్మంగానే వుంది. దుర్వాసులు ఆ సేవలకు సంతుష్టులై ఆమెకి మంత్రోపదేశం చెయ్యడమూ వుచితంగానే వుంది, కాని యిదేమి వరమూ?........కోరిన దేవతలు దిగి రావడమూ, కోరిన కొడుకుల నివ్వడమూనా........ ఈ వింతవరాని కగత్యం యేమి వచ్చిందీ? ఇది కుంతీఅమ్మవారి కోరిక కాదే? ఆమె వరమే కోరుకో లేదే? దుర్వాసు లయినా యోగదృష్టితో పరిశీలించి ఆమె యిలా వువిలాటపడుతున్నట్టు గమనించ లేదే? వారికి, ఆ విధంగా, పరిశీలించ వలసిన ఆవశ్యకమున్నూ కలగలేదే? పైగా, కోరిన "భర" లభించడాని కయినా కాదే యీ వరము? ఇది భర్తవల్ల కాక, పైవారి వల్ల సంతానం కనమని ఆమెని ఆశీర్వదించడ ంఅయిందే? ఈడు వచ్చినిన్నీ యింకా పెళ్లి కాని కన్యకు యిలాంటి వరం దయచెయ్యడం, శీలభంగం చేసుకో మని ఆమెని పురికొల్పడం కాదూ? దీని వల్లనే, ఆమె అప్పటికప్పుడే శీలభంగం చేసుకోనే చేసుకున్నదే?.... ....... పోనీ, కుంతీఅమ్మవారి ప్రవృత్తి "సులభంగా శీలభంగం చేసుకునే మనిషి" అని గుర్తించడాని కనువుగా వుండినదా? అదే నిజమయితే దుర్వాసు లామె సేవలు తిరస్కరించవలెనే?

ఆపద్ధర్మంగా దయచేశా రట యీ వరం. ఏమిటా ఆపద? కుంతీఅమ్మవారి కిప్పుడీ వరం అనుగ్రహించకపోతే తరవాత సంతానం కలగదా?.. .....యమాదులవల్ల ధర్మరాజాదుల జననం ఆపద గడవ బెట్టడానికయితే మరి, భాస్కరులవారివల్ల కర్ణులవారి జననం యెందు కోసం అయినట్టూ? ......(విసుగ్గా) ఏమిటీ యీ ధోరణి యివాళా? క్షుభితమయిపోయిన మనస్సు కుదుటపరుచుకుందామని భారతం విప్పితే యిలాంటి సందేహపరంపర కలుగుతోం దేమీ? దీనివల్ల మనస్సు మరింత కలిగిపోవడంలేదూ?—(భారతం మూసేసి గుమ్మంకేసి చూస్తూ) ఎవరక్కడ?

ఒక పరిచారిక వస్తుంది.

పరిచారిక: నేనున్నాను బాబయ్యా!

సారంగధరుడు: గౌరిని పిలు.

పరిచారిక: చిత్తం బాబయ్యా!

పరిచారిక వెళ్ళిపోతుంది. సారంగధరుడు, భారతం, పక్కగా వున్న పీటమీద వుంచేసి ఆలోచిస్తూ వుంటాడు. ఇంతలో గౌరి వస్తుంది.

గౌరి: ఎందుకు బాబూ?

సారంగధరుడు: అమ్మగారి దర్శనం అవుతుందా?

గౌరి: తొందరగా కావాలా బాబూ?

సారంగధరుడు: వీలయితేనే.

గౌరి: ఇప్పుడు వీలు కాదు.

సారంగధరుడు: అలాగా?

గౌరి: ఐక్కలదీవి రాణీగారు దయచేసి వున్నారు బాబూ!

సారంగధరుడు: ఓహో, వారు దయచేసి వున్నారా?

గౌరి: బాబయ్య వేటకి వేంచేసినప్పణ్ణుంచీ, దినదినమూ, దయచేస్తూనే వున్నారువారు. దయచెయ్యడమే కాదు, అమ్మగారిని విడిచి, వోపట్టాన తమ నగరికి వేంచెయ్యలేకుండా వున్నారు కూడానూ.

సారంగధరుడు: అంత ఐకమత్యంగా వుంటున్నారూ వారిద్దరూను? చాలా బాగుంది. పోనీ, నేను బుల్లిబాబయ్యగారి దర్శనానికి వెడతాను, నువ్వు అమ్మగారి సన్నిధికి వెళ్లు.

గౌరి: మంచిది బాబూ!

గౌరి బయలుదేరుతుంది.

సారంగధరుడు: చూడూ, అమ్మగారి దర్శనానికీ—(అర్ధోక్తి)

గౌరి: (ఆగి, వెనక్కి తిరిగి) ఏమిటి బాబూ?

సారంగధరుడు: అమ్మగారి దర్శనానికీ, ప్రత్యేకంగా కారణం యేమీలేదు. ఒక్కమాటు దర్శనంచేసుకుని బయటికి వెడదా మను కున్నా నంతే.

గౌరి: సరే బాబూ!

సారంగధరుడు: సుబుద్ధి అయ్యవారు కనపడి, వాహ్యాళికి వెళ్లడం తటస్థపడితే నేను రావడం కొంచెం ఆలస్యం కావచ్చు. కనక, వేళ కాగానే అమ్మగారిని ముందు భోజనం చెయ్యమని మనవి చెయ్యి.

గౌరి: అలాగే బాబూ! (వెళ్లిపోతుంది)

సారంగధరుడు: ఏమిటిదీ? దినదినమూ దయచేస్తున్నారా? దయచేసి యిక్కణ్ణుంచి వేంచెయ్యలేకపోతున్నారా? బాబయ్యగారు వేటకి వేంచేసినప్పణ్ణుంచీనా యిది? కారణం? అమ్మగారి పాదాల దగ్గిర కింద కూచుని, నిన్న, యేదో మాట్టాడుతూ వుండినవారు వారే అయి వుంటారా? ఆ వినయానికి హేతువు? ఈ నడమంత్రపు కల్లోలం తట స్థించి వుండకపోతే సావిత్రీ అమ్మవారిని కాక, అమ్మగారినే పూజించు కుంటూ వుందురేమో వారు? ఆ భక్త్యాదరాలు చూసుకుని, సవతి అయినా అంత మురిసిపోతూ వుండిన అమ్మగారు, ఆమె కోడలే అయితే యెంత పొంగిపోతూ వుండేవారో? (విసుగ్గా) ఊ! ఇదంతా గతజలసేతుబంధనమూ, అసంభవప్రతీక్షనూ. (నాలు గడుగులు వేసి, అంతలో ఆగి) బుల్లిబాబయ్యగారీపాటికే మొగసాలకి వేంచేసి వుంటారేమోనే?........చూతాం.

వెళ్లిపోతాడు.

# పద్దెనిమిదో రంగం

రాజరాజు నగరికి వెనకా, పశ్చిమప్రాకారానికిచేరే వున్న పూలతోట. అయిదు గడియల పొద్దువేళ, సారంగ ధరుడు, మన స్త్రిమితం కోసం నడయాడుతూ వుంటాడు. స్నానం చేసి, పట్టుచీర ధరించి, పువ్వులకోసం వచ్చి, చిలక ఆ తోటలోనే తిరుగుతూ వుంటుంది. ఇద్దరూ వొక గొజ్జంగి చెట్టు దగ్గిర తారసపడుతారు. ఆ గొజ్జంగి చెట్టు చిటాచివర వొక పెద్ద పుష్పం వుంటుంది. అది చూసి, ముగ్ధ అయి, పూలసజ్జ వొకచోట వుంచి, చిలక అది అందుకోడానికి రెండుమూడుమాట్లు సుతారంగా యెగురు తుంది. ఆ సమయాన వస్తాడు సారంగధరుడు వెనక వేపుకి. చిలకను చూచి మొదట చకితుడయి తరవాత ఆమె కేసి చూస్తూ నుంచుంటాడు.

సారంగధరుడు: (చూసిచూసి) ఏమీ, పుష్పం అందడం లేదూ?

అదివిని చకితా, లజ్జితా అయి, నింపాదిగా సారంగ ధరుడి కేసి తిరిగి, యథాపూర్వకంగా నమస్కరించి సాకూ తంగా చూస్తూ వుంటుంది చిలక.

సారంగధరుడు: (ఒకమాటలాగా యిలాగా చూసి, దిటవు తెచ్చుకుని) పుష్పం అందడం లేదూ?

చిలక: అంద కేమీ, చివరికి అందుతుంది మహాప్రభూ, మొదట కొంచెం శ్రమ అంతే.

సారంగధరుడు: కొంచెమేమీ, చాలా శ్రమపడ్డావు పాపం.

చిలక: మా అమ్మ శ్రమ యెదట నా శ్రమ యేపాటిది మహాప్రభూ?

సారంగధరుడు: అవునవును. మీ అమ్మగారి శ్రమా గొప్పదే, ని శ్రమా గొప్పదే, అందుకు తగ్గట్టు పుష్పమున్నూ గొప్పదే.

చిలక: గొప్పది కనకనే నన్ను లక్ష్యపెట్టడంలేదు మహాప్రభూ అది. (మళ్లీ సాకూతంగా చూస్తుంది)

సారంగధరుడు: ముళ్లడొంకలో యిరుక్కుపోయి వున్నది కదా, దానిమీద నీ కంత ఆగ్రహం ధర్మమేనా?

చిలక: దాని పుట్టుకే ముళ్లడొంకలో కదా మహాప్రభూ, అది అంత కొమ్మెక్కి కూచోడం యేమి వింతా?

సారంగధరుడు: పోనీ, నేను కొమ్మ వంచుతాను, నువ్వు పుష్పం అందుకో. (వంచుతాడు)

చిలక: (ఆ కొమ్మ అందుకుని) ప్రభువులు మా శ్రమలో పాలుపుచ్చుకోడం చూస్తే, (కీగంటచూస్తూ) సావిత్రీఅమ్మవారు, మా అమ్మని తప్పకుండా అనుగ్రహిస్తారని—(పువ్వు చిదిమి పరీక్షిస్తూ) ఇంత పెద్ద పుష్పం నేనెక్కడా చూడలేదు. మహాప్రభూ! ఈ సంగతి వింటే మా అమ్మ పొంగిపోతారు. (సజ్జలో వుంచుతుంది)

సారంగధరుడు: (పరిశీలించి) ఆ వొక్క పుష్పమే వుంది, చెట్టంతా గాలించినా మరి లేవు.

చిలక: ఇంకెందుకూ, సజ్జ నిండిపోయింది. చాలు మహాప్రభూ!

సారంగధరుడు: కావలసిందే అది కదా?

చిలక: అవును మహాప్రభూ!

సారంగధరుడు: మరి వెళ్లు.

చిలక: నేను వెళ్లి మా అమ్మగారిని స్నానం చేయించి, పూజలో కూచోబెట్టి, మళ్లీ వస్తా నిప్పటికి సెలవిప్పించండి మహాప్రభూ!

సారంగధరుడు : ఇంకా స్నానం కాలేదా?

చిలక : నేనిలా వచ్చాను కదా. స్నానం యెలా అవుతుంది మహాప్రభూ? ఇదిగో వెడతాను. ఇక్కడేకదా నగరు —

చిత్రాంగి డాబామీద నుంచుని కనపడుతుంది.

చిలక : (చిత్రాంగిని చూస్తూ సారంగధరుడితో) అదుగో మా అమ్మ —

చకితుడై సారంగధరు డలా చూస్తాడు.

చిలక : నాకోసం కనిపెట్టుకుని వున్నారు సెలవు మహాప్రభూ!

జవాబుకోసం చూడకుండానే, మళ్లీ నమస్కరించి, సజ్జ అందుకుని బయలుదేరి, వొక పూవుటీరం మాటుచేసుకునివుండి, సారంగధరుడి యింగితం కనిపెడుతూ వుంటుంది చిలక.

సారంగధరుడు : (ఒక మాటు నాలుగు వేపులా పరకాయించి, మళ్లీ చిత్రాంగి కేసి చూస్తూ) ఎవర్ని చూస్తున్నట్టూ? ఆ చూపుల్లో యేమి వున్నదో తెలుసుకోవా లంటే దూరం అయిపోయిందే, యేమిటి దారి? శరత్కాల ధవళమేఘంలో మెరుపు మెరిసినట్టు, తెల్లని ఆ సమున్నత సౌధాగ్రాన ఆ బంగరు బొమ్మ మిలమిల మెరిసిపోతున్నది. మూడేళ్ళనాటి పాపికొండల సంఘటన నా మనస్సునూ నేటి యీ దూరదర్శనం నా చూపులనూ కలిచేస్తున్నాయి. నిలవరించుకోడం యెలాగా? (గుండెలు పిసుక్కుంటూ) దావానలం మళ్లీ రేగుతోం, దిక్కడ వుండగూడదు.

సారంగరుడు వడిగా వెళ్లిపోతాడు. తల పంకించి "దారికి వస్తున్నారు" అనుకుంటూ చిలక వెళ్లిపోతుంది.

# పంధొమ్మిదోరంగం

ఆ పూలతోటలోనే మరొక చోట. నాలుగు గడియల పొద్దుంది. చిత్రాంగి నగరికి మరికొంచెం దగ్గరగా, సారంగ ధరుడు పాలరాతి అరుగుమీద కూచునీ, సుబుద్ధి అరుగు ఆనుకు నుంచునీ వుంటారు. ఇద్దరూ దిగాలుపడిపోయినీన్ని వుంటారు.

సారంగధరుడు: రెండు మాసాల కిందట వుక్కుతునక. ఇవాళ పొట్టపండు. రోగంకాని రోగం భట్టారకులవారిని పీల్చేసింది.

సుబుద్ధి: మనోరోగాన్ని మించిన రోగం యేమిటి మహా ప్రభూ? ప్రతిభావంతులనే అది అలుముకుంటే యిక చెప్పడానికేం వుందీ?

సారంగధరుడు: మతి చలించినా జీవించి వుంటే, వారికి అవస్థే అయినా, వారి మీద ప్రాణాలుంచుకుని వున్నవారి కదొక సంతోషం; కాని, ఆ అదృష్ట మయినా తక్క దన్నట్టు చెబుతున్నారు మీరు.

సుబుద్ధి: చిత్తం, నారాయణభట్టుగారు వ్యవహారం అంతా పూటల్లో వుందని నిర్ధారణ చేసి కుమిలిపోతున్నారు. భీమకవిగారు "ఈశ్వరుడు లేడా? భట్టారకులవారి తపస్సంతా వ్యర్థమే అయి పోతుందా?" అని ధైర్యంగానే వున్నారు: కాని మా నాయనగారు మాత్రం—(అర్ధోక్తి)

సారంగధరుడు: వారే అలా అయితే యింకెక్కడి ఆశలూ? (కళ్లు తుడుచుకుని) తండ్రి తరవాత అంతటివారు. ఇప్పు డంతకంటే యెక్కువవారు; కాని వారు—నన్ను విడిచి—(దుఃఖోద్రేకంవల్ల యిక మాట్లాడలేక రెండు చేతులూ మొగం కప్పుకుంటాడు.)

సుబుద్ధి: (నిర్విణ్ణుడయి) ప్రభూ!
సారంగధరుడు: (మాట్లాడలేదు)
సుబుద్ధి: (అతని చేతులు పట్టుకోబోతూ) మహాప్రభూ!
సారంగధరుడు: (తన చేతులు తీసేసుకుంటూ) ఆ.
సుబుద్ధి: తమరే యిలా అయితే—(అర్ధోక్తి)

సారంగధరుడు: (కళ్లు తుడుచుకుంటూ) కాకుండా వుండడం యెలాగా? ఈ వ్యాధి నెమ్మదిస్తుందనీ, కొద్ది దినాల్లోనే వారు నాకు చిత్తశాంతి అనుగ్రహిస్తారనీ ఆశిస్తూ కాలం నెట్టుకుంటూ వచ్చాను. ఇప్పు డేమి దారీ?

సుబుద్ధి: తమకి తామే ధైర్యం చెప్పుకోవాలి. నేను చెప్ప గలవాణ్ణా తమకు?

సారంగధరుడు: (సుబుద్ధికేసి వొక్కమాటు అసంతృప్తిగా చూసి కొంచెం ఆవేగంతో) మీరు నాకు అంతరంగికులని అనుకు న్నాను. కాని నా స్థితిగతులయినా మీరు గుర్తించలే దన్నమాట. నా యాతన మీకు అర్ధమే కాలే దన్నమాట.

సుబుద్ధి: (పరితాపంతో) అయింది మహాప్రభూ, అర్థం అయింది. అంచేతనే తమర్ని చూస్తే నా మనస్సు చెదిరిపోతోంది. మరొకటి తలుచుకుంటే నా కడుపే తరుక్కుపోతోంది.

సారంగధరుడు: (ఆదుర్దాగా) అదేమిటీ? మరేమి కొత్త విపత్తు వచ్చిందీ?

సుబుద్ధి: కొత్తది కాదు మహాప్రభూ, పాతదే. నే నిప్పటికి కళ్లు తెరిచాను.

సారంగధరుడు: (చకితుడై) పాతదా?

సుబుద్ధి: అవును. పోల్నాడు రాజపుత్రికా తమరూ వుమ్మడిగా పందిని పొడిచినప్పుడు నా కది హఠాత్తుగా స్ఫురించింది; కాని యీ పది దినాలూ "అవునా కాదా" అన్న విచికిత్సలో గడిచిపోయాయి. ఇప్పటి తమ అవస్థ చూశాటప్పటి కవు నని నిశ్చయబుద్ధి కలిగి, నా నరాలు బిగుసుకుపోతున్నాయి. (సారంగధరుడి కాళ్లదగ్గిర కూలబడి)

క్షమించ మని ప్రార్థించడాని కయినా నాకు యోగ్యత లేదు. నేనప రాధిని. క్షుద్రుణ్ణి. పాపాత్ముణ్ణి.

సారంగధరుడు: (సుబుద్ధిని లేవదీస్తూ) తప్పు తప్పు. మీరిలా చెయ్యడం ధర్మమా, నాకు శ్రేయస్కరమా?

సుబుద్ధి: (దోసిలి వొగ్గి) మహాప్రభూ! నాయెడల తమ భావం అలాంటిదే; కాని నేను తమ శ్రేయస్సు కాల రాసేసిన కిరాతుణ్ణి. నా అపరాధం దావానలమై కీలుకీలునా వ్యాపించి, నన్ను నిలువునా కాల్చేస్తోంది. నేనది భరించలేకుండా వున్నాను.

సారంగధరుడు: (సుబుద్ధి చేతులు పట్టుకుని) మనస్సు కుదుట పరుచుకోండి. మీరు నా యెడల చేసిన అపరాధం యేమిటీ?

సుబుద్ధి: అపరాధం కాదు, ద్రోహం మహాప్రభూ! అదయినా అంతాయింతా కాదు, ఈ దుస్థితి కంతకీ కారణం నేను మహాప్రభూ!

సారంగధరుడు: ఈ దుస్థితి అంటే?

సుబుద్ధి: తమ దుస్థితికి—అమ్మగారి దుస్థితికి—నన్నయభట్టారకులవారి దుస్థితికి—మహారాజులుంగారి దుస్థితికి—ప్రాజ్యచళుక్య సామ్రాజ్యానికే నా మూలాన తీరని దుస్థితి యేర్పడింది. ఈ యెరుక నన్ను భస్మం చేసేస్తోంది

సారంగధరుడు: మీ ఆందోళన నేను చూడలేకుండా వున్నాను. నా మనస్సు పరిపరి విధాల పోతోంది. అదేదో త్వరగా తేల్చండి.

సుబుద్ధి: (గాఢమైన సంతాపంతో) చెప్పడాని కేంవుంది మహాప్రభూ? ఏ మొగంపెట్టుకుని చెప్పను మహాప్రభూ? ఇంతవరకూ వచ్చాక చెప్పిమాత్రం యేమి ప్రయోజనం మహాప్రభూ?

సారంగధరుడు: స్స! మహాదేవా! (అని మొగం తిప్పుకుంటూ సుబుద్ధి చేతులు వదిలేసి వొక్క అడుగు వెనక్కి వేస్తాడు)

సుబుద్ధి: (కంగారుపడుతూ దోసిలి వొగ్గి) మొగం చెల్లక మనవి చేసుకోలేకపోతున్నాను. మనస్సు రాయి చేసుకుని యిప్పుడు మనవి చేసుకుంటాను, క్షమించి ఆలకించండి మహాప్రభూ!

సారంగధరుడు: (సుబుద్ధికేసి మెల్లిగా మొగం తిప్పుకుంటాడు)

సుబుద్ధి: ఆవేళా....? మూడేళ్లనాడు పాపికొండల్లోను....? పులివేట ముగిశాక, తమ గుడారాని కొక్కమాటు దయచెయ్యవలసిందని జక్కులదీవి మండలేశ్వరులు తమర్ని ప్రీతితో ఆహ్వానించారు.

సారంగధరుడు: అవును, ఆహ్వానించారు.

సుబుద్ధి: చిత్రాంగీదేవమ్మగారి విభ్రమవిలోకనాలూ తమ చకిత కటాక్షాలూ అప్పటి కప్పుడే ప్రీతి నెరుపుకున్నాయి. ఆహ్వానం విన్నదే తడువుగా తమ రొక్క అడుగున్నూ వేశారు; కాని తమర్ని నేను వారించాను.

సారంగధరుడు: మీరు వారించడం నిజమే. అయితే?

సుబుద్ధి: అనవసరంగా వారించాను. ప్రతిభావంతు జ్ఞనే గర్వం కళ్లు కప్పివుండడంవల్ల దూరాలోచన చెయ్యలేక అవివేకినై వారించాను.

సారంగధరుడు: అయితే యేమిటీ? పరమార్థం చెప్పండి.

సుబుద్ధి: అప్పు డేకనక మనం వారి గుడారానికి వెళ్లివుంటే వుత్తరక్షణంలో గాంధర్వం జరిగిపోయి వుండును.

సారంగధరుడు: (ములుకు గుచ్చుకున్నట్టు బాధపడుతూ మొగం పక్కకి తిప్పుకుంటాడు)

సుబుద్ధి: అప్పుడే నేను తమర్ని వారించి వుండకపోతే, తరవాత, మహారాజులుంగా రింత దుస్సాహసం చెయ్యడానికి— (అర్ధోక్తి)

సారంగధరుడు: (గభీ మని సుబుద్ధి చేతులు పట్టుకుని) చాలు. ఇక మాట్లాడవద్దు.

సుబుద్ధి: నా తప్పు విన్నవించుకోకుండా—(అర్ధోక్తి)

సారంగధరుడు: వద్దంటున్నాను. ఇప్పు డంతకంటే పెద్ద తప్పు చేస్తున్నారు మీరు, ఇక ఆ వూ సెత్తవద్దు.

సుబుద్ధి: (నిర్విణ్ణు డయి వూరుకుంటాడు)

సారంగధరుడు: ఒక్క క్షణ మయినా మీరిక యిక్కడ వుండవద్దు, భట్టారకులవారి సన్నిధికే వేంచెయ్యండి. వారి స్థితిగతు లన్నీ పరిశీలించి, అపాయం వచ్చేటట్టుంటే, రాత్రి భోజనానంతరం దయచెయ్యండి, మనం వుభయులమూ కలిసి వెడదాం.

సుబుద్ధి: ఒక్క మనవి.

సారంగధరుడు: అగత్యం లేదు.

సుబుద్ధి: ఈ స్థితిలో తమర్ని విడిచి—(అర్ధోక్తి)

సారంగధరుడు: (దృఢంగా) మాట్లాడవద్దన్నాను. వెళ్లమంటు న్నాను. నుంచోవద్దంటున్నాను.

సుబుద్ధి: (స్తబ్ధుడయి హీనస్వరంతో) సెలవు. (కాళ్లీడ్చు కుంటూ వెళ్లిపోతాడు)

సారంగధరుడు: (చూసి చూసి) తేలిపోయింది. అదే దీని కంతకీమూలం.

నాశ్రేయస్సు కోరారే గాని సుబుద్ధిఅయ్యవా రది సాధించలేక పోయారు. వారి అవిమృశ్య కారిత మా భవిష్యత్తును చిక్కుపరిచేసింది. మా ఆశాసౌధానికి చిచ్చుపెట్టేసింది. మా విందు జీవితాలను దగ్ధపట లమే చేసేసింది.

మరి, నా వివేకం అంతా యేమయిపోయిందీ? నా స్వాతంత్ర్య నిరతి యెక్కడికి పోయిందీ? మాట చెప్పగలడేగాని, మంత్రి కొడుకు చెయ్యిపట్టుకుని చేయించగలడా?

పడిపోయిన్నీ ఘూర్ణిల్లుతూనే వుండిన ఆ పులిని కాల్చేసిన చిత్రాంగి ఆ చూపులు, ఇటు మళ్లుతూనే ముగమోహనాలయి నన్నెంత ఆకర్షించలేదూ? ఆ చూపుల్లో యెంత మమత - ఎంత ఆశ - ఎంత జాలి - చివరి కెంత విషాదం పొంగిపోలేదు?

అప్పుడు నే నెందు కంధుణ్ణయిపోయానూ? బధిరుణ్ణెందు కయిపోయానూ? అభావదశ కే యెందు కగ్గమయిపోయానూ?

మూడేండ్లుగా భావించుకుంటూనే వున్నానే? స్మరించుకుంటూనూ వున్నానే? మననం చేసుకుంటూనూ వున్నానే? ధ్యానించుకుంటూనూ వున్నానే? కలలు కనుక్కుంటూనూ వున్నానే? రవిలి, రాజి, కమిలి, కుమిలి, బుగ్గే అయిపోతున్నానే?

మరి, మట్టిముద్దలాగ జీవచ్ఛవా న్నయిపోయా నేమీ? ఆమె కోసం ప్రయత్నమే చెయ్యలేకపోయా నేమీ? పోనీ, అన్నాళ్లనుంచి గుచ్చిగుచ్చి అడుగుతూ వున్న అమ్మగారికి సూచనగా అయినా అందించలేకపోయానేమీ?

ఇదంతా సిగ్గా, వినయమా, క్లైబ్యమా? తాను కోరిన పురుషుడు తన్ను కోరుతూ వుండిన్నీ యిలా దేబె అయిపోయి వున్నట్టు తెలిస్తే ఏ యువతి సహించగలదూ?

అయితే, నేను తనని కోరుతూ వున్నట్టామెకి గుర్తేమిటీ?

కాకపోతే, ఆమె కీవ్రతం యేమిటీ? నాయనగారిని దూరంగా వుంచడానికే కాకపోతే ఆమె కీవ్రతం యెందుకూ? ఇప్పటికీ తన హృదయం నామీదే లగ్నమయి షుండకపోతే నాయనగారిని దూరంగా వుంచవలసిన అగత్యం యేమిటీ?

నాయనగా రంటే విరక్తా? నాయనగారియెడల భర్తృభావం యేపాటి వుండినా రాత్రివేళా, వుభయసంధ్యల్లోనూ దర్శనం నిషేధించడం యేమిటీ? అమ్మగారియెడల సపత్నిభావమే ఉంటే ఆ పాద సేవలే మనుకోనూ?

చిలక చూపుల్లోనూ, మాటల్లోనూ సాకూతమదనలేఖ ల్లేవూ? ఒక్క క్షణంకిందట చిలుక అన్నమాటల్లో—"దాని పుట్టుకే ముళ్ల డొంకలో కదా" అన్నమాటలో నా స్థాణుత్వానికి నిరసనభావం లేదూ?

వ్రతం సంగతి అంత వివరంగా చెప్పినా అర్థం చేసుకోని నన్ను చిలక నిరసించడంలో అధర్మ మేమున్నదీ? .... (మళ్లీ చిత్రాంగి నగరికేసి చూసి) అదిగో చిత్రాంగి, యింకా అక్కడే

వుంది. ఇలాగే చూస్తోంది. అయితే, యెవర్ని వుద్దేశించి ఆ చూపులు? (అటూ యిటూ చూచి) ఆ చూపులు పడుతున్న యిక్కడ, నేను కాక మరి పిట్ట అయినా లేదే?

సందేహం లేదు. నన్నే చూస్తోం దామె. నామీదే వుంది ఆమె చూపు. నేనే వున్నా నామె స్నిగ్ధ హృదయంలో.

నాయనగారు లేనేలేరు.

జక్కులదీవి రాజపుత్రిక- చిత్రాంగి-నా సొత్తుకాని నా చిత్రాంగి-నా హృదయేశ్వరి పరుల పాలయిపోయింది. నన్నునాధకింద కట్టి, నా కంఠం పెనవేసుకుని వున్న నా భాగ్యదేవతను పరులు లాగేసుకున్నారు.

ఛీ! ఎంత సిగ్గులచేటు!

అయితే, ఒడిచేతులతో భల్లూకాలను పడగొట్టానే? పిడిగుద్దులతో పెద్దపులులను కూల్చానే? నా హృదయేశ్వరిని దక్కించుకోలేని నా బలపరాక్రమా లెందుకు కాల్చనా?

చళుక్యయువరాజు జీవితేశ్వరే అపహృత అయిపోయిందే, మరెవరి భార్య క్షేమంగా వుండగలదూ!

యువరాజుగా వుండే యింత పందతనం కనపరిచానే, జనులు, తమ మహారాజుగా నన్నంగీకరిస్తారా? సామ్రాజ్యలక్ష్మి నన్ను కీగంట నయినా చూస్తుందా?

నేను మానవంతుణ్ణా? నేను రాచ పుట్టుకే పుట్టానా? జగదేకవీరులైన పాండు మహారాజులుంగారి దివ్యరక్తమే నా రక్తనాళాల్లో ప్రవహిస్తోందా?

శత్రువులు, నిండుసభలో, తమ పట్టపుదేవి కట్టుపుట్టాలు వొలుస్తూవుంటే పాండవులు అనాథలై చూస్తూ వూరుకున్నారు. ఆ పోలికే నాకూ వచ్చింది; కాని, తరవాత, వారు తమ వైరం తీర్చుకున్నారే? తమ పట్టమహిషి హృదయశల్యం తొలగించుకున్నారే? ఆ పోలికనైతం నాకెందుకు పట్టదూ?

ఇప్పుడే నా సొత్తు నేనెందుకు స్వాధీనపరుచుకోగూడదూ? నా చిత్రాంగిని తెచ్చుకుంటే నన్నెవ డడ్డుకోగలడూ? (మళ్లీ చిత్రాంగి నగరికేసి చూసి) అదిగో, చిలక అక్కడ చేరుకుంది. ఇద్దరూ ఏదో చెప్పుకుంటున్నారు. ఇద్దరూ - అదిగో, నాకేసే చూస్తున్నారు. అపవారించి, చిలక చేసన్న చేస్తోంది. అదిగో, నమ్రురాలై చిత్రాంగి దోసిలి వొగ్గుతోంది. (మహోద్వేగంతో) చిత్రాంగి నా సొత్తు. చిత్రాంగి నా హృదయేశ్వరి. చిత్రాంగి నా ప్రాణం. ఇదే నా చిత్రాంగిని నేను తెచ్చుకుంటాను.

రంయి మని సారంగధరు డొక్క అడుగు వేస్తాడు. వెంటనే వొక పావురం వచ్చి అతనిమీద వాలుతుంది. ఆగిపోయి దాన్ని అతను చేతుల్లోకి తీసుకుంటాడు.

(పావురంతో) ఇప్పు డెందుకు వచ్చావూ? అన్నట్టు నువ్వు చిత్రాంగి పావురంతో జతకట్టుకున్నావు కాదూ? చిత్రాంగి నిన్నెప్పుడేనా ముద్దు పెట్టుకుందా? చిత్రాంగి నా మాట యెప్పుడేనా తెస్తుందా? చిత్రాంగి నన్ను తలుచుకుంటోందా? చిత్రాంగి నన్ను నమ్ముకునే వుందా? చిత్రాంగి నా కోసమే యిక్కడికి వచ్చిందా? చిత్రాంగి నా హృదయేశ్వరేనా? నన్ను చిత్రాంగి నగరికి వెళ్ళమంటావా?

నా పావురమా! నా ప్రాణమా! ఇదిగో, నిన్ను విడిచి వెడుతున్నాను. నువ్వు చిత్రాంగి నగరికి వెడతావా, నేనూ వెడతాను. నువ్వు మరోదారి పడతావా, నేను గోదావరి పడతాను. (పావురం విడిచిపెట్టి, చూసి ఆత్రంగా) ఆ! ఆ! చిత్రాంగి నా సొత్తు. చిత్రాంగి నా హృదయేశ్వరి. చిత్రాంగి నాకోసమే వచ్చింది. చిత్రాంగి నా కోసమే యెదురుచూస్తోంది. కనకనే నా పావురం చిత్రాంగి చేతుల్లో వాలింది. నేను చిత్రాంగి పాదాలమీద వాల్తాను.

దురుసుగా వెళ్ళిపోతాడు.

# ఇరవయ్యోరంగం

చిత్రాంగి నగరు. రెండు గడియల పొద్దే వుంది. ముందువా తెరపిలోనుంచి పగటి చరమదీప్తీ, గాజుకప్పెలలోనుంచి సుగంధదీపికల ప్రారంభ తేజస్సూ వచ్చి మిళితమై హాలు కంతటికీ విలక్షణశోభ కూరుస్తున్నాయి. డాబా దిగివచ్చి చిలకా చిత్రాంగీ పడమటివేపు లోగుమ్మంలో నుంచుని మహోత్సాహంతో యెదురుచూస్తున్నారు. సారంగధరుడి రాక విన్నవించడానికి జక్కులదీవి పరిచారికలు అంచెలుగా నుంచుని వున్నారు. వసారా మెట్లదగ్గిరకి వెళ్లి వార్తలందు కుని వచ్చి చెబుతూ, మళ్లీ వాటికోసం మెట్లదగ్గిరికి వెడుతూ రుక్కు, మెరుపుతీగలాగ సంచరిస్తోంది.

రుక్కు: (వడిగా వచ్చి) దొడ్డిగుమ్మంకేపి మళ్లారు. (వెళి పోతుంది)

చిత్రాంగి: (చిలకతో) బాగుంది, కదూ?

చిలక: చెప్పి పంపినట్టు గ్రహించుకున్నారు, సామాన్యులా తల్లీ వారు?

రుక్కు: (మళ్లీ వచ్చి) గుమ్మం దాటి లోపల ప్రవేశించారు. మనవాళ్ళందరూ పుష్పాలు చల్లి, సరాసగా పాదాభివందనం చేస్తూ వుండగా, చిరునవ్వుతో శిరసావహిస్తూ శరవేగంతో దయచేస్తున్నారు. (వెళ్లిపోతుంది)

చిత్రాంగి: (ఏదో చెప్పబోయి, గభీ మని చిలక జబ్బలు పట్టుకుని, అంతలో సిగ్గుపడి వూరుకుంటుంది)

చిలక: సిగ్గెందుకు తల్లీ? ఇన్నాళ్లు బాధపెటినందుకు ముందు వారే చేతులెత్తి—(అర్థోక్తి)

చిత్రాంగి: (చిలక నోరు మూస్తూ) అయ్యో, అయ్యో!

రుక్కు: (మళ్ళీ వచ్చి) మెట్ల మీద అడుగు పెట్టారు. (వెళ్ళిపోతుంది)

చిత్రాంగి: (అమ్మయ్యా అన్నట్టు పెదవులు కదుపుతూ గుండెలమీద చేతులు వేసుకుంటుంది)

చిలక: ఎన్నడో మీ హృదయపీఠమే అధిష్ఠించారు వారు, ఇప్పుడు మెట్లెక్కడం అబ్బురమా అమ్మా?

చిత్రాంగి: (సిగ్గుతో చిలక బుగ్గమీద ఇట్టే అంటుంది)

రుక్కు: (మళ్లీ వచ్చి) మధ్యమెట్లమీద నుంచుని యేదో ఆలోచించు కుంటున్నారు. ఎందుకో పరితాప పడుతున్నట్టుంది. (వెళ్ళిపోతుంది)

చిలకా చిత్రాంగీ మెరుపుకొట్టినట్టయి దిగాలు పడిపోతారు.

చిలక: (తేరుకుని, చిత్రాంగి వీపు నిమురుతూ) అతిసాహస కార్యంకదూ తల్లీ యిదీ? ఒక్క క్షణం. ఈపాటికి మళ్లీ — (అర్థోక్తి)

రుక్కు: (మళ్లీ వచ్చి) మళ్లీ బయలుదేరారు. మెల్లిగా అడుగు వేస్తున్నారు. (వెళ్ళిపోతుంది)

చిత్రాంగీ చిలకా పొంగిపోతారు. చిత్రాంగి చిలక చేతులు పట్టుకుని గునుస్తుంది.

చిలక: సమయానికి సిగ్గుపడతారు సుమండీ, భద్రం!

రుక్కు: (మళ్లీ వచ్చి) దయ-చే-శా-రు. (వెనక్కి వెనక్కి తగ్గుతూ రెండోపక్కకి వెళ్లిపోతుంది)

సారంగధరుడు ఎదటికి వస్తాడు; కాని మళ్లీ పరితాపపడుతున్నట్టయి, వొక్క క్షణానికి తేరుకుని మొగం యెత్తి చూస్తాడు. చిత్రాంగి విభ్రమవిలోకనాలు పరుపుతుంది. చిలక పాదాభివందనం చేస్తుంది.

చిలక: (దోసిలి వొగ్గి) స్వాతివాన కోరి ముత్యపుచిప్పల్లాగా, చంద్రోదయం కోరి చకోరాల్లాగా నిరీక్షించుకుంటూ వున్నాము. దయ చెయ్యండి మహాప్రభూ!

సారంగధరుడు: (చిత్రాంగికేసి చూస్తూ వూరుకుంటాడు)

చిలక: పద్మసరోవరంలో పూలతెప్పమీద విహరిస్తూ, దుర్దాంతమైన గాలివిసురున నడిసముద్రంలో పడిపోయాము; కాని సావిత్రీ అమ్మవారిని కొలుచుకుంటూ ఆ గాలిని లెక్కచెయ్యక, ఆ మహాసముద్రం వుత్తరించి, చివరి కివాళ, వొడ్డే కాదు, ఏనుగే యెక్కగలిగాము. మహాప్రభూ! తమరు నుంచుని వుంటే మాకళ్లు చూడలేవు. మా హృదయాలు—(అర్ధోక్తి)

సారంగధరుడు: (నుంచునే వుండి దోసిలి వొగ్గి) అపరాధిని. క్షమించకోరుతున్నాను.

చిలక: ఆమాటకి వస్తే, యిప్పు డిక్కడ అపరాధులు కానివారెవరు మహాప్రభూ? ఒకరి హృదయం వొకరికి విప్పి చెప్పుకోడంకంటే క్షమాభిక్ష యేం వుంది మహాప్రభూ? (చిత్రాంగితో) మూడేళ్లగా కలలు కనుక్కుంటూ వున్న పెన్నిధి యిన్నాళ్లకి చేజిక్కింది. స్వాగతం నివేదించుకోండి తల్లీ!

చిత్రాంగి మళ్లీ విభ్రమవిలోకనాలు పరుపుతుంది. చిలక మళ్లీ "దయచెయ్యండి మహాప్రభూ!" అంటుంది. సారంగధరుడు ఒక ఆసనం అధిరోహిస్తాడు.

సారంగధరుడు: (చిత్రాంగితో) వేళ అతిక్రమించినట్టున్నదే. యింకా పూజ ప్రారంభించలేదేమీ?

చిత్రాంగి: (చిలకకేసి చూస్తుంది)

చిలక: మనవిచేసుకుంటున్నాను మహాప్రభూ! ఇవాళ పూజావిధానం మారవలసివుంది. కారణం హఠాత్తుగా ఆపతితం కావడంవల్ల అందుకు తగ్గ సన్నాహాలు ముందు చేసుకోవలసివుంది మహాప్రభూ!

సారంగధరుడు: మార్పా?

చిలక: అవును మహాప్రభూ!

సారంగధరుడు చిత్రాంగికేసి చూస్తాడు. చిత్రాంగి వోర చూపులు చూస్తుంది.

సారంగధరుడు: అదేమిటో అడగవచ్చునా?

చిత్రాంగి : (చిలకకేసి చూస్తుంది)

చిలక : అబలలమూ, ఆపన్నలమూ కదా, తీవ్రపరీక్షధర్మమా మహాప్రభూ!

సారంగధరుడు : (చిత్రాంగికేసి చూస్తూ) ఆపన్నత కేమి వచ్చిందీ?

చిత్రాంగి : (మొగం వంచుకుని, కొంచెం నిష్ఠురస్వరంతో) అంతానూ. తక్కువేం జరిగిందీ?

చిలక : మా నోటనే వినా లని వుంటే—(అర్ధోక్తి)

సారంగధరుడు : బోధపడలేదు. అంచేత అడగవలసివచ్చింది.

చిత్రాంగి : (మొగం వంచుకుని) అనుభవానికే వచ్చింది కదా, బోధపడకపోవడం సంభవమేనా?

సారంగధరుడు : (చకితుడై చిత్రాంగికేసి చూస్తాడు)

చిలక : (చిత్రాంగితో) మనస్సు చెదిరిపోయీ, హృదయం వ్యధితమయిపోయీ అనుభూతం కూడా గుర్తుతగిలివుండకపోవచ్చు. కనక, తల్లీ, నేను మనవిచేసుకుంటాను. (సారంగధరుడితో) మహాప్రభూ! మూడేళ్ల నాడు...? పాపికొండల్లో ...? జాపకం . . ?— (ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సారంగధరుడు కళ్లు మూసుకుని బాధపడతాడు. చిత్రాంగి, సారంగధరుణ్ణి విడిచి చిలకని చిలకని విడిచి సారంగధరుణ్ణీ ఆత్రంగా చూస్తూ వుంటుంది. ఒక్క క్షణం అయినాక, మెల్లిగా మొగం యెత్తుకుని సారంగధరుడు చిత్రాంగికేసి చూస్తాడు. దానిమీద, పొడిచినటు కాగా, కళ్లుమూసుకుని చిత్రాంగి బాధపడుతుంది.

చిలక : నాటికి నాడు, సుబుద్ధి అయ్యవారు, ఇలాంటి నిండు హృదయాలను బలవంతాన వేరుచేసి వాటి మధ్య ముళ్ళకంచెలు నాటారు. ఈ సందుపాటు చూసుకుని నేటికి నేడు మహారాజులుంగారు మా అమ్మని చెరపట్టడాని కుద్యుక్తులై —(అర్ధోక్తి)

సారంగధరుడు: (చకితుడై) చెరపట్టడానికా?

చిలక: అవును, కనపడనిదా యిది మహాప్రభూ? చూసిన్నీ - చూస్తూ వుండిన్నీ చూడనట్టు నటించడం వీరాధివీరుల కుచిత మేనా మహాప్రభూ?

సారంగధరుడు: (చిత్రాంగికేసి చూస్తాడు)

చిత్రాంగి: (మొగం వంచుకుని, కాలిబొటనవేలితో నేల రాస్తూ కొంచెం నిష్ఠురంగా) నన్ను పరీక్షించడానికే యీ ఔదాసీన్యం అయితే—(అర్ధోక్తి)

చిలక: అది మాకు మన్ననే ఈ పరీక్షలో నెగ్గలేకపోతే ప్రాణా లయినా యిచ్చెయ్యడానికి మేము సిద్ధమే. ఇంతకీ మా అమ్మ అసాధారణ మేధాసంపన్నురాలు కనక గానీ, లేకపోతే, మహారాజులుం గారు —(అర్ధోక్తి)

సారంగధరుడు: (చిలకతో) నన్ను కీ కారణ్యంలోకి తీసుకు వెడుతున్నావు.

చిత్రాంగి: (మొగం వంచుకుని దీనంగా) నేనున్నదే అక్కడ.

సారంగధరుడు: (చిత్రాంగితో) కాదు, రాజమహేంద్రపుర దుర్గంలో—మహరాణీపదవిలో—(గంభీరంగా చూస్తాడు)

చిత్రాంగి: (మొగం వంచుకుని, వోరచూపులు చూస్తూ కొంచెం కరుగ్గా) కాదు కాదు, రాజమహేంద్రపురదుర్గంలోనే—కాని కారాగృహంలో—చీకటికొట్టులో—చావుబతుకుల సంరంభంలో— (అలాగే చూస్తూ వుంటుంది)

సారంగధరుడు: (చిలకతో) వింతగా వుంది.

చిలక: ఉన్నదే అది మహాప్రభూ! లేకపోతే వొకరు మనస్సు హరించడం యేమిటి, మరొకరు దేహం హరించడానికి కుట్రలు పన్నుతూ—(అర్ధోక్తి)

సారంగధరుడు: కుట్రలా? ఇంకా పన్నుతూ వుండడమా!

చిత్రాంగి: (వోరచూపులు చూస్తూ మళ్లీ కొంచెం కరుగ్గా) కాక సాహసించడాని కెన్నివేల గుండె లుండాలి?

సారంగధరుడు: (చిలకకేసి చూస్తాడు)

చిలక: (తల పంకిస్తూ) వైభవాలకే గాని శౌర్యసాహసాలకా, మహాప్రభూ, జక్కులదీవివారి సామంతత ? మా అమ్మ, యిప్పుడు, జక్కులదీవికి బదులు రాజమహేంద్రపురంలో వున్నారు. ఇంతే భేదం.

సారంగధరుడు: అయితే, యెందుకు దయచేసినట్టూ ?

చిత్రాంగి: మరో దారి లేక.

సారంగధరుడు: (చిలకకేసి చూస్తాడు)

చిలక: వింత యేముందీ మహాప్రభూ ? రప్పించుకో తగ్గవారు అశ్రద్ధ చెయ్యడంవల్ల, మనసు మార్చుకోలేక, కోరి దయ చేశారు మా అమ్మ. సూచిభేద్య మైన గాఢాంధకారంలో వాక్కు ఆశాకిరణం గోచరించగా, దాన్ని నమ్ముకుని, అది సాధించుకోడానికి స్వయంగా దయచేశారు మా అమ్మ.

సారంగధరుడు: వివాహం——(అర్ధోక్తి)

చిలక: ఇక కావాలి మహాప్రభూ !

సారంగధరుడు: బాబయ్యగారు——(అర్ధోక్తి)

చిత్రాంగి: (ఓరచూపులు చూస్తూ విరసనగా) సత్యభామా దేవమ్మ వారిని ఆశించిన శతధన్వుడి పునర్జన్మ.

సారంగధరుడు: (చకితుడై చిలకకేసి చూస్తాడు)

చిలక: ఉన్నదున్నట్టు విన్నవించారు మా అమ్మ.

సారంగధరుడు: (చిత్రాంగితో) అయితే, కత్తికి —(అర్ధోక్తి)

చిత్రాంగి: (కచ్చితంగా) అది సమరాహ్వానం.

సారంగధరుడు: (చకితుడై మళ్లీ చిలకకేసి చూస్తాడు)

చిలక: (మందహాసం చేస్తూ, విలాసంగా) సరిగా అర్థం చేసుకోండి మహాప్రభూ ! రాజమహేంద్రపురాధీశ్వరులు సమరాహ్వానం చేశారు. జక్కులదీవి యువరాజపదవిలో వున్నవా రందు కంగీకరించారు. దాని మీద, వారు కత్తి దూశారు. వీరు పూలదండ రువ్వారు. బిభీషికలకు జంకే దెవరు ? అయితే, యెవరి ఆయుధం

వారిదీ, యెవరి ధైర్యం వారిదీ, యెవరి ఖానం వారిదీ, యెవరి నమ్మకం వారిదీనీ. ఎవరి కెవరు తీసి పోతారూ ?

సారంగధరుడు: పూర్వాపరసందర్భాలు—(అర్థోక్తి)

చిలక: చక్కంగా అతికాయి, లోటేమిటి మహాప్రభూ ?

సారంగధరుడు అపనమ్మకం కనపరుస్తాడు. చిత్రాంగి చిలకకేసి చురుగ్గా చూస్తుంది.

చిలక: (చిత్రాంగి యింగితం గుర్తించి, సరే అన్నట్టు తల పంకించి, అలవోకగా నవ్వి చిత్రాంగితో) ఉపోద్ఘాతం కావ్యాన్ని మించిపోయింది. పైగా, జటిలత యెక్కువయి కావ్యం కూడా ప్రౌఢైకవేద్యం అయిపోయింది. అంచేత యీ తటపటాయింపు. కనక యిక వ్యాఖ్యానం చేస్తాను తల్లీ !

(సారంగధరుడితో గంభీరంగా) మహాప్రభూ ! - (దోసిలి యొగ్గి) మూడేళ్ళ ప్రతీక్ష అడవిగాసిన వెన్నెల అయిపోయింది; కాని, ధైర్యం మాత్రం సన్నగిల్లి పోలేదు. ఈ స్థితిలో, చిత్రపటంకోసం రాయబారం వచ్చింది. దాంతో ప్రాణాలు లేచివచ్చాయి; కాని పెన్నిధి లభించిం దని పొంగిపోగా, పెనుభూతం యెదు రయింది. మనస్సు నిలవరించుకుని ఆలోచించగా అదే కార్యసాధనకు ఒక సోపానంగా కనపడింది వెంటనే సకలమూ నిశ్చయించుకుని, ఆరు మాసాల గడువు పెట్టుకుని మేమిక్కడ ప్రవేశించాము. మహారాజులుంగారిపై విసిరికొడుతూ సంగతిసెయ్యడమే గడువు ప్రయోజనం. ఈ సంకులసమరంలో సావిత్రీగౌరీవ్రతమే మాకు అభేద్య కవచం. నాలుగేసీ అయిదేసీ దినాల కొక్కమాటే మహారాజులుంగారి నగరిలో ప్రవేశించడాని కనుజ్ఞ. అదేనా మిడసరిలగ్నంలో. అప్పుడేనా గదిలో తలుపుచాటున మా అమ్మ, తలు పివతల వొక పక్కగా మహారాజులుంగారూనూ. ఒక్క తెరమాత్రమే తక్కువ. ఈ క్షణం వరకూ, చిత్రపటంలో తప్ప. మహారాజు మా అమ్మ మొగం ప్రత్యక్షంగా చూసి యెరగరు. మా అమ్మ కంఠస్వరం అయినా యెరగరు. మాధ్యస్థం వహించి, మా అమ్మ మాటలు అనువదిస్తున్నట్టు నటిస్తూ ఓలవలూ పలవలూ పెంచి సమయోచితంగా మహా

రాజులుంగారికి ప్రత్యుత్తరం చెప్పడం నేను. మహారాజులుంగా రడిగే మాటలు క్షేమసమాచారాలకూ, లోకాభిరామాయణానికీ మాత్రమే సంబంధించి వుండాలని కఠిన నియమం అయినట్టు కట్టడి. దీంతో యెంత నిరుత్సాహపడిపోవాలో అంతా నిరుత్సాహపడిపోయి, ఎంత విసిగిపోవాలో అంతా విసిగిపోయి, ఎంత కుంగిపోవాలో అంతా కుంగిస్నీ పోయారు వారు. లేకపోతే మహారాజులుంగారి కిప్పుడు మహారణ్యాలలో విహారం యేమిటి మహాప్రభూ! లేకపోతే, నాట్యాని కని వంకపెట్టి కొత్తబోగంపిల్లని వెంటపెట్టుకు వెళ్ళడం యేమిటి మహాప్రభూ?

సారంగధరుడు: (చకితు డవుతాడు)

చిలక: లోకం కోడయి కూస్తూ వుండగా యీ సంగతి తమకు తెలవక పోవడం యేమిటి మహాప్రభూ?

సారంగధరుడు: (నిర్విణ్ణు డయి మొగం వంచుకుంటాడు)

చిలక: నేను అతిశయోక్తులు ప్రయోగిస్తున్నా నని తమ రనుకోవద్దు. లోకం యేమీ యెరగదు గాని, మాకు మేమూ, మహారాజులుంగారికి మహారాజులుంగారూ కూడా యిది చావు బతుకుల సంరంభంగా భావించుకుంటున్నాము. మాకు మేమయి చెప్పుకోడం కాదు గాని, యీ గడువు లోపు వచ్చిన పని కాకపోతుందా, వ్రతమూ మిథ్య మా అమ్మా మిథ్య జగత్తే మిథ్య అన్నంత అసిధారా వ్రతంగా నడుచుకుంటున్నాము మేము.

సకలనీతివిశారదా! సుబుద్ధి అయ్యవారి తెలివితక్కువ మంత్రాంగానికి ప్రతిగా ఈ యెత్తు ఉద్దిష్టం అయింది. మహారాజులుంగారి దుస్సంకల్పం వికల్పం చేసెయ్యడానికే మా అమ్మ యీ మహానాటకం ఆడవలసివచ్చింది.

మహారుద్రయ్యగారి కుట్రలు విచ్ఛిన్నంచేసి, అన్యోన్యాను రాగంతో ప్రేమోన్మాదంతో కుమిలిపోతున్న తమ ఉభయుల లేత హృదయాలకూ ఐక్యత సంఘటించడానికే నేనిన్ని తిప్పలు పడవలసి వచ్చింది.

మహాప్రభూ! మనస్సు సరిచేసుకోండి. లోకవృత్తం

లించుకోండి. ప్రేమప్రవృత్తి గుర్తించుకోండి. ప్రాణికోటికి ప్రేమ కంటే సుఖకర మైన దేమి వున్నది మహాప్రభూ? ప్రాణికోటికి ప్రేమ కంటే ఉత్తమప్రాప్యం యేమి వుంది మహాప్రభూ? ప్రాణికోటికి ప్రేమానుభూతికంటే జీవితసాఫల్యం యేమి వుంది మహాప్రభూ? ఆ ప్రేమకు అడ్డేమిటి మహాప్రభూ? ఆ ప్రేమకు విఘాతం కలిగించ గలవా రెవరు మహాప్రభూ? ఆ ప్రేమను జయించగలవా రెవరు మహాప్రభూ? ఆ ప్రేమ అనుభవించని బతు కేమి బతుకు మహా ప్రభూ? ఆ ప్రేమకు అగమ్యమైన మార్గం యేమివున్నది మహా ప్రభూ?

పురుషసింహా! బాలామనఃసాంచాలా! త్రికరణయా తమ రూపమే భావించుకుంటూ, తమ పాదాలే ధ్యానించుకుంటూ, తమ పేరే స్మరించుకుంటూ, తమ హృదయమే ప్రాప్యంగా తమ అనుగ్రహామే అశించుకుంటూ మూడేళ్ళనాటి తమ చల్లని చూపే ధారకంగా నిద్రా హారాలు పరిత్యజించి, పంచాగ్నిమధ్యంలో ఘోరతపస్సు చేస్తూ మా తల్లి-అదుగో తమ యెదట-తమ పాదాల సన్నిధిని—(అర్ధోక్తి)

గభీ మని ముందుకి వచ్చి, చిత్రాంగి, సారంగధరుడి యెదట మోకరిల్లుతుంది. తటాలున యివతలకి వచ్చి, చిలక, తలుపు చేరవేస్తుంది. సరిగా, యీ సమయాన కంగారుపడుతూ రుక్కు తొంగిచూస్తుంది. చకిత అయి "ఏమిటి?" అన్నట్టు చేసన్న చేస్తూ చిలక, రుక్కు దగ్గిరికి వెడుతుంది.

రుక్కు : (మెల్లిగా) మహారాజిప్పుడే వేటనుండి దయచేశారు.

చిలక : (నిర్విణ్ణ అయి) ఆ!.........ఇక్కడికి రాలేదు కదా?

రుక్కు : ఇప్పటివరకూ లేదు. ..ఇక వస్తే?

చిలక : (ఆలోచించి ఆజ్ఞాస్వరంతో) ఇక్కడదీవి పరిచారిక లందరూ కత్తులు దూసి సిద్ధంగా వుండేది. సెలవు పొందకుండా రాజు పైకి వచ్చాడా యెవళ్ళ కందితే వాళ్ళే కత్తెతయితే నరికి పారేసేది. భద్రం! వెళ్లు.

ఇద్దరూ చెరోపక్కకీ వెళ్ళిపోతారు.

# ఇరవై వాకటో రంగం

రత్నాంగి నగరు. నాలుగ ఘుళ్ల రాత్రి అయింది. అప్పుడే భోజనం చేసివచ్చి రత్నాంగి దక్షిణపు వసారాలో పచారు చేస్తూ వుంటుంది. కూడా కూడా తిరుగుతూ, గౌరి, రత్నాంగి కొక్కొక్కటే తమలపాకు చిలక లందిస్తూ వుంటుంది. పంజరంలో వున్న చిలక "బాబయ్యా, బాబయ్యా" అని పలికి, కళ్లు మూసుకుంటుంది.

రత్నాంగి: (పంజరంకేసి చూస్తూ గౌరితో) ఏమిటే అంటుందీ చిలక?

గౌరి: మహారాజులుంగారు వేటనుంచి దయచేశారుట అమ్మా! ఆ మాట కామోను.

రత్నాంగి: ఎంతసేపయిందిట?

గౌరి: ఇప్పుడిప్పుడే నగరిలో ప్రవేశించారుట.

రత్నాంగి: మనకి దర్శనం అవుతుందా?

గౌరి: అవి వెనకటిదినాలలో మాట. వార్త వస్తే వెళ్లడం తప్ప, దర్శనం కోరడం కూడా మనకి క్షేమకరం కాదు.

రత్నాంగి: అవును. నువ్వు బాగా చెప్పావు........అయితే, నాలుగుదినాల కిందటేకదూ వేంచేశారూ, ఈమాటు ఇంత త్వరగా దయచేశారేం చెప్మా?

గౌరి: జక్కులదీవి అమ్మగారి సెలవు—(అర్థోక్తి)

రత్నాంగి: వేటకి వేంచెయ్య మని అంటావా, త్వరగా దయ చెయ్యమని అంటావా?

గౌరి: (చిరునవ్వు నవ్వి వూరుకుంటుంది)

గౌరి: తెలిసిం దమ్మా, ఒకదాని కొకటి చుక్కెదురు.

రత్నాంగి: పోనీ, నట్టువరాళ్ళలో కలిసిన కొత్తపిల్ల సంగతి యేమయినా తెలిసిందా?

గౌరి: తెలిసిం దమ్మా! ఆ పిల్ల అన్నపూర్ణ ద్వారా వచ్చిం దట. ద్రాక్షారామ దగ్గిర యేదో వూరనీ, మొన్న మొన్ననే పదహారేళ్లు నిండాయనీ, రూపంలోనూ విద్యలోనూ కూడా రంభా వూర్వసీ—అపాటి దనీ, వొక వెలుగు వెలిగేదే అనీ—(అర్ధోక్తి)

రత్నాంగి: ఏమి వెలుగో, పసిపిల్ల పాపం. దాని నాట్యారంభానికి మహారణ్యాలలోనా సుముహూర్తం?

గౌరి: ప్రభువులు తలచుకుంటే దేని కడ్డు తల్లీ?

రత్నాంగి: అంటే, వారు మహారణ్యాలకు వేంచేసిన కారణం మెకాలను సంహరించడానికి క్కాదన్నమాటా?

గౌరి: మహారణ్యాలలో వినోదాలూ, నగరంలో వేటా—(అర్ధోక్తి)

రత్నాంగి: సెబాస్! మంచి సారస్యం తీశావు. అయితే, మెకాలెవరో నగరంలో?

గౌరి: జక్కులదేవి అమ్మగారికంటే మెకం మరెవ రున్నా రమ్మా?

రత్నాంగి: అవునవును పాపం. (జాలిగా) ఎంత తెలివి—ఎంత చురుకు—ఎంత నమ్రత—ఎంత కలుపుగోలుతనం—ఎంత చక్కదనం—పాపం ఆమె బతుకు రసాభాస అయిపోయింది. ఆమె ఆత్మీయులు—(అర్ధోక్తి)

గౌరి: ఒక్క బిడ్డ పాపం వారికి. కొడు కయినా కూతు రయినా ఆమే, ఆమెను తలుచుకుని వారెంతెంత ఆశలు పోయారో?

రత్నాంగి: ఆశలంటే పోతాం గాని, అదృష్టం పెట్టిపుట్ట వద్దూ? అబ్బాయిని తలుచుకుని ఆమె ఆశలుపోలేదా, ఆమెని తలుచుకుని అబ్బాయి ఆశలుపోలేదా! కాని, ఆమెనీ అబ్బాయినీ కూడా మహారాజు ఒక్క దెబ్బతో—(అర్ధోక్తి)

ద్వారంలోనుంచి పరిచారిక—

సుబుద్ధి అయ్యవారు వచ్చి వేచివున్నా రమ్మా!

రత్నాంగి: ఏమన్నావూ?

ద్వారంలోనుంచి పరిచారిక—

సుబుద్ధి అయ్యవారు వచ్చి వేచివున్నా రమ్మా!

రత్నాంగి: రప్పించు, (గౌరితో) తోడితేవే.

గౌరి ద్వారందాకా వెళ్లి మళ్లీ సుబుద్ధితో వస్తుంది.

రత్నాంగి: ఏం బాబూ?

సుబుద్ధి: అబ్బాయిగారి కోసం వచ్చా నమ్మా!

రత్నాంగి: నాయన మీకోసమే బయలుదేరాడు బాబూ!

సుబుద్ధి: కనపడలే దండీ అమ్మా!

రత్నాంగి: (గౌరికేసి చూస్తుంది)

గౌరి: బుల్లిబాబయ్య దర్శనానికి వెళ్లివుంటా రమ్మా!

రత్నాంగి: (సుబుద్ధికేసి చూస్తుంది)

సుబుద్ధి: నేనక్కణ్ణుంచే వస్తున్నా నండీ!

రత్నాంగి: మహారా జిప్పుడే దయచేశారుట. వారి దర్శనానికి వెళ్లివున్నా డేమో.

గౌరి: అలాగే అయివుంటుం దమ్మా!

సుబుద్ధి: రావచ్చు నమ్మా!

రత్నాంగి: ఇంకా భోజనం కాలేదు. త్వరగానే రావచ్చు మీరు—(అర్థోక్తి)

సుబుద్ధి: కింద వేచి వుంటా నమ్మా!

రత్నాంగి: మీ భోజనం అయిందా?

సుబుద్ధి: ఇంకా కాలేదు. నేనిప్పుడు భట్టారకులవారి దగ్గిర నుంచి వస్తున్నా నండి.

రత్నాంగి: (జాలిగా) ఎంత దుష్టరోగం వొంట బట్టిందీ వారికీ? ఎదట నుంచుని మాట్లాడుతూ వుంటే, మా బాబయ్యగారి యెదట వున్న ట్టుండేది. బతికి బట్టకట్టి మళ్లీ వారిక్కడి కెప్పుడు దయచేస్తారో నేనెప్పుడు సేవించుకుంటానో!

సుబుద్ధి: ఇక లాభం లేదండీ అమ్మా!

రత్నాంగి: (విచారంతో) అదేం బాబూ?

సుబుద్ధి: ఈ రాత్రి గడవదండీ!

రత్నాంగి: శివశివా! శివశివా! అంత ముంచుకు వచ్చిందా?

సుబుద్ధి: యువరాజులుంగారి దర్శనంకోసం అటమటించి పోతున్నా రమ్మా వారు.

రత్నాంగి: అయ్యో, అయ్యో, ఎలాగ తండ్రీ? (గౌరితో) నా నాయనకి వారి చూపు లందవు కాబోలు. నేనేం చేతునే?

గౌరి: (సుబుద్ధితో) ఈ సంగతి మహారాజుగారికి తెలిసిందో, లేదో తమ రందచేయించండి బాబయ్యా!

సుబుద్ధి: నేను కాదు. మా బాబయ్యగారు విన్నవించుకుంటారు మహారాజులుంగారితోటి.

రత్నాంగి: ఈ లోపున యిక్కడికి వస్తే అబ్బాయిని వెంటనే పంపేస్తాను మీరు పదండి బాబూ, అక్కడే వుండండి.

సుబుద్ధి: చిత్తం అమ్మా!

రత్నాంగి: సోమిదేవమ్మగారిని వొక కంటితో కనిపెడుతూ వుండండేం బాబూ!

సుబుద్ధి: చిత్తం అమ్మా!

రత్నాంగి: (గౌరితో) చూడూ, నువ్వు వెళ్లి అమ్మగారిని కనిపెట్టుకుని వుండూ. అమ్మాయిగా రమ్మాయిగా రంటూ నన్ను గుచ్చి కౌగిలించుకుంటేనే కాని వుండలే రామె. (కళ్లు తుడుచుకుంటూ) ఆమె పసుపుకుంకుమలకే లోటు రావాలా?

సుబుద్ధి: సెలవు, అమ్మా!

రత్నాంగి: మంచిది బాబూ! (గౌరితో) నువ్వు కూడా పదవే. (సుబుద్ధితో) చూడండీ! ఎప్పటి స్థితి అప్పుడు నాకు తెలియ పరుస్తూ వుండాలి సుమండీ బాబూ!

సుబుద్ధి: చిత్తం అమ్మా!

తలో వేపుకీ వెళ్లిపోతారు.

---

# ఇరవైరెండో రంగం

చిత్రాంగి నగరు. నాలుగ్ఘళ్ల రాత్రి అయింది. సారంగధరుడికోసం వచ్చి సుబుద్ధి రత్నాంగితో మాట్లాడుతూ వుండిన సమయం అది. ఇక్కడ, హాల్లో, సారంగధరుడు వొక ఆసనంమీద కూచునీ, చిత్రాంగి, అతని యెదుట, తగినంత దూరాన నుంచునీ వున్నారు. చిలక చేరవేసిన తలుపు అలాగే వుంది.

సారంగధరుడు: (చిత్రాంగితో) అసాధారణ పరిస్థితుల్లో నేనిక్కడికి బయలుదేరాను. వచ్చిన్నీ మళ్లీ అసాధారణ పరిస్థితుల్లోనే పడిపోయాను.

చిత్రాంగి: (తల పంకించి వూరుకుంటుంది)

సారంగధరుడు: మెట్లమీద అడుగుపెట్టాను; కాని, నన్నెవరో దిగలాగేస్తూన్నట్టయింది. చిలక చెప్పింది విన్నాను. సరి, అంతా పూర్వపక్షమే అయిపోయింది.

చిత్రాంగి: (తల పంకించి వూరుకుంటుంది.)

సారంగధరుడు: చివరికి, నేను యథాస్థితికి వచ్చేశాను.

చిత్రాంగి: (గంభీరంగా చూస్తూ) అంటే?

సారంగధరుడు: (జంకు కనబరుస్తూ) తమకీ మా బాబయ్యగారికీ వివాహం జరిగిపోయినట్టే స్పష్టం అయింది.

చిత్రాంగి: (తల పంకించి వూరుకుంటుంది)

సారంగధరుడు: అంతఃపురానికి అంతఃపురం అంతా— రాజమహేంద్రపురానికి రాజమహేంద్రపురం అంతా—సామ్రాజ్యానికిన్నీ సామ్రాజ్యం అంతా తమర్ని మా బాబయ్యగారి రెండో భార్యగా గుర్తించి వుంది.

చిత్రాంగి: మరి తమర్ని ?

సాగంధరుడు: (మొగం వంచుకుంటాడు)

చిత్రాంగి: (చూసి చూసి, తల పంకించి) అయితే, తమ రది నమ్మారా ?

సారంగధరుడు: (మొగం పైకెత్తి, కొంచెం బెదురుగా) చిత్తం, నమ్మాను.

చిత్రాంగి: ఇప్పటికిన్నీ—(అర్థోక్తి)

సారంగధరుడు: (మొగం వంచుకుని) నమ్ముతూనే వున్నాను.

వల్లమాలిన రోషం వచ్చి చిత్రాంగి వొణికిపోతుంది. ఏమంటుందో అని సారంగధరుడు కిందుగా పక్కచూపులు చూస్తాడు.

చిత్రాంగి: (రోషం దిగమింగుకుని, అప్పటికీ కొంచెం కటువుగానే) అయితే, వివాహం అన్నారే, దాని క్కారణం ?

సారంగధరుడు: (పక్కకి చూస్తూ) బాబయ్యగారి కోరికా, సంకల్పమూ, దృఢదీక్షా, తీవ్రప్రయత్నమూ—(చిత్రాంగిని చూస్తూ) చివరికి కార్యసిద్ధిన్నీ.

చిత్రాంగి: వాటి క్కారణం ?

సారంగధరుడు: (మొగం వంచుకుంటాడు)

చిత్రాంగి: (చూసి చూసి, తల పంకించుకుని) పోనీ, పాపికొండల్లో—పులివేటలో, మనం కలుసుకున్నప్పుడు—తమ మనస్సు—(ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి) చలించింది. హృదయమున్నూ తమయెడల అనురక్తమయింది.

చిత్రాంగి: తరవాత—మరే సుందరి మీదనయినా—(ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సాగంధరుడు: (మొగం వంచుకునే వుండి) నా మనస్సు చలించలేదు. హృదయమున్నూ అనురక్తం కాలేదు.

చిత్రాంగి: చిత్రపటాలు —కోరినప్పుడు— (ప్రశ్నార్ధకంగా చూస్తుంది)

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి) నా చూపు తమమీదే వుంది.

చిత్రాంగి: అంటే యీ మూడేళ్ళలోనూ — (ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి) తమ రూప పటం నా హృదయ ఫలకంమీద వొకనాటికంటే వొకనాడు స్థిరపడి పోయింది.

చిత్రాంగి: (నిలవతీస్తూ) దానిమీద తమ రేమి చేశారూ?

సారంగధరుడు: (ఒక్కమాటు చిత్రాంగికేసి చూసి మళ్లీ మొగం వంచుకుంటాడు)

చిత్రాంగి: (చూసి చూసి, తల పంకించుకుని) అయితే, యింతకీ, తమ యెడల నా హృదయం —(ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి) గాఢంగా అనురక్తం అయిం దని నాడే తెలుసుకున్నాను.

చిత్రాంగి: తరవాత, నా మనస్సు ఏమయినా మారినట్టు— (ప్రశ్నార్ధకంగా చూస్తుంది)

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి) లేదు, లేదు. నాకలాంటి సందేహం కలిగే సన్నివేశా లేమీ కనపడలేదు. పైగా, తమ చిత్రమే మొదట వచ్చిం దన్న వార్త విని, మా రాయబారుల పరిముఖంగా కాక—తమ తండ్రిగారు—స్వయంగానే అంచెగుర్రాల మీద పంపారన్న సంగతిన్నీ విని, తమ హృదయమే కాక, తమ తండ్రిగారి ఉత్కంఠా తెలుసుకుని పొంగిపోయాను.

చిత్రాంగి: (కరుగ్గా) పొంగిపోయి?

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి: (హేళనగా) సుబుద్ధి అయ్యవారి సెలవు కాలేదా?

సారంగధరుడు: (మొగం వంచుకునే వూరుకుంటాడు)

చిత్రాంగి: (నిరసనగా) సిగ్గు ముంచుకు వచ్చిందా ?

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు.)

చిత్రాంగి: నా మనస్సు మారలే దని తెలిసినప్పుడు పొంగి పోయినట్టే, తమ భార్యని తమ తండ్రిగారు ఆక్రమించు కోడానికి ప్రయత్నించడం తెలిసినప్పుడున్నూ (పళ్లు కొరుకుతూ) పొంగి పోయారు, కదూ ?

సారంగధరుడు: (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి: (నిక్కచ్చిగా) మరి—తమరు—ఇప్పు డెందుకు దయచేసినట్టూ ?

సారంగధరుడు: (ఒక్కమాటు చిత్రాంగికేసి చూసి మళ్ళీ మొగం వంచుకుంటాడు)

చిత్రాంగి: (నిరసనగా) ప్రేమించీ, నమ్మీ, ఆశించీ, వచ్చీ, పడిగాపులు పడివుండీ—చివరికి అనుగ్రహించబడ్డట్టు భ్రమపడీ పొంగి పోయిన యువతి యెడల, మనసుపడివున్న క్షత్రియవీరుడు చూపించ వలసిన పురుషకారం యిలాంటిదే కాదూ ? (కోపంగా) జక్కులదీవి రాజవంశం అంటే — (అర్ధోక్తి)

సారంగధరుడు: (ఆత్రంగా) వద్దు, వద్దు, నాకలాంటి భావం ఎంతమాత్రమూలేదు. నేనంత క్షుద్రహృదయు ణని తమరు భావించ వద్దు. నేను తమ కుమారుణ్ణి

చిత్రాంగి: (రోషంతో, చెయ్యి జాడిస్తూ) కావు. ఎంత మాత్రమూ కావు.

సారంగధరుడు: (మొగం వంచుని వూరుకుంటాడు)

చిత్రాంగి: భార్య అంటే యేమిటో, తల్లి అంటే యేమిటో, నువ్వెరగవు.

సారంగధరుడు: (మొలకట్టున వున్న కటారి వొరతో కూడా తీసి, చిత్రాంగి పాదాల దగ్గరవుంచి, లేచి నుంచుని, తర్జనితో కటారి చూపిస్తూ) దాంతో—(తన గుండెలు చూపిస్తూ) ఇక్కడ చీల్చి చిత్తగిస్తే—(అర్ధోక్తి)

చిత్రాంగి : పనిలేదు. (ఆ కటారి అందుకుని) నీకు హృదయమే వుంటే అది యిదివరకే బద్దలయిపోయి వుండేది.

సారంగధరుడు : (మొగం వంచుకుని వూరుకుంటాడు)

చిత్రాంగి : నా యెడల మాతృభావం చూపించడాని కయినా నీకు సత్తా చాలదు.

సారంగధరుడు : (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి : కుమారు డనుకోడాని కయినా యోగ్యత లేని మనిషిని పతిగా వరించి, గంపెడాశతో ఒక్కణ్ణుంచి యిక్కడికి రావడం నాదే బుద్ధితక్కువ.

సారంగధరుడు : (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి : నన్ను తల్లిగానే భావించి వుంటే, యిన్నాళ్ళకా, నీ తండ్రి వూళ్ళో లేనప్పుడా, సెలవు పొందకుండానా, దొంగపోటుగానా రావడం ?

సారంగధరుడు : (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి : నీ పక్షంగా చూస్తే నీ తండ్రి చేసిం దేమీ తప్పు కాదు. కాని నేనే మోసపోయాను.

సారంగధరుడు : (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి : తన కోడలే తనకి భార్య—తన భార్యే తనకి తల్లి—ఆహా ! ఏమి తండ్రీకొడుకులూ ?

సారంగధరుడు : (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

చిత్రాంగి : మహా శౌర్యసాహసాలు వున్నవాడిలాగ — (చూపిస్తూ) కటారి చర్రున లాగి నా పాదాల దగ్గిర వుంచావే, తల తిరిగిపోయే దారుణాలు జరుగుతుండగా యెలాగ మూసిపెట్టుకుని వుండగలిగావూ ?

సారంగధరుడు : (ఏదో చెప్పబోయి మొగం పైకెత్తి, తటాలున మళ్ళీ వంచుకుంటాడు)

చిత్రాంగి: నీతో మాటాడ్డమే కాదు, నీయెదట నుంచోడం కూడా ఆడదానికి పరువుతక్కువ. పూర్వజన్మలో యెంతో పాపం చేసుకుంటే గాని ఆడది నీవంటివాణ్ణి కనదు. (గుమ్మంకేసి చూస్తూ) చిలకా!

తెరలో

"తల్లీ!"

చిత్రాంగి: తలుపు తియ్యి.

తలుపు తీసి, చిలక, వొక పక్కగా నుంచుంటుంది.

చిత్రాంగి: (గుమ్మంకేసి చూపిస్తూ, సారంగధరుడితో) వెళ్లు. వెళ్ళిపో!

కాళ్లీడ్చుకుంటూ సారంగధరుడు బయలుదేరతాడు. కూడా వచ్చి, చిలక దగ్గిర నుంచుని, చిత్రాంగి, సారంగ ధరుడికేసి తీవ్రంగా చూస్తూ వుంటుంది.

చిలక: (సారంగధరుడికేసి చూస్తూ, హేళనగా) ఏ-మి-టి-ట?

చిత్రాంగి: (ఏవగింపుగానూ, రోషంతోనూ సారంగధరుడికేసి చూస్తూ) నే నమ్మనిట.

చిలక: (కళ్లూ, మూతీ తిప్పుకుంటూ, సారంగధరుడికేసి చూస్తూ) అయితే, వుగ్గూ పాలూ పుచ్చుకోడానికి వచ్చారటనా?

పిడుగుపడ్డట్టయి, వేలు కొరుక్కుని, సారంగ ధరుడు గబ గబా వెళ్లిపోతాడు. కనపడ్డంత సేపూ చిలకా, చిత్రాంగీ అతనికేసే కోపంగా చూస్తారు.

చిత్రాంగి: తేలిపోయింది.

చిలక: రాజూ వచ్చాడు.

చిత్రాంగి: (చకిత అయి) ఎప్పుడు?

చిలక: మిమ్మల్నిద్దర్నీ విడిచి నేనివతలికి వచ్చాను, రుక్కు వార్త చెప్పింది.

చిత్రాంగి: (సాలోచనగా పక్కకి చూస్తూ) సమయానికే వచ్చాడు; కాని ఆ రావడం రావడం యిక్కడికే వస్తే యెంత బాగుండునూ?

చిలక: ఇది తెలవదా, యిక రాడా?

చిత్రాంగి: (మళ్ళీ సాలోచనగా పక్కకే చూస్తూ) కాదు. మంచి సమయం దాటిపోయింది. (చేతనున్న కటారి చూసుకుంటూ) దీనికి వినియోగం లేకపోయింది.

చిలక: (కటారి పుచ్చుకుని) ఇదెలా వచ్చింది తల్లీ?

చిత్రాంగి: నేను తన తల్లి నని రాసివుందిట తన హృదయం మీద. చీల్చి చూసుకో మని—(అర్థోక్తి)

చిలకా: వోస్! కనక కనక యిలాంటి కొడుకునే కనాలి.

చిత్రాంగి: (సాలోచనగా పక్కకి చూస్తూ వుంటుంది)

చిలక: మరి—ముందు చెయ్యవలసింది?

చిత్రాంగి: (ఒక్క క్షణం అలాగే వుండి, తరవాత చిలకతో) నేను చెయ్యవలసింది నాకూ తెలుసు, నీకూ తెలుసు. మరి నీ మాట?

చిలక: మీ దారి వేరూ నా దారి వేరూనా తల్లీ? ఎంతమాటా? మీకు సుఖమూ లేక, మీరూ లేక నేనుండి యేమి చెయ్యనూ?

తెరలో

"చిలకా!"

చిలక: (చిత్రాంగికేసి చూస్తూ) ఆ!

చిత్రాంగి: రమ్మను.

చిలక: (గుమ్మంకేసి చూస్తూ) రావచ్చు.

రుక్కు ఖడ్గపాణి అయి వస్తుంది.

రుక్కు: మహారాజా, మహారుద్రయ్యగారూ—(అర్థోక్తి)

చిత్రాంగి: వచ్చారూ? (చిలకతో) ఆ వేడిలో వస్తేనా?

చిలక: ఇప్పుడు మాత్రం యేమి మించిపోయింది తల్లీ? ముందు నాటకం కానిచ్చే తరవాత ఆ పని చెయ్యవచ్చు. (రుక్కుతో) ఎక్కడున్నారే?

చిలక: కిందే వున్నారు.

చిత్రాంగి: (రుక్కు చేత వున్న ఖడ్గం అప్పుడు గుర్తించి, చకిత అయి చిలకతో) అదేమిటే?

చిలక: మీ యిద్దరికీ అనుకూల్యం కలుగుతుం దనీ, ఆ సమయాన రాజు వస్తా డేమో ననీ, సెలవు లేకుండా వస్తే నరికెయ్య మనీ—(అర్ధోక్తి)

చిత్రాంగి: అదే లేకపోయింది; కాని మంచి యేర్పాటే చేశావు.

చిలక: మరి యిప్పుడు రాజు మాట?

చిత్రాంగి: (రుక్కుతో) అవతల వుండు;

రుక్కు వెళ్ళిపోతుంది.

చిత్రాంగి: (సాలోచనగా) వచ్చీ రావడంతోటే రాజుని పొడిచెయ్యడం — లేకపోతే — తికమకలుగా సమాధానాలు చెప్పి, మనస్సు పాడుచేసి, తన్మూలంగా కల్లోలాలు పెంచడం—వీలు తప్పి వచ్చినప్పుడు మనమున్నా—(చిలకకేసి చూస్తుంది.)

చిలక: చివరి ఆలోచనే బాగుంది. అలా చేస్తే, తండ్రి కొడుకునో, కొడుకు తండ్రినో కడతేర్చుకుంటారు. ఈ చిచ్చు మనతో పోనివ్వగూడదు

చిత్రాంగి: ముసిలా డిప్పుడు అసందర్భంగా మాట్లాడితే?

చిలక: పొడిచేసి పొడిచేసుకుందాం.

చిత్రాంగి: (ఆలోచించి) కల్లోలాలు పెరిగేటట్టే చూడు. రప్పించు.

చిలక: (గుమ్మంకేసి చూస్తూ) రావచ్చు.

రుక్కు: (వచ్చి) ఏం సెలవు అమ్మా?

చిలక: ముందు కత్తులు దింపెయ్యండి. తరవాత తీసుకురా.

రుక్కు: మంచిది. (బయలుదేరుతుంది)

చిత్రాంగి: (రుక్కుతో) చూడూ, ఇక వంగివంగి దండా లక్కర్లేదు. ఎక్కడివాళ్ళ నక్కడ తప్పుకోమను.

యిక్కు : (చిలకకేసి చూస్తుంది)

చిలక : నువ్వు మాత్రం యధాపూర్వమే.

రుక్కు వెళ్లిపోతుంది.

చిలక : (చిత్రాంగిని పొదివి పట్టుకుని) తలుపుచాటుకి పద తల్లీ !

చిత్రాంగి : ముసిలాడి కింకా మర్యాద చెయ్యా లంటావా ?

చిలక : ముసిలాడి క్కాదు, అది మనకే మర్యాద. పరకి లేంది మీరిప్పుడు ఎందుకు రాజు కళ్లబడాలీ ?

చిత్రాంగి : మాటల సందర్భంలో అవసరం వస్తుందేమో ?

చిలక : అప్పుడు భద్ర కాళీ అవతారం తాల్చే ప్రత్యక్ష కావడం.

చిత్రాంగి తలుపు చాటునా, చిలక ద్వారంలోన నుంచుంటారు. ఇంతలో రాజూ మహారుద్రయ్యా వస్తార రాజు ధుమ ధుమ లాడుతూ వుంటాడు. చిలక, చూసి మొగం వంచుకుని, వూరుకుంటుంది. చిత్రాంగి చె లోరచేసుకుంటుంది. ప్రత్యుత్థానాదికం లేకపోయినందుక అసంతృప్తులై రాజూ మహారుద్రయ్యా మొగమొగాల చూసుకుంటారు.

రాజరాజు : (చూసిచూసి చిలకతో) పూజ అప్పుడే అయిపో యిందా, లేక, యివాళ—

ప్రశ్నార్థకంగా చూస్తూ రాజు ఇంతమాత్రమే అడిగి వూరుకుంటాడు. చిలక, నిర్లక్ష్యంగా చూసి వూరుకుం టుంది. దానిమీద, రాజూ మహారుద్రయ్యా వొకమాటు చురుగ్గా చూసుకుంటారు.

రాజరాజు : ఇంకా ప్రారంభం కాలేదా ?

చిలక : లేదు.

రాజరాజు : కారణం ?

చిలక : ఉంది.

రాజరాజు : మేము వినతలుచుకున్నాము.

చిలక : (ఒకమాటు చిత్రాంగికేసి చూసి రాజుతో) మేము చెప్పతలుచు కోలేదు.

రాజు మహారుద్రయ్యకేసి చూస్తాడు. మహా రుద్రయ్య ఏదో గొణుగుతాడు.

రాజరాజు : ఇక్కడికి సారంగధరుడు వచ్చాడుట ?

చిలక : (చిత్రాంగికేసి చూసి, రాజుతో) అవును, వచ్చారు.

రాజరాజు : ఏడీ ?

చిలక : వెళ్ళిపోయారు.

రాజరాజు : వచ్చి యెంతసేపయిందీ ?

చిలక : మూడు గడియలు కావచ్చు.

రాజరాజు : వెళ్ళి ?

చిలక : (లెక్క నటిస్తూ) అరగడియ కాబోతోంది.

రాజరాజు : వచ్చి యేంచేశాడూ ?

చిలక : (చిత్రాంగికేసి చూసి, రాజుతో) ఉన్నారు.

రాజరాజు : (కళవళపడి, ఒక్కమాటు మహారుద్రయ్యకేసిన్నీ చూసి) ఉండి యేం చేశాడూ ?

చిలక : (చిత్రాంగికేసి చూసి, రాజుతో వెటకారంగా) వెళ్ళి పోయారు.

మండిపడితూ రాజు మహారుద్రయ్యకేసి చూస్తాడు. వెంటనే "తమ రుండండి" అంటూ మహారుద్రయ్య ముందుకి వస్తాడు.

మహారుద్రయ్య : (చిత్రాంగిని ఉద్దేశించి గుమ్మంకేసి చూస్తూ) అమ్మా ! తమరు—చిన్నవారు—(అర్ధోక్తి)

చిత్రాంగి : (రోషంతో) నీ పెద్దతనం మాత్రం యేమి మండిందీ ? నా అంతఃపురంలో నీకేమి పనీ ?

రాజు నిర్విణ్ణు డవుతాడు. బుర్రవంచుకుని మహా రుద్రయ్య వెనక్కి వెళ్ళిపోతాడు.

రాజరాజు : (చిత్రాంగిని ఉద్దేశించి గుమ్మంకేసి చూస్తూ కటువుగా) నీ అంతఃపురంలో సారంగధరుడికి మాత్రం యేమి పనీ?

చిలక : (ఒకమాటు చిత్రాంగికేసి చూసి, రాజుతో) ఒకరి వూహాలూ, వొకరి వుద్దేశాలూ, వొకరి సంకల్పాలూ, వొకరి ప్రయత్నాలూ, వొకరి పనులూ మరొకరినా అడగడం?

రాజు చిలకకేసి తీక్ష్ణంగా చూస్తాడు. చిలక రాజు కేసి అలవోకగా చూస్తుంది. మహారుద్రయ్య, వెనక వాటున, రాజు చెవి దగ్గిరగా నోరు పెట్టి "ఇప్పుడు కాదు, దయచెయ్యండి మహాప్రభూ" అంటాడు. రాజు చిలకకేసి చూసి చూసి, తల పంకించి, మహారుద్రయ్యతో వెళ్ళి పోతాడు. చిలక, ఆ యిద్దరి మీదా మెటికలు విరుస్తుంది. చిత్రాంగి యివతలికి వస్తుంది.

చిత్రాంగి : అంటుకున్నట్టేనా?

చిలక : ఇక భగ్గు మనడమే తరవాయి.

చిత్రాంగి : అవక? మూల నున్న వాళ్ళని ముందు కీడిస్తే వూరికేపోతుందా?

చిలక : ఊరికే పోనిస్తామా?

చిత్రాంగి : (ఆలోచించి) చిలకా!

చిలక : తల్లీ!

చిత్రాంగి : (గంభీరంగా) నేనూ కొండంత ఆశ పెట్టుకున్నాను. నువ్వూ కొండంత ఆశ పెట్టుకున్నావు.

చిలక : సెలవిప్పించం డమ్మా!

చిత్రాంగి : కాని, యిద్దరమూ వొక్కనోమే నోచుకున్నాము.

చిలక : సెలవిప్పించం డమ్మా!

చిత్రాంగి : వస్తా నుండు. (లోపలికి వెళ్లి తన కటారి తీసుకు

వచ్చి) నాకు నృత్యవిద్యా, ధనుర్విద్యా క్షుణ్ణంగా నేర్పావు. లోకజ్ఞానం కలిగించావు. కంటికి రెప్పలాగ కాపాడావు. నీడలాగ అనుసరించావు. ఇన్నింటికీ, చివరికి, నేను సమర్పించుకోగలిగిన గురుదక్షిణ యిదీ. (కటారి యిస్తుంది)

చిలక : (నమ్రురాలై దోసిలి వొగ్గి అందుకుని కళ్ల కద్దుకుంటూ) మహాప్రసాదం. అమ్మా! నన్ను ఆత్మవతుగా భావించారు. ఇంతకంటే నాకు గురుదక్షిణ యేమిటీ? మన్నన మాత్రం యేమున్నదీ?

చిత్రాంగి : వెర్రితల్లివి నువ్వు. ఎప్పటి కప్పుడే, యెక్కడికక్కడికే సంతోషించావు. మరి ఆ కటారి యిలాతే.

చిలక సారంగధరుడి కటారి యిస్తుంది.

చిత్రాంగి : నేను చళుక్యయువరాజుని వరించాను. నా హృదయంలో మరొకడికి చోటు లేదు.

చిలక : అవును తల్లీ!

చిత్రాంగి : ఆ మనిషిదగ్గిర నేననుకున్న యోగ్యత లేకపోయింది. (కటారి వొరతీసి చూసి) దీనికి మాత్రం వుండవలసిన యోగ్యత—(అర్థోక్తి)

చిలక : (గభీమని చిత్రాంగి చెయ్యి పట్టుకుని కంగారుగా చూస్తుంది)

చిత్రాంగి : ముసిలాడు మళ్లీ రాకుండానూ - మరోమాటు మాడ్చెయ్యకుండానూ తొందరపడతానా, చెయ్యి వదులు. అప్పుడేనా? నువ్వూ నేనూ వొక్కమాటే—(కటారి వొరలో పెట్టేస్తుంది)

చిలక : అందు కడ్డేమిటీ? చెయ్యవలసిందే అదీ. ముందు మనం కొన్ని సంగతులు పరిష్కరించుకోవలసివుంది. మనవాళ్లకి కర్తవ్యం చెప్పవలసిన్నీ వుంది. కడసారం మీరు సావిత్రీ అమ్మవారిని కొలుచుకోవలసిన్నీ వుంది, రండి.

చిలక చిత్రాంగిని చెయ్యి పట్టుకుని లోపలికి నడిపించుకు వెడుతుంది.

# ఇరవైమూడో రంగం

రాజరాజు నగరు. జామురాత్రి అయింది. పచారుచేస్తూ రాజు మహోగ్రుడై వున్నాడు. చేతులు కట్టుకుని మహారుద్రయ్య వొక పక్కగా నుంచుని వుంటాడు.

రాజరాజు: "వెళ్లాను, వచ్చేశాను" అని యితగాడా? "వచ్చారు, వెళ్ళిపోయారు" అని ఆ నెరజాణలా? ఎన్నివిధాల అడిగినా వొక్కటేమాటా? ఇది యివాళే ప్రారంభం అయి వుంటే వుభయులకూ ఇంత ఐకకంఠ్యం సాధ్యంటండీ?

మహారుద్రయ్య: (చూస్తూ వూరుకుంటాడు)

రాజరాజు: తానే వివాహం చేసుకుంటా నని ఆదిలోనే పట్టుపట్టగూడదూ? ఆ పాపికొండల సంఘటనే నిజ మయితే, మనం ప్రయత్నాలు ప్రారంభించేదాకా యెలాగ మణిగివుండిందీ?

మహారుద్రయ్య: (చూస్తూ వూరుకుంటాడు)

రాజరాజు: ఇంత దారుణప్పని - యింత ద్రోహప్పని- యింత నీచప్పని మరేమయినా వుందిటండీ? అప్పు డలా వూరుకున్న అబ్బాయి, వొకరి ప్రోద్బలంలేకుండా యిప్పు డిలా చెయ్యడమున్నూ సంభవంటండీ?

మహారుద్రయ్య: ఈ సందేహం నాకు మొదట్లోనే తట్టింది. ఎవరి ప్రోద్బలంవుండినా ఎవరి ప్రోద్బలం లేకపోయినా నర్మసచివుడు ఆ సుబుద్ధి ప్రోద్బలం మాత్రం—(అర్థోక్తి)

రాజరాజు: తమ్ముడి ప్రోద్బలం లేదంటారా మీరు? చిట్టివీరన్నగారి కిది తెలిసివుండ దంటారా?

మహారుద్రయ్య: నేను జక్కులదీవి వెళ్లి రామభద్రరాజులుం

గారిని నిర్బంధించివచ్చినట్టు గుర్తించగలిగిన ప్రధానమంత్రిగారి కిది తెలినివుండదంటే నేను నమ్మను; కాని—(అర్ధోక్తి)

రాజరాజు: తల్లి కూడా—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: (దోసిలివొగ్గి) అంతమాట అనవద్దు మహా ప్రభూ! తక్కినవారి నెవరి నేమన్నా—(అర్ధోక్తి)

రాజరాజు: తక్కినవాళ్ళని మాత్రం అని ప్రయోజనం?

మహారుద్రయ్య: అదీ నేను మనవిచేసుకునేది. జరిగిపోయిన దానికి హేతువులూ, వివరాలూ యేమయినా కావచ్చు. వాటివల్ల మన కేమీ ప్రయోజనం లేదు. ఇక చెయ్యవలసింది చూసుకోవాలి

రాజరాజు: ఉప్పుపాతర వెయ్యడమే మాతృద్రోహికి—(అర్ధోక్తి)

మహారుద్రయ్య: (చెవులు మూసుకుని మొగం వంచుకుంటూ) శివశివా! శివశివా!

రాజరాజు: (చకితుడై మహారుద్రయ్యకేసి తీక్ష్ణంగా చూస్తాడు)

మహారుద్రయ్య: దయతలచవలసిందని నేను ప్రార్థించను; కాని—(అర్ధోక్తి)

రాజరాజు: పోనీ, శిరచ్ఛేదం. ఏమంటారు మీరు?

మహారుద్రయ్య: వినలేను మహాప్రభూ!

రాజరాజు: (మళ్లీ చకితుడై) అదేమిటండీ?

మహారుద్రయ్య: అదేమిటీ అంటే, తమకి తెలవని దేమి వున్నదీ? నేను మనవి చేసుకోవలసిన అగత్యమున్నా యేమిటీ? నిజానికి, ధర్మాని కిన్ని మార్గాలు లేవు. తన్నిర్వహణం కూడా నిక్కచ్చిగానే చెయ్యవలసివుంది; కాని దానికి విశేషవిధు లున్నాయి.

రాజరాజు: అవి మాత్రం నాకు తెలియవు. అంతే కాదూ?

మహారుద్రయ్య: ఎంతమాటా?

రాజరాజు: మరి మీరు నిర్వచించే, విశేషవిధు లేమిటండీ?

మహారుద్రయ్య: మనవి చేసుకుంటున్నాను. ఇది యేలినవారి

ఆత్మవృత్తం. ఆపైని, యిటు స్వచ్ఛంద మైన లోకం. అటు అవిచ్ఛిన్న మైన వంశం.

రాజరాజు : (పళ్లు కొరుకుతూ) వంశం! ఇలాంటి నీచుడివల్లనా వంశాభివృద్ధి కోరుకోవలసింది?

మహారుద్రయ్య : తప్పితే మరోమార్గం ఏదీ?

రాజరాజు : (ఉద్రిక్తుడై మాటరాక కొంచెంసేపు చూసి చూసి) మీరేమంటారండీ?

మహారుద్రయ్య : (దోసిలివొగ్గి) ముందు, చాలా దూరం ఆలోచించవలసిం దని మమ్మేలినవారిని ప్రార్థించుకుంటున్నాను.

రాజరాజు : తరవాత?

మహారుద్రయ్య : మరేముందీ? తరవాత శిక్ష విధించడమే.

రాజరాజు : అయితే, మీరు విధించమనే శిక్ష యేమిటీ?

మహారుద్రయ్య : విన్నవించుకుంటాను. (గంభీరంగా చూసి చూసి) మహాప్రభూ! మరి చిత్రాంగి దేవమ్మ గారి సంగతి—(అర్థోక్తి)

రాజరాజు : (దురుసుగా) అది వేరే సంగతి.

మహారుద్రయ్య : నేను కాదనను. అయితే, దాంతోపాటు "ద్రోహం జరిగిందా లేదా" అన్నది కూడా వేరే సంగతే. ఇక వున్న దల్లా యేమిటంటే? ద్రోహమే జరిగివుంటే, దానికి అబ్బాయిగా రొక్కరే బాధ్యులు కారు.

రాజరాజు : అయితే?

మహారుద్రయ్య : అది నిర్ధారణ అయిపోయింది కనక, యిప్పుడూ, ద్రోహం జరిగిందా లేదా అన్న విచారణ. ఇది అవశ్యమూ చెయ్యవలసిందే; కాని యెటు నిర్ధరించడమూ మనకి సాధ్యం కాదు. సర్వమూ (అంజలిబంధం పైకెత్తి) ఆ మార్కండేయస్వామికే యెరుక. ఎంచేత నంటే, చిన్నరాణీగారి వ్రతం—(అర్థోక్తి)

రాజరాజు : (ఆత్రంగా) ఇప్పు డా వ్రతం మాట యెందుకండీ?

మహారుద్రయ్య : ఇప్పుడే కా, దప్పుడే విన్నవించుకున్నాను. నేను, ఆ వ్రతం అంగీకరించవద్దని.

రాజరాజు : (తేల్చేస్తూ) సరే; ఆ వ్రతం సంగతి యేమిటీ?

మహారుద్రయ్య : చిన్నరాణీగారి వ్రతం సంగతి యోచిస్తే ద్రోహం జరిగి వుండవచ్చు. అబ్బాయిగారి శీలనైశిత్యం గుర్తిస్తే జరిగివుండకా పోవచ్చు.

రాజరాజు : (వెటకారంగా తల యెగరవేసుకుంటూ) ఓహో! అదా మీ యెత్తు?

మహారుద్రయ్య : తమ రాగ్రహిస్తే నేను తాళకోలేను; కాని నా మనవి పూర్తికాకుండా—(అర్ధోక్తి.)

రాజరాజు : అలాగే కానివ్వండీ చూతాం.

మహారుద్రయ్య : చిత్తం. వెళ్లినట్టు వీరూ అంగీకరిస్తారు. వచ్చినట్టు వారూ అంగీకరిస్తారు. అయితే, పూజాసమయాన— (అర్ధోక్తి)

రాజరాజు : ఆ, మీరూ గుర్తించారూ అదీ? పోతుటీగ అయినా చూడకూడదని నియమం కదా. అందువల్లనే నేను దూరంగా వుండవలసి వస్తోంది కదా, మరి అబ్బాయి యెలా వెళ్లగలిగాడూ?

మహారుద్రయ్య : అబ్బాయి యెలా వెళ్లగలిగారూ అంటే అతకడం లేదు, మహాప్రభూ, వారెలా రానిచ్చారూ?

రాజరాజు : (తెల్లపోతాడు)

మహారుద్రయ్య : అంటే, నా విన్నపం అంతర్యానికి తెచ్చుకో గోరుతున్నాను. దీనివల్ల బాధ్యత యెవరిమీద—(అర్ధోక్తి)

రాజరాజు : (కంగారుపడి) ఊఁ, ఊఁ, కాలహరణం చెయ్యక మీకు తోచిన శిక్ష యేమిటో తొరగా చెప్పండీ!

మహారుద్రయ్య : మనవి చేసుకుంటున్నాను. ఇలాగ, పూర్వాపరసందర్భాలు పరిశీలిస్తే, శిక్ష విధించాలి. ఆ శిక్ష ఉభయతారకంగానూ వుండాలి.

రాజరాజు : ఊఁహూఁ!

మహారుద్రయ్య : నా బుద్ధికి తోచిం దేమిటంటే? బతికుండగా కళ్ళబడకుండా వుండేటట్టూ, మళ్లీ రాజమహేంద్రపురం ప్రవేశించ

కుండా వుండేటట్టూ, ఈ ప్రాంతమే మరిచిపోయేటట్టూ కట్టడి చేసి, దూరస్థమైన యే మండలానికో ఆధిపత్యం——(అర్ధోక్తి)

రాజరాజు: (మండిపడి పళ్లుకొరుకుతూ) మండలాధిపత్యం ట మండలాధిపత్యం?

మహారుద్రయ్య: (మొగం వంచుకుంటాడు)

రాజరాజు: నుంచున్న పాళంగా సామ్రాజ్యాధిపత్యమే సమర్పించుకోవద్దూ?

మహారుద్రయ్య: (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

రాజరాజు: ఈ విషయం మీ రింత తేలికగా భావిస్తా రనుకోలేను, నేను.

మహారుద్రయ్య: (మొగంవంచుకునే వుండి వూరుకుంటాడు)

రాజరాజు: మీ రింత అసందర్భంగా ఆలోచన చెబుతారని కూడా నే ననుకోలేదు

మహారుద్రయ్య: (మొగం వంచుకునే వుండి వూరుకుంటాడు)

రాజరాజు: ఇది నలుగురికీ తెలిస్తే నా స్థితి యెంత రసాభాస అయిపోతుందో——(అర్ధోక్తి)

తెరలో

"మహాప్రభూ!

రాజరాజు: (ద్వారంకేసి చూస్తూ) ఏమిటది?

మహారుద్రయ్య: (చూసి) చిట్టి మహాప్రభూ!

రాజరాజు: ఎందుకుట?

మహారుద్రయ్య: చిట్టీ!

చిట్టి వస్తుంది. "ఎందుకూ?" అన్నట్టు రాజూ, మహారుద్రయ్యా ఆత్రంగా చూస్తారు.

చిట్టి: దర్శనం కోరి మహామంత్రిగారు వేచివున్నారు మహాప్రభూ!

మహారుద్రయ్య: (చకితు డవుతాడు)

రాజరాజు: (చకితుడై, వొక్కమాటు మహారుద్రయ్యకేసి చురుగ్గా చూసి, రూక్షంగా చిట్టితో) ఇప్పు డెంతమాత్రమూ వీలు లేదని చెప్పు. నువ్వు మళ్లీ యీ వార్త తేవద్దు, వెళ్లిపో.

చిట్టి వెళ్లిపోతుంది.

మహారుద్రయ్య: (నసుగ్గా) సంగతేమిటో—(అర్ధోక్తి)

రాజరాజు: (కటువుగా) ఏమిటోనా? ఇంకా మీకు బోధపడ లేదూ?

మహారుద్రయ్య: (మెల్లిగా) లేదు మహాప్రభూ!

రాజరాజు: సంగతంతా అప్పుడే అందరికీ తెలిసిపోయిం దన్న మాట.

మహారుద్రయ్య: (చూసి వూరుకుంటాడు)

రాజరాజు: మల్లప్ప, ద్రోహిని పట్టి తీసుకురావడం కూడా అందరూ చూశా రన్నమాట.

మహారుద్రయ్య: (చూసి వూరుకుంటాడు)

రాజరాజు: మీ యేర్పాటు లింత చక్కగా వున్నయన్నమాట

మహారుద్రయ్య: (మొగం వంచుకుని వూరుకుంటాడు)

రాజరాజు: చిట్టివీరన్న గారు ద్రోహిని విడుదల చేయించ డానికి వచ్చారన్నమాట. ఇక తమ్ముడు వస్తా డన్నమాట. తరవాత మహారాణీ కూడా—(అర్థోక్తి)

మహారుద్రయ్య: (దోసిలి వొగ్గి నమ్రుడై) అపరాధిని.

రాజరాజు: ఇప్పుడు మీ అపరాధనివేదనలతోటీ, క్షమాభిక్ష తోటీ యేమి ప్రయోజనమూ? నేను మీమీద ఆగ్రహపడుతూ కూచుంటే మాత్రం యేమి ప్రయోజనమూ? (చూసిచూసి) ఇప్ప డయినా నేను చెప్పినట్టు చేస్తారా చెయ్యరా?

మహారుద్రయ్య: (దోసిలి వొగ్గి) నాకు తోచింది విన్నవించు కున్నానేగాని నేనెప్పుడూ, తమ ఆజ్ఞ జవదాటి యెరగను, సెలవిప్పిం చండి మహాప్రభూ!

రాజరాజు: ఇక విచారణతో పనిలేదు.

మహారుద్రయ్య : చిత్తం మహాప్రభూ !

రాజరాజు : ఇది రెండోకంటివాడికి తెలవగూడదు.

మహారుద్రయ్య : చిత్తం మహాప్రభూ !

రాజరాజు : నుంచున్న పాటున — అతిరహస్యంగా ద్రోహిని కోట దాటించాలి.

మహారుద్రయ్య : అక్షరాలా నిర్వహిస్తాను మహాప్రభూ !

రాజరాజు : రెండో జాము దాటకుండా పని జరిగిపోవాలి.

మహారుద్రయ్య : చిత్తం, సెలవిప్పించండి మహాప్రభూ !

రాజరాజు : (పక్కకి చూస్తూ, పళ్లు కొరుకుతూ) మాతృద్రోహి కాళ్లూ చేతులూ తెగ్గొట్టించండి.

మహారుద్రయ్య : (తల వంచుకుంటాడు)

రాజరాజు : (తీక్షణంగా చూస్తూ, కరుగ్గా) వెళ్లండి.... ....... వెళ్లిపొండి.

బుర్ర వంచుకుని మహారుద్రయ్య వెళ్లిపోతాడు.

రాజరాజు : (గుమ్మంకేసి చూస్తూ) చిట్టీ !

చిట్టి : (వచ్చి) ఏమి సెలవు మహాప్రభూ !

రాజరాజు : జక్కులదీవి రాణీగారి నగరి వార్త లన్నీ మనకి అక్షరాలా తెలవాలి.

చిట్టి : ఏర్పాట్లు చేస్తాను మహాప్రభూ !

రాజరాజు : ఇంకా నుంచున్నావు.

చిట్టి : లేదు, వెళ్లిపోయాను మహాప్రభూ !

ముందుగా చిట్టి వచ్చినదారినే వెళ్లిపోతుంది. తరవాత, రాజు, రెండో వేపుగా వెడతాడు.

# ఇరవైనాలుగో రంగం

గాడాలచేరువ అరణ్యం. రాత్రి జామున్నర అయింది. తమ పరివారంతో విజయాదిత్యుడూ, సుబుద్ధీ వొక వైపునుంచీ, తన పరివారంతో మహారుద్రయ్య ఒక వైపునుంచీ వచ్చి తారసపడతారు. పుచ్చపువ్వు లాగ వెన్నెల.

మహారుద్రయ్య: (నిదానించి చూస్తూ) ఎవరు, విజయాదిత్యుల వారా?

విజయాదిత్యుడు: (కరుగ్గా) ఔను.

మహారుద్రయ్య: (తల పంకించి నిర్లక్ష్యంగా) ఎందాకా?

విజయాదిత్యుడు: (నిరసనగా) తమకోసమే!

మహారుద్రయ్య: (తల పంకించుకుంటూ) ఓహో! పనేమిటీ?

విజయాదిత్యుడు: (వెటకారంగా) తమ పాదాలు సేవించుకోడమూ, తమవల్ల సర్వనాశనం పొందడమూను. మరేం పనీ మాకు?

మహారుద్రయ్య: (నిర్లక్ష్యంగా) ప్చ్...... ఇవాళ హఠాత్తుగా వివేకోదయం అయింది కామోసు. (ఒక్క పాటు సుబుద్ధికేసి చూపి మళ్లీ విజయాదిత్యుడితో) ఈ ధోరణే అలాగే వుంది. మరి విశేషం యేమిటీ?

సుబుద్ధి: (విజయాదిత్యుడితో) తమ రుండండి మహాప్రభూ!

విజయాదిత్యుడు: (మహారుద్రయ్యతో) ప్రభువులకు దురాలోచనలు చెప్పి, దురాశలు పుట్టించి, దుస్సంకల్పాలు చేయించి,—(రూక్షంగా చూస్తాడు)

మహారుద్రయ్య: (కరుగ్గా) దుష్టమైన ఆజ్ఞలు పొంది, నానా దురవస్థలకూ పాల్పడి,—(తల పంకించుకుంటాడు)

విజయాదిత్యుడు: ప్రభువులను కీలుబొమ్మలుగా చేసి,—

మహారుద్రయ్య: ఆ కోవలోనే చేరిన తమరు—(అర్ధోక్తి)

సుబుద్ధి: (విజయాదిత్యుడితో) తమ రుండండి మహాప్రభూ! (మహారుద్రయ్యతో, కరుగ్గా) సారంగధరులవారి నేమి చేశారూ మహారుద్రయ్యగారూ, మీరు?

మహారుద్రయ్య: (సుబుద్ధికేసి కన్నుగీటుతూ, విజయాదిత్యుడితో హేళనగా) వేలెడేసివాళ్లుగూడా ప్రభువులను కీలుబొమ్మలుగా చేసి—(వికటంగా నవ్వుతాడు)

సుబుద్ధి: నేను సహించలేను. తమ రుండండి మహాప్రభూ! (మహారుద్రయ్యతో) ఏమి, సారంగధరులవారి నేమి చేశారూ మహారుద్రయ్యగారూ, మీరూ?

విజయాదిత్యుడు: నేనూ ఆ మాటే అడుగుతున్నాను. అబ్బాయి నేమి చేశారూ మీరూ?

మహారుద్రయ్య: (నిర్లక్ష్యంగా) ఆజ్ఞాపించడాని కయినా, ఏమి చేశావనడగడాని కయినా పైని సార్వభౌములున్నారు, శుకానువాదం చేస్తూ తమ రెవరూ, మధ్యని, యిలా కలగజేసుకోడానికి?

విజయాదిత్యుడు: (పళ్లు కొరుకుతూ) నేనా? (సుబుద్ధికేసి చూస్తాడు)

సుబుద్ధి: నేనుండగా తమ కెందుకూ శ్రమ? (మహారుద్రయ్యతో) ఇలా చూడండీ, సారంగధరులవారి నేమి చేశారూ మీరూ?

మహారుద్రయ్య : (సుబుద్ధితో హేళనగా) "మహాగజాః పలాయంతే మశకానాం తు కా గతిః ?" దోమగా! నోరు సమాళించుకుని తప్పుకో. (విజయాదిత్యుడితో) సార్వభౌముల పరివారాన్ని ఆటంకపరుస్తున్నారు తమరు. దీనివల్ల చాలా చిక్కు లున్నాయి. ఇప్పుడయినా మర్యాదగా తప్పుకోండి.

విజయాదిత్యుడు : మీరు కదిలారంటే మాట దక్కదు; యోచించుకోండి.

మహారుద్రయ్య : యోచన! నాడే అయిపోయింది. రాజసేవలో ప్రవేశించడం వైభవాల కాశించి కాదు; ప్రాణాలకు తెగించీ. తమరూ వొకప్పుడు ప్రభుత్వం చెలాయించి వుండినారు. కనక, తమకున్నూ సేవకులు ఆజ్ఞానువర్తు లయి వుండా లనివుంటే ముందు మర్యాదగా తప్పుకోండి. తమ సందేహాలు తీర్చుకోడం యిక్కడ కాదు, ప్రభు సన్నిధిని.

సుబుద్ధి : (విజయాదిత్యుడితో) కాలహరణం తప్ప మరేమీ ప్రయోజనం లేదు, సెల విప్పించండి మహాప్రభూ! (మహారుద్రయ్యతో రూక్షంగా) ఇక్కడ ముఖపిధానం చేద్దా మంటే సాగదు. (కత్తి దూసి) యువరాజులుంగారి సంగతి చెప్పిమరీ కదులు.

మహారుద్రయ్య : (వికటాట్టహాసం చేసి సుబుద్ధితో) కుర్రకుంకా! కాలికిందికి చాలవు. (విజయాదిత్యుడితో) ఇక సహించను.

విజయాదిత్యుడు : (కత్తి దూసి) కాసుకో.

మహారుద్రయ్య : ఓహో ! (వెనకనున్న తనవారి కేసి చూసి) మీ రెవరూ కలగజేసుకోనక్కరలేదు. (విజయాదిత్యుడి పరి

వారంతో) పెళ్లాం బిడ్డలమీద ఆశలు వదులుకుంటే మీరూ కత్తులు దుయ్యవచ్చు. (కత్తి దూసి సింహనాదం చేస్తాడు)

సుబుద్ధి: (అపవారించి, విజయాదిత్యుడితో) జట్టులో మల్లప్ప లేడు, జంకకండి మహాప్రభూ!

విజయాదిత్యుడు: (సింహనాదం చేసి పరవళ్ళు తొక్కుతాడు)

సుబుద్ధి: (మహారుద్రయ్యతో) సమతలానికి రా.

మహారుద్రయ్య: (వికటంగా) సమతలం? (పళ్లు కొరుకుతూ) చేతకాకపోతేనూ. (విజయాదిత్యుడికేసి తీక్షంగా చూస్తూ) హర హర మహాదేవ!

మహారుద్రయ్య విజయాదిత్యుడి మీది కురుకుతాడు. ఇద్దరూ పోరుతూ సమతలానికి దారితీసారు.

సుబుద్ధి: (కంఠం నొక్కుకుని తమ పరివారంతో) మల్లప్ప లేడు, కమ్ముకోండి.

సుబుద్ధీ, విజయాదిత్యుడి పరివారమూ సింహనాదాలు చేసుకుంటూ మహారుద్రయ్యమీద పడడానికి వెళ్లిపోతారు. అది చూసి ఈ సంగతి ప్రభువుతో చెప్పడానికొకడు నగరానికి దారితియ్యగా తక్కిన మహారుద్రయ్య జట్టు, వారిమీద పడుతుంది.

# ఇరవైఅయిదో రంగం

రాజరాజు నగరికీ చిత్రాంగి నగరికీ మధ్య. రాత్రి రెండో జాము ముగిసింది. రాజు చిత్రాంగి నగరికి వెడుతూ వుంటాడు. శరవేగాన వచ్చి వొక భృత్యుడు నమ్రుడవుతాడు.

బేతాళుడు: శరణు శరణు మహాప్రభూ!

రాజరాజు: ఎవ రదీ?

బేతాళుడు: నేను బొంగరాల బేతాళుణ్ణి మహాప్రభూ!

రాజరాజు: ఆ, ఏమిరా?

బేతాళుడు: (ఏడుపుమొగం పెట్టుకుని అంతా అయిపోయిందన్నట్టు చేతులు తేలవేసుకుంటాడు)

రాజరాజు: (విసుగ్గా) ఏమయిందిరా?

బేతాళుడు: నారాయణభట్టుగారు నన్ను తరిమి పంపారు దేవరా!

రాజరాజు: (ఆత్రంగా) ఏమిటి సంగతి?

బేతాళుడు: (దుఃఖంతో) నన్నయభట్టారకులవారు — కైలాసానికి—(అర్థోక్తి)

రాజరాజు: (నెత్తికొట్టుకుంటూ) శివశివా! శివశివా!

బేతాళుడు: నగరం అంతా దుఃఖం ఆవరించేసింది మహాప్రభూ! నూరేళ్ల వృద్ధులు కూడా యెన్నడూ యింతటి దుఃఖం

యెరగ మని, యుగాలు గడచినా యిది తరిగేది కాదనీ, సామ్రాజ్యాని కంతకీ వెలుగు తెచ్చే మహాకవి అకాలదుర్మరణం—(అర్ధోక్తి)

రాజరాజు : నిజమే, సామ్రాజ్యానికే కాదు, జాతికే సభ్యత సంఘటించే వాఙ్మయనిర్మాత భట్టారకులవారు. నా తొందరపాటువల్ల మొదటి వాఙ్మయనిర్మాతనే చిన్నచూపు చూసిన జాతి అయిపోయింది మనది.

బేతాళుడు : మమ్మేలినవారి పేరుగా వెలసిన యీ మహానగరంలో, ఆదిలోనే యిలాంటి దారుణప్పని జరగడంవల్ల ఎంతెంతలేసి వాఙ్మయనిర్మాతలూ కూడా, యిక్కడ, అలజడి యెరగని బతుకు బతకడం సిద్ధించదేమో అనీ గోలపెట్టేస్తున్నారు రాజాధిరాజా!

రాజరాజు : ఎంత పని జరిగిపోయిందిరా? ... ...ఉరుకుపరుగులతో కొండలు దొలిచేసి కూలంకషంగా ప్రవహించే అఖండ గోదావరి నా రాజధాని దగ్గిరే చీలిపోయింది. నా ప్రయత్నంవల్లనే ప్రసన్నగంభీరంగా బలపడుతున్న ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యం నా తరంలోనే కంటకితం అయిపోయింది. నా రాజమహేంద్రపురవాసులకు, మహాకవులను పూజించుకోలేని నా పోలికే వచ్చిపోతుందేమో కదా యేమి గతి?

బేతాళుడు : చిత్తం మహాప్రభూ, చూస్తూ చూస్తూ మహాకవిని కోలుపోయాం. మనం బతికి వుండి ప్రయోజనం యేమిటీ అని కూడా పౌరులు—(అర్ధోక్తి)

రాజరాజు : అవును. పౌరులు, తిరుగుబాటు చేసి అయినా నన్ను మంచిదారికి మళ్లించివుండగూడదూ? గతజల సేతుబంధనం లాగ శవం చుట్టూ మూగి యిప్పు డెంత కొట్టుకుంటే యేమి లాభమూ?

బేతాళుడు : ఆ మూకలోనుంచి నేనిలా రావడమే కష్టం అయిపోయింది, భట్టారకులవారి భవనమూ, ఆ వీధీవాడా కూడా యిసక వేస్తే రాలకుండా—(అర్ధోక్తి)

రాజరాజు : (నిట్టూర్పు విడిచి) నా తిరస్కారమే వుండిపోయింది, మహానుభావా, నీ కేమి లోటూ? ఆదిలో నీ హృదయం

అధిష్ఠించగలిగిన నాకు, ఇవాళ, నీ పాదాల కింద అయినా చోటు లేదు కదా ?

బేతాళుడు : మండువాలో చోటు చాలక, జనం కోరిక చొప్పున శవాన్ని, ముంగిట వున్న చంద్రకాంతవేదికమీద వుంచారు మహాప్రభూ ! సోమిదేవమ్మగారు, మాటలేకుండా, శవం పక్కని నిర్జీవ ప్రతిమ అయి కూలబడిపోయి వున్నారు దీనజనశరణ్యా !

రాజరాజు : (కళ్లు మూసుకుని అంజలిబంధం పైకెత్తి) తల్లీ ! నీ కీలాంటిగతికల్పించిన కిరాతుణ్ణి నేనూ ?

బేతాళుడు : అమ్మగారికి వూపిరాడడానికీ, జనానికి భట్టారకుల వారి మొగం కనపడడానికీ, శరపరంపరలుగా కురిసిపోతూవున్న పువ్వులూ పువ్వుల దండలూ తప్పించలేక నారాయణభట్టుగారూ, పావులూరు మల్లన్నగారూ పొట్టుపొట్టయిపోతున్నారు రాజాధిరాజా !

రాజరాజు : ప్రయత్నమే కాని భట్టారకులవారి మహానుభావం యెత్తునా పుష్పా లెవరు సమర్పించగలరూ ? ఏమయినా ఆ పుష్ప రాశిలో సగంపెంతు నాదయి వుండవలసింది ; కాని చేతులారా ఆ మహాభాగ్యం నేనే పోగొట్టుకున్నాను.

బేతాళుడు : ఆంధ్ర మహాభారతమూ, ఆ మహాగ్రంథం లిఖించిన నారాయణభట్టుగారి పమిడిగంటమూ. భట్టారకులవారి వ్యాసపీటా వుంచడానికి దగ్గర వుండి, చీదమయ్యగారు పూలపాలకీ సిద్ధం చేయిస్తున్నారు మహాప్రభూ!

రాజరాజు : (అదిరిపడి, ఆదుర్దాగా) అదెందుకురా ?

బేతాళుడు : భట్టారకులవారితో కూడా కోటిలింగాలకు తీసుకు వెడతారు మహాప్రభూ!

రాజరాజు : (ఆత్రంగా) తీసుకువెళ్ళి ?

బేతాళుడు : కపాలమోక్షం అయిూదాకా శ్మశానంలో వుంచి, తరవాత మార్కండేయస్వామి ఆలయానికి తీసుకువచ్చి, మహారుద్రాభిషేకం చేయించి, స్వామి సన్నిధిని వుంచుతారు మహాప్రభూ !

రాజరాజు: (గుండెలమీద చేతులు వేసుకుని నిట్టూర్పు విడుస్తూ) అమ్మయ్యా! సగం వూపిరితోనైనా రాజరాజు ఆకల్పాంతమూ నిలిచిపోతాడు, భయం లేదు.

బేతాళుడు: నగరంలో వున్న స్త్రీ లందరూ—అసూర్యం పశ్యలు కూడా అక్కడికి వచ్చేశారు మహారాజా! కుంకుమబొట్టుంచీ, హారతు లిచ్చీ, పాదాభివందనాలు చేసుకునీ, సోమిదేవమ్మవారిని కడసాకం సేవించుకోడాని కాత్రపడుతున్న ఆ పేరంటాళ్లు పువ్వుల గుట్టలు దాటలేకా, పూలదండల డొంకలు తప్పించుకోలేకా తూలిపోతున్నారు జగత్ప్రభూ!

రాజరాజు. సోమిదేవమ్మగా రంటే స్త్రీల కందరికీ దేవీభావనే కదా, ఆశ్చర్యం యేమిటీ? ముఖ్యంగా మహారాణీకీ, పార్వతీఅమ్మవారటూ. సోమిదేవమ్మగా రిటూను. అలాంటి సోమిదేవమ్మగారి నిలాంటి స్థితికి తెచ్చి, మహారాణీకిన్నీ అపచారం చేసినవా ణ్ణయిపోయాను నేను.

బేతాళుడు: మహారాణీవారు, శవానికి స్నానం చేయించడాని కయిదు కావళ్ల పన్నీరూ. మీద చిలకరించడానికి అయిదు గిండ్లతో అయిదు విధాల సుగంధతైలాలూ, మీద కప్పడానికి క్షీరాబ్ధిపట్టుతాపితాలూ పంపించారు మహాప్రభూ?

రాజరాజు: హాహహహా! మహారాణీ మిత్రమూ, మహారాజు శత్రువూనా? ఎంత వ్యత్యాసమూ? అయితే, నాకున్నూ వార్త ముందే యెందుకు వచ్చింది కాదుటా?

బేతాళుడు: రాకేం మహాప్రభూ! మరణచిహ్నాలు గుర్తించి యేలినవారితో మనవిచేసుకోడానికి మహామంత్రులవారే యిక్కడికి వేంచేశారు. కాని, దర్శనం దొరక్క—(అర్ధోక్తి)

రాజరాజు: (నెత్తి కొట్టుకుంటూ) శివా! శివా! అందుకా వారి రాక? (పశ్చాత్తాపడుతూ) ఎంత పని జరిగిందీ? ఎంత భ్రాంతి పడ్డానూ? ఎలాంటి పుణ్యకాలం దాటపెట్టుకున్నానూ?

బేతాళుడు : చివరి గడియల్లో అబ్బాయిగారి దర్శనం అయినా దొరుకుతుం దేమో అని—(అర్ధోక్తి)

రాజరాజు : (మాట మరిపిస్తూ) సరే సరే, నువు వెళ్లు. వెళ్లి అక్కడే వుండిపోయి నారాయణభట్టుగారి ఆజ్ఞలు పాలిస్తూ వుండు. సర్వమూ సలక్షణంగా జరగాలనీ, ఏ లోపమూ రాగూడ దనీ నారాయణభట్టుగారితో నా మాటలుగా విన్నవించు.

బేతాళుడు : చిత్తం మహాప్రభూ!

రాజరాజు : చళుక్యసామ్రాజ్యం నన్నయభట్టారకులవారి కెంతో ఋణపడి వుంది. అది యుక్తమార్గాన తీర్చుకోడానికి అవకాశాలు తప్పిపోయాయి ఆ ఋణమూ యీ లోపమూ యిప్పుడయినా తీర్చుకోవలసి వుంది కనక,—సాధ్య మైనంత త్వరగానే—తెల్లవారకుండానే నేనూ వస్తాను, కాని యీలోపున—భట్టారకులవారికి సకల రాజలాంఛనాలూ చెల్లించవలసిందని చిట్టిపిన్నగారితో—(అర్ధోక్తి)

బేతాళుడు : వారిప్పు డక్కడ లేరు మహాప్రభూ!

రాజరాజు : మరెక్క డున్నారూ?

బేతాళుడు : తెలవదు దేవరా! వా రెక్కడికి వేంచేశారో యెవరూ చెప్పలేకుండా వున్నారండి.

రాజరాజు : అదేమిరా?

బేతాళుడు : వైద్యులు, భట్టారకులవారిని భూశయనం చేయించవలసిందే అంటున్నారు. పురోహితులు దర్భశయ్య సిద్ధంచేస్తున్నారు. ఆ సమయాన యింటి భృత్యుడు వచ్చి యేదో వార్త చెప్పగా గుర్రం యెక్కి వాయువేగమనోవేగాలతో—(అర్ధోక్తి)

రాజరాజు : (చకితుడై) ఆ! ..పోనీ, తమ్ముడితో చెప్పు.

బేతాళుడు : వారి జాడా — (అర్ధోక్తి)

రాజరాజు ; అయ్యో! ఏమయినట్టురా ?

బేతాళుడు : ఎవరూ చెప్పలేకుండా వున్నారు మహాప్రభూ! మహారుద్రయ్యగారు కూడా అక్కడ లేరండి. తక్కిన ఆరుగురు మంత్రులూ మాత్రమే అక్కడ కనిపెట్టుకుని వున్నారండి.

రాజరాజు : పోనీ, వారితోనే చెప్పు. వారి నందర్నీ అక్కడే వుండిపొమ్మను. చూడూ, సర్వసేనాధిపతిగారిని—(అర్ధోక్తి)

బేతాళుడు: వారున్నూ యిప్పు డక్కడ లేరు మహాప్రభూ!

రాజరాజు: (ఆత్రంగా) ఇప్పుడంటే?

బేతాళుడు: భట్టారకులవారిని భూశయనం చేయించేదాకా అక్కడే వున్నా రండి వారు. శవంమీద పువ్వులు కూడా ముందుగా వారే చల్లారండి. కాని, తరవాత జరగవలసిన తంతువిషయమై నారాయణభట్టుగారితోనూ, భీమకవిగారితోనూ మంతనాలు చేస్తూ వుండగా, పడవాళ్లు, జగ్గరాజుగారూ తిరపారెడ్డిగారూ రుద్రప్పనాయనింగారూ శరభారాయణింగారూ బేతిసీడుగారూ ఆత్రంగా వచ్చి వారిని తోడుకుపోయారు మహాప్రభూ!

రాజరాజు: ఇవతల సరస్వతీపురుషావతారం తనువు చాలించిన సమయానే అవతల మరేదో మునిగిందా వారి కందరికీ?

బేతాళుడు: చిత్తం మహాప్రభూ, అది చూసి అందరూ చకితులయిపోయారండి. అక్కడ వుండిన పెద్ద లంతా భట్టారకులవారి స్థితి చూసీ యిది చూసీ—(అర్ధోక్తి)

రాజరాజు: సరే, నువ్వు వెళ్లు. వెళ్లి, నారాయణభట్టుగారితోటీ, మల్లన్నగారితోటీ—అయితే భీమకవిగా రక్కడే వున్నారు కాదూ?

బేతాళుడు: ఉన్నారు మహాప్రభూ, (జంకుతూ) అయితే,—మమ్మేలినవారు—కటాక్షిస్తే—(నాన్చేస్తాడు)

రాజరాజు: సరే, చెప్పు.

బేతాళుడు: పూర్తిగా వీరభద్రావతారం తాల్చి—(అర్ధోక్తి)

రాజరాజు: కాక వారికేం? నన్నయభట్టారకులవారు చలిపిడుగూ, భీమకవిగారు చిచ్చరపిడుగూనూ. ఆగ్రహం వస్తే వారి యెదట యెవరు నిలవగలరూ? అయితే, వారేమి సెలవిచ్చారూ?

బేతాళుడు: నోటి మాటలుగా ఏమీ సెలవిప్పించ లేదండి. ఈ వుత్తరం మాత్రం—

నమ్రుడై, ఉత్తరం దోసిట వుంచుకుని భృత్యుడు చేతులు చాపుతాడు. రాజు, మునివేళ్లతో అది పుచ్చుకుని, విప్పి, కళ్లు చికిలించుకుంటూ చూస్తాడు.

బేతాళుడు: పండువెన్నెలే గాని వెలుగు చాలదు. దీపం తెస్తాను మహాప్రభూ?

రాజరాజు: అక్కర్లే దక్కర్లేదు. నేను భట్టారకులవారి గుండెలు చీల్చేశాను. ఆ గుండెలలో నుంచి వుబికిన వేడినెత్తుటితోటే భీమకవిగా రీవుత్తరం రాశారు. భట్టారకులవారి ధర్మజ్యోతి అంత ర్లీనంగా, కెంపుల దండల్లా వున్నాయి అక్షరపంక్తులు, ఇంకెందుకురా దీపం?

బేతాళుడు: చిత్తం, చిత్తం.

రాజరాజు: (కళ్లు చికిలించుకుంటూ)

"రాజా, నువ్వింత మూఢుడ వనీ, యింత మూరుడ వనీ నేనెప్పుడూ అనుకోలేదు"

"నువ్వు గోముఖవ్యాఘ్రాని వని కూడా నేనెన్నడూ అనుకో లేదు"

"వేదమూర్తీ, షట్కర్మనిరతుడూ, ధర్మతత్వజ్ఞుడూ, తప శ్శాలీ, అలౌకిక చరితుడూ, నీ కులబ్రాహ్మణుడూ, వాగనుశాసనుడూ, వశ్యవాక్కూ, మహాకవీ అయిన నన్నయభట్టారకుని మృతికి కారణం కావడంకంటే నువ్వు చెయ్యగల అకృత్యం యింకొకటి లేదు"

"ఏ పది సంవత్సరాలపాటో మిసమిసలు చూపగల జవరాలి కోసం ఘోరమైన అధర్మానికి వొడిగట్టడమే కాకుండా, ధృవతార లాగ యుగయుగాంతరాలు మెరిసిపోగల మహాభారతం—నీ వంశచరిత్రను గడ్డిపరక వతుగా చూసుకున్నావు. నిన్ను అనవలసింది కూడా యేమీ లేదు"

"అయితే, ఎంతెంతలేపి చక్రవర్తులనూ గూడా ఉదాసీనంగా చూడగల అవిచ్ఛిన్నమైన లోకం వుంది. పాండవోత్తముల ధర్మేతి హాసం దానికి కావాలి; కాగా, శేషభారతం యెన్నటి కయినా పూర్తిగా ఆంధ్రీకృతం కాకపోదు. అది కూడా రసవంతమూ ప్రామాణిక మున్నూ కాకపోదు; కాని, నన్నయభట్టారకుని వంటి కవి యిక పుట్ట బోడు. నన్నయభట్టారకుని రచన వంటి రచన కూడా యిక, ఆంధ్ర వాఙ్మయంలో వెలయబోదు"

" శేషభారతంలో నీ నామరూపాలే వుండవు "

" అపిచ. బంతిపువ్వు లా వెలిగే దీపం కొండెక్కితే, సుధా ధవళ కాంతులీనే గాజుకుప్పె నలుపే. క్షుద్రమే. అలాగే, నన్ను పార్శ్యని సాహచర్యం వుండింది కనక, నేటివరకూ జగజ్జేగీయమానమై వెలిగిన నీ జీవితం, అది వుండబోదు కనక, యిక, ప్రాకృతుని వ్యర్థ జీవితం పాటిదే, క్షుద్రమే"

" ఇంతకీ ; ఏవ రెన్ని అన్నా, యిప్పుడు నీ కేమీ వినాపడదు, కనాపడదు ; కాని, నీ కొడుకు బైరాగుల్లో కలిసిపోతాడు, తప్పదు. నీ పట్టమహిషి దుఃఖదేవత అయిపోతుంది, నమ్ము. నీ నవోఢ నిన్ను లక్ష్యపెట్టదు. ఈసడిస్తుంది, తిరస్కరిస్తుంది, ధిక్కరిస్తుంది, నీ ఆశలు నిరాశలు చేసి తన దారి తాను చూసుకుంటుంది, చూసుకో. నీ దుష్ట శక్తులికి ప్రేరకు డైన మహారుద్రయ్య దిక్కుమాలిన చావు చస్తాడు, తెలుసుకో. నీ రాచరికానికి అంతరాయం యేర్పడుతుంది, పరకా యించుకో "

" తెలుసుకోగలిగితే నీకీ దుర్గతి చాలు. నా తపశ్శక్తినీన్నీ వ్యర్థం చేసుకుని నీకు సంఘటించవలసిన నికృష్టత యింతకు మించింది మరి లేదు పో "

" వేములవాడ భీమకవి "

(కొంతసేపు దిగ్భ్రాంతుడై వుండి) విద్వత్పర్వతం సకలవిశిఖరంగా కుంగిపోయింది. అమూల్య జాతిరత్నా లన్నీ పాతాళంపా లయిపో యాయి. వంశచరిత్ర అధ్వాన్నం—(నిరాశాదుఃఖంగా) వంశమే అంత మయిపోయేటట్టుంది, యిక వంశచరిత్ర యెక్కడ ?.........చిట్టివీరన్న గారూ, తమ్ముడూ, సర్వసేనాధిపతీ, పడవాళ్లూ యేమయినట్టు ? భట్టా రకుల మాట వినకపోవడం—శుష్కపాండిత్యమే కాని భావుకత లేని మహారుద్రయ్యగారి సాచివ్యమె యింతకీ కారణం అయిందా ?........ చిత్రాంగి వర్తమానం యేమిటో, యెందుకో చూసుకుని, తరవాత యే సంగతి అయినానూ.

రాజు, కాళ్లీడ్చుకుంటూ చిత్రాంగి మేడకేసి వెళ్లిపోతాడు.

చిలక: (రాజుతో) కళ్లు కావు నీవి, గాజుబిళ్లలు. ఎందుకా వ్యర్థ ప్రయాస?

రాజరాజు: (చిలకని రూక్షంగా చూస్తూ) ఆ!

చిత్రాంగి: (వికటంగా నవ్వి) ఇలా చూడూ, కొడుకు నేం చేసుకున్నావ్?

రాజరాజు: (చూసిచూసి) ఎవరికీ కొడుకు?

చిత్రాంగి: (మోడ్పు కేలితో రత్నాంగి నగరికేసి చూపిస్తూ) ఆ మహాయిల్లాలు, రత్నాంగీదేవమ్మగారికి.

రాజరాజు: మరి—నీకు?

చిత్రాంగి: పతి—(అని స్ఫుటంగా చెప్పి, వొక్క క్షణం ఆగి) అనుకుంటూ వచ్చాను; కాని, కొడు కయినా కాలేకపోయాడు, పిరికిపంద.

రాజరాజు: (కోపంగానూ, దిగులుగానూ) ఏమన్నావూ?

చిత్రాంగి: నేనన్నది బోధపడడానికి నువ్వింకో జన్మ యెత్తాలి. అదిగో, నీ కొడుకుని మృత్యువు తరుముకు వెడుతోంది. పోయి, ముందు రక్షించుకో.

రాజరాజు: (అభావదృష్టులు పరుపుతూ) ద్రోహం—(అర్ధోక్తి)

చిత్రాంగి: ద్రోహం! నీదీ ద్రోహం. కోడల్ని చెరపెట్టదలిచావు, ఇల్లాలికి కడుపుచిచ్చు తెచ్చిపెట్టావు. నీదీ క్రౌర్యం—నీదీ దౌష్ట్యం!

రాజరాజు: (తన కటారి పిడి పట్టుకుని పళ్లు పటపట్టాడిస్తూ) మర్యాదాతిక్రమణం చేస్తున్నావు. జాగ్రత్త.

చిలక: (పళ్లు కొరుకుతూ) మర్యాదట! ఎలా వుంటుందో యెరుగుదువా? (కటారి దూసి) తియ్యి కటారి.

చిత్రాంగి: (కటారి దూసి యెత్తి చూపిస్తూ) ఒక్క పోటుకి చాలవు: కాని, నిన్ను తాకరాదు, నువ్వు ఛండాలుడివి.

రాజరాజు: (ఆత్రంగా) ఆ! ఆ! అది సారంగధరుడిది.

చిత్రాంగి: ఔ, ఇది సారంగధరుడిదే. అతని చేతులతో నీ గుండెల్లో గుచ్చవలసిం దిది; కాని, నేను తన సవతితల్లి నని తన హృదయంమీద రాసి వుండిట. చీల్చి చూచుకోమని—(అర్ధోక్తి)

రాజరాజు: (నెత్తి కొట్టుకుంటూ) శివశివా! శివశివా!

చిలక: ఆ మాట వుచ్చరించడానికి నీకర్హత లేదు, చాలించు.

చిత్రాంగి: మరి—(తన గుండెలు చూపిస్తూ) ఇక్కడ యేమి రాసివుందో తెలుసా? నువ్వు పతితుడ వనీ, నీకొడుకు ఆడదనీ— పాపీ! చూసుకో.

"చిలకా" అని పిలుస్తూ చిత్రాంగీ, "తల్లీ" అంటూ చిలకా పొడుచుకుని పడిపోతారు. "ఆ, ఆ" అని ఆత్ర పడుతూ, చిత్రాంగిని పట్టుకోబోతూ రాజు వంగుతాడు.

చిలక: ఛండాలుడా, మా అమ్మని తాకవద్దు. అమ్మా, కటారి తీసేసుకోండి.

కటారి తీసేసుకుని హీనస్వరంతో "శివ—శి—వా" అంటూ చిత్రాంగి మెడలు వాల్చేస్తుంది. చిలక, రాజుతో "పాపీ! వుట్టికట్టుకు వూరేగు" అని, తానున్నూ కటారి తీసేసుకుని హీనస్వరంతో "శివ—శి—వా" అంటూ మెడలు వాల్చేస్తుంది.

రాజరాజు: (ఒక్క క్షణం పిచ్చిచూపులు చూపి) నాయనా! సారంగధరా, సారంగధరా! (అంటూ దురుసుగా వెళ్ళిపోతాడు)

---

# ఇరవైఏడో రంగం

రాజరాజు నగరి ముందరి బయలు. రాజు చిత్రాంగి నగరి నుంచి వస్తూ వుంటాడు. పరుగుపరుగున వచ్చి వీరశరభన్న అనే భృత్యుడు నమ్ర డవుతాడు.

వీరశరభన్న: శరణు శరణు మహాప్రభూ!

రాజరాజు: (దుఃఖార్ద్రకంఠంతో) ఆ, యెవ రదీ?

వీరశరభన్న: నేను వీరశరభన్నని మహాప్రభూ!

రాజరాజు: నువ్వు మహారుద్రయ్యగారితో వెళ్లావు కాదూ?

వీరశరభన్న: వెళ్లాను మహాప్రభూ! కాని మేము తిరిగి వస్తూవుండగా తమ్ముడుగారూ, సుబుద్ధి అయ్యవారూ మూకతో వచ్చి అటకాయించారు మహారాజా!

రాజరాజు: (రుష్టుడై) అటకాయించి?

వీరశరభన్న: కలపటం అయిపోయింది—(అర్ధోక్తి)

రాజరాజు: (విసుగ్గా) ఏమయింది చివరికి?

వీరశరభన్న: కాళ్లు తెగి, చేతులు తెగి, ముక్కు తెగి, చెవులు తెగి, పేగులు తెగి, తలకాయ యెగిరిపోయి, తమ్ముడిగారి చేతిలో మహారుద్రయ్యగారు దిక్కుమాలిన చావు చచ్చిపోయారు మహాప్రభూ,

రాజరాజు : (మండిపడుతూ) ఆ, తమ్ముడి పొగరూ!

వీరశరభన్న : సుబుద్ధిఅయ్యవారు—(అర్ధోక్తి)

రాజరాజు : (విచారంగా) అబ్బాయి మాట యేమిటిరా?

వీరశరభన్న : (అటూ యిటూ చూసి, వంగి, మెల్లిగా) కాళ్లూ, చేతులూ—(అర్ధోక్తి)

రాజరాజు : శివశివా! (కూలబడి) బతికివున్నట్టేనా?

వీరశరభన్న : మాటా చూపూ లేకుండా పడిపోయివున్నాడు, ముందు మాట చెప్పడం—(అర్ధోక్తి)

రాజరాజు : చెప్పడం గిప్పడం అలా వుంచి—(వుబ్బెత్తుగా లేచి) ముందు పంచకళ్యాణి పూన్పించు. తరవాత సంస్థానవైద్యుల నందర్నీ—(అర్ధోక్తి)

"శరణు శరణు మహాప్రభూ" అంటూ మరో భృత్యుడు వచ్చి నమ్రము డవుతాడు.

రాజరాజు : నువ్వెవరు?

యల్లమందప్ప : నేను యల్లమందప్ప—(అర్ధోక్తి)

రాజరాజు : సరే, యేమిటి నీ కంగారు? తొరగా—

యల్లమందప్ప : వల్లమాలిన మూకతో తమ్ముడుగారు దండెత్తివచ్చారు మహాప్రభూ!

రాజరాజు : (ఆవేశంతో) ఏమన్నావూ?

యల్లమందప్ప : కోట చొరబడేశారు మహాప్రభూ!

రాజరాజు : (ఉగ్రుడై) చొరబడి?

యల్లమందప్ప : నగరిమీదికి వచ్చేస్తున్నారు దేవరా!

యల్లమందప్ప: ముందు ఆయుధాగారం ఆక్రమించుకున్నారండి. ఇప్పుడు బొక్కసం—(అరోక్తి)

రాజరాజు: ఆక్రమించుకుంటున్నాడా? (సింహనాదం చేసి పరవళ్లు తొక్కుతూ చేతు లప్పళించుకుని) కొడుకు లేని రాజరాజుకి తమ్ముడు మాత్రం, యెందుకూ, పూర్తిగా వొక్కపోటుకి చాలడు. (జలదరింపు నటించి) ఏమీ, పిరికికండ లేని నాకు నేడీ కలత యేమిటీ,

తెరలో రణగొణధ్వని

రాజరాజు: (బలహీనపడిపోయినట్టు కటారి మెల్లిగా దూసి) ఏమి! భీమకవిగారి నిశితవాక్కులు నా నరాలు కుంగతీసేస్తున్నాయా? (రెండు చేతులూ యెగరవేసుకుంటూ, అంతకంతకు స్వరం హెచ్చిస్తూ) హరమహాదేవ! హరమహాదేవ! హరమహాదేవ........ కిల్లల్లల్లా—ద్రోహీ! ఎదటికిరా. (పరవళ్లు తొక్కుతూ రభసంగా వెళ్లిపోతాడు.)

అ యి పో యి ం ది